# వీక్లీ పోస్ట్

## మనలో మాట

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ని చిన్న చిన్న కొత్త శీర్షికలన్నీ పాఠకులు ఉత్సాహంగా పాల్గొనటం కోసం ప్రవేశ పెట్టబడ్డవే- వీటిలో టిట్ ఫర్ టాట్, ఫొటో వ్యాఖ్య పోటీ, వీక్లీ పోస్టులకి రోజూ మా కార్యాలయం చేరుతున్న పోస్టు కార్డుల సంఖ్య పందలలో వుంటున్నది. అందరికీ థాంక్స్!

★ కథల సంఖ్య ఎక్కువ కావాలనుకున్న వారికి- వాటిలో వైవిధ్యం ఉండాలని కోరేవారికి కూడా యీ సంచికలో వచ్చే 7 కథలు నచ్చుతాయనుకుంటున్నాము.

★ కథలు శీర్షికలు ఎక్కువగా పడాలీ అంటే సీరియల్ కథల విషయంలో పాఠకులు కొంచెం రాజీపడాలి! నాలుగు సీరియల్సే సరిపోతాయా? అయిదు వుండవలసిందేనా? అన్న మీమాంసను పాఠకులే తేల్చాలి!

★ కొత్త నీరొచ్చి పాత నీరును త్రోసేసినట్లు కొత్త శీర్షికలు పాత శీర్షికల్ని నెట్టి వేయడం యిప్పుడే కొత్తగా జరుగు తున్నది కాదు! పాఠకుల అభిరుచుల కనుగుణమైన ఆరోగ్యదాయక మైన ఆనంద ప్రదమైన నవీన రచనలు అందించే భారం రచయితలకే వున్నదని జ్ఞాపకం చేస్తూ శెలవు. —సం.

### హాస్యరసం

ఎన్నో ఆకర్షణలతో, పాఠకులకు ఉత్తేజాన్ని కలుగజేస్తూ "కొత్త పంథా" లో నడువ బూనడం, నేటి మారుతున్న నాగరికతరీత్యా అత్యంత అవసరం. ఈ మార్పులలో సంపాదకులు తీసుకొన్న శ్రద్ధ ప్రశంసనీయం. పత్రికలో హాస్యరసానికి విలువనిస్తూ, అపారమైన రచనలకు ప్రాముఖ్యతనిచ్చి శరవేగంతో పత్రిక మరింత దూసుకుపోగలదని ఆశిస్తూ.....

—బచ్చు వీర్రాజు, (రాజమండ్రి)

★ హాస్య నవలికల పోటీ పెట్టాం! చూశారా? -సం.

### ముగింపు బాగుంది

13-1-89 మా అభిమాన ఆంధ్రసచిత్ర వార పత్రికలో చల్లా సుబ్రహ్మణ్యం గారి పవిత్ర పాపి సీరియల్ ముగింపు వినూత్నంగా ఉంది. రాకా పాత్రకి రచయిత ఎంతో న్యాయం చేశారని ఈ సీరియల్ చదివాక మేము అనుకున్నాం. ప్రారంభం నుంచి ముగింపు వరకు రాకా దేదీప్యా పాత్రలను మలచిన తీరు బహు ప్రశంసనీయం.

—పి. చాముండేశ్వరి, చండి, శ్రీకాకుళం

### జోక్సు కావాలి

ఇటీవల ఆంధ్రసచిత్ర వారపత్రిక కొత్త మెరుగులు దిద్దుకొంటున్నందుకు ఉత్సాహంగా వుంది! పత్రికలో ప్రతీ పేజికి ఒక జోక్ బాక్సుకట్టి వేయండి! ఉదా:-

రోగి :-డాక్టర్! మీరిచ్చిన మందుల వలన కడుపు నొప్పి తగ్గింది! కానీ, చెవిపోటు పట్టుకుంది!

చెవుడు డాక్టర్ :- కడుపులో! చెవి ఏమిటి?!

-మరియు వీలు వెంబడి చక్కటి సుభాషితాలు ప్రతీ పేజీలో వేయండి! కొత్త రచయితల మినీ కథలకు అధిక ప్రోత్సాహం యివ్వండి!

—జోగిమహంతి సుధాకరరావు, (కాకినాడ)

### అభిరుచులు

కాస్త ఆలస్యంగా నైనా ఆంధ్రపత్రిక పాఠకుల అభీష్టాలను ప్రతిబింబించే రీతిలో ప్రయోగాత్మకమైన మార్పులు చెందింది. ఎనిమిది దశాబ్దాలుగా తెలుగు పాఠకులకు విలువైన కాలాక్షేపాన్నిచ్చిన ఆంధ్రపత్రిక, ఈ మార్పులను పురస్కరించుకుని మరిన్ని దశదశాబ్దాలు పాఠకుల అభిరుచికి ప్రతీకగా నిలుస్తుందని ఆశిస్తున్నాము.

—సోమయాజుల సోదరులు,(హైదరాబాద్)

(74 వ పేజీ చూడండి)

# విషయానుక్రమణిక

విడి ప్రతి వెలరు. 3.50

## ఈవారం ప్రత్యేకం:-



## కథలు :-



## సీరియల్ నవలలు:-



## వ్యాసాలు, శీర్షికలు :






ముఖచిత్రం :
నా కురులే నా సిరు లంటున్న చిత్ర
(ఫొటో : ఎన్. శివన్నారాయణ)

పై సంచికలో
పార్వతీ కళ్యాణం
(పెద్ద కథ)
భళారే! చిత్రం!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

సంపుటము 81 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 24

3-2-1989

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు
సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్(1938 - 1972)

శ్రీ విభవ నామ సం
పుష్య బ ద్వాదశి

## రాజ్యాంగం – రాజకీయం!

తమిళనాడులో డి ఎమ్ కె ఘన విజయాన్ని తాము కూడా పంచుకుని కాంగ్రెసేతర పార్టీల ముఖ్యమంత్రులు కలకత్తాలో సమావేశమై, కేంద్ర ప్రభుత్వం మీద సమర దుందుభి మ్రోగించారు– ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి ఆర్, శ్రీ ప్రఫుల్ల కుమార్ మహంతా (అస్సాం), హర్యానా ముఖ్యమంత్రి శ్రీ దేవీలాల్, కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ యస్ ఆర్ బొమ్మయ్, కేరళ ముఖ్యమంత్రి శ్రీ ఈ కె నాయనార్‌లు పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసు అధ్యక్షతన సమావేశమై అధికాంశం– కేంద్ర రాష్ట్రాల మధ్య వుండదగ్గ ఆర్థిక సంబంధాల మీద తర్జన భర్జనలు చేసుకున్నారు కేంద్రంలో ఒక పార్టీ అధికారంలో వుండగా రాష్ట్రాలలో ఆ పార్టీకి రాజకీయ బద్ధవైరి అయిన మరొక పార్టీ గద్దె మీద వుండటంతో 1967 తర్వాత కేంద్ర రాష్ట్రాల మధ్య రగడ బాగా యెక్కువవుతూ వచ్చింది నిజానికి ఈ సంబంధ బాంధవ్యాలు ఎట్లా వుండాలి అన్న విషయం మీద సర్కారియా కమిషన్ సిఫార్సుల మీద యీ నెల రెండో వారంలో ఢిల్లీలో ముఖ్యమంత్రులందరూ చర్చించుకుంటారని అనుకుంటున్నారు కనుక దానికి ముందుగా 'లైక్ మైండెడ్ పార్టీల' వారు కాకపోయినా, కాంగ్రెసేతర రాష్ట్రాల ముఖ్యమంత్రులు యిట్లా సమావేశం అవడం– ఒక పథకం లేకపోయినా, తమ తమ ప్రతిపత్తికి సంబంధించిన ముసాయిదాని తయారు చేసుకోడంలో తప్పేమీ లేదు కాని సర్కారియా కమిషన్ ప్రతిపాదనల మీద నేరుగా చర్చ మాత్రం యిక్కడ జరిగినట్లు లేదు' పైగా సర్కారియా కమిషన్ మీద ముఖ్యమంత్రు లందరిని సమావేశపరిచి– క్షుణ్ణంగా చర్చించాలన్న కోరిక యీ సమావేశం చేసిన తొమ్మిది డిమాండ్‌లలో ఒకటైవున్నది మరొక ముఖ్యమైన అంశం యీ ఆరుగురు ముఖ్యమంత్రులు చర్చించినది గవర్నర్‌ల నియామకం – గవర్నర్‌లు రాష్ట్రాలలో వుంటూ నిర్వహిస్తున్న పాత్ర' –ఈ అంశం వొకటి యిటీవల దక్షిణాది రాష్ట్రాలలో తీవ్రమైన వివాదమై పోయింది సర్కారియా కమిషన్ కూడా గవర్నర్‌ల నియామకంలో రాజకీయ చరిత్ర లేని వారిని, రాష్ట్రాలకు నియమించాలని వారు రాజకీయాలకి అతీతులుగా వుండాలని సూచనలు చేసి వుంది– కాని ఆంధ్రప్రదేశ్ గవర్నర్ మీద, కేరళ గవర్నర్ మీద యీ రెండు రాష్ట్రాల ప్రభుత్వాలకి లెక్కలేనన్ని ఫిర్యాదులున్నాయి అనిష్టాలు కూడా వున్నాయి – వీటిలో కొన్ని సబబైనవి కూడా – యిక్కడే రాజ్యాంగానికి రాజకీయానికి మధ్య అసలైన తగాదా–నుడత పేచీలు ఉత్పన్నమవుతున్నాయి రాజ్యాంగంలోని 356 వ ఆర్టికల్‌ని గవర్నర్‌లు కేంద్రంలోని పార్టీకి సుముఖంగా అమలు చేస్తున్నారన్న రాజ్యాంగ రాజకీయ సూక్ష్మాన్ని ఎంత త్వరగా

పరిష్కరించుకుంటే అంత మంచిది దేశంలో గవర్నర్‌ల నియామకం విషయంలో – ఆది నుంచి సత్ సంప్రదాయాలు లేవు– అట్లాగే గవర్నర్ పదవి చాలా హుందా అయినది– పార్టీకి, రాజకీయాలకి అతీతమైనది కనుక ఆ పదవి నిర్వహించిన వారు అటు తరువాత, విదేశీ రాయబారి పదవి లాంటి పదవులను తప్ప రాజకీయ పదవులైన ముఖ్యమంత్రి పదవులలోకి రాకూడదు– లేదా రావాలనుకోకూడదు అన్న నీతి మనదేశంలో యేనాడూ పాటింపబడలేదు పైగా నిన్న మొన్నటి దాకా గవర్నర్‌లుగా వున్న వారు నేడు ముఖ్యమంత్రులుగా రావాలనుకుంటూ లాబీ చేసుకుంటున్న దుస్థితి వుండబట్టే కేంద్రం

తాబేదారులుగా, ఏజెంటులుగా గూఢచారులుగా వీరు వుంటున్నారు అన్న తీవ్ర విమర్శలకు తావు వస్తున్నది– ఆంధ్రప్రదేశ్‌లో మొన్నటి రిపబ్లిక్ డే నాటి గవర్నర్ ప్రసంగం మీద – దూషణ స్థాయిలో తీవ్రవిమర్శ చేస్తూ శ్రీ ఎన్ టీ రామారావు 'ఒక నమస్కారం పెట్టేస్తాను– ఆ సంగతి ప్రజలే తేలుస్తారు' అంటూ వో నమస్కారం గాలిలోకి విసిరేశారు కాని యిక్కడ ప్రజలు చేసేది ఏమీ లేదు– కేంద్రం, రాష్ట్రాలు– రాజ్యాంగ నిపుణులు, న్యాయశాస్త్ర ధీమతులు కూర్చొని చర్చించి గవర్నర్‌ల నియామకం– వారి పాత్ర లపై ఒక కొత్త నియమావళిని రూపొందించుకోవాలి దానికిదే సమయం'

ముఖ్య సంపాదకుడు శివలెంక రాధాకృష్ణ
అడ్వయిజరీ సంపాదకుడు : వీరాజీ
ముద్రాపకుడు ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు
ఆంధ్రపత్రిక ప్రెస్; గాంధీనగరం, విజయవాడ 3. ఫోన్‌లు: 75667, 61247, 61248, 75569

**తెలుగువారి నిరంతర సేవలో మాకిది 81వ సంవత్సరం**



# జాంబవతీ పరిణయం

దా్వరకానగరంలో –
కోట బురుజులూ
మేడలూ
మిద్దెలూ
సౌధాగ్రాలూ
ఆలయ గోపురాలూ
అందంగా అలంకరించారు.

ఊరు ఊరంతా పెళ్ళికళతో పూగిపోతోంది. గోపికలు హడా విడిగా అటూ యిటూ పరుగెత్తు తున్నారు.

పరుగులాంటి వాళ్ళ నడకకు పాదాల కున్న పట్టీల చిరుమువ్వలు శ్రుతి పక్కంగా శబ్దం చేస్తున్నాయి లయబద్ధంగ గుండెలు కదులు తున్నాయి. సన్నటి నడుములకు చుట్టుకున్న బంగారు వడ్డాణాలు సూర్యకాంతికి ధగధగా మెరుస్తున్నాయి. భేరీ తూర్యనాదాలు, ఆ వెనక సన్నాయి, డోలు వంటి మంగళ వాద్యాలు మనోహరంగా వినిపిస్తున్నాయి. భామలందరూ గాజుల చేతులతో చప్పట్లు చరుస్తూ పాటలు పాడుతుంటే రథం మీద నుంచి శ్రీకృష్ణుడూ, రుక్మిణీ దిగారు.

పాటలు ఆగిపోయాయి. వేద మంత్రోచ్చారణ చేస్తూ పురోహిత జనం రుక్మిణీ కృష్ణులను వివాహ వేదిక దగ్గరకు తీసుకు వెళ్ళారు. కృష్ణయ్య రుక్మిణి చిటికెన వ్రేలు పట్టుకుని నడిచాడు. సిగ్గుతో ఆమె ముడుచుకుపోతే ఆమెను పొదివి పట్టుకున్నాడు. రుక్మిణి పులకించింది. పెళ్ళి కూతుర్ని చూసి అందరూ మెచ్చుకున్నారు. నందయశోదలూ, దేవకీ వసుదేవులూ రుక్మిణిని దీవించి, కృష్ణుడి చేత ఆమెకు మూడు ముళ్ళూ వేయించారు.

రుక్మిణి మనసులో ఆనందం వెల్లి విరిసింది. పోకిరీ పిల్లాడి ఉయ్యాల వూపులు, జలక్రీడలు, ముద్దు ముచ్చట్లు, కౌగిలింతలు, కేరింతలతో రుక్మిణికి పొద్దే తెలియటం లేదు.

ఇలా వుండగా ఒక రోజు సత్రాజిత్తు అనే రాజు ద్వారకా నగరానికి వచ్చాడు. ఆయన సూర్య భగవానుని భక్తుడు. సూర్యుడు సత్రాజిత్తు భక్తికి మెచ్చి శమంతకమణిని బహూకరించాడు. అది

## శ్రీకృష్ణకళ్యాణామృతం –ప్రయాగ రామకృష్ణ

# కళ్యాణమే వైభోగమే

సామాన్యమైన మణికాదు రోజుకు ఎనిమిది బారువుల బంగారం ఇస్తుంది ఆ మణి ఏ దేశంలో వుంటే ఆ ప్రాంత ప్రజలు సుఖ సంతోషాలతో వుంటారు. అందుకని ఆ దివ్యమణిని ఉగ్రసేన మహారాజుకు ఇమ్మని కృష్ణుడు సత్రాజిత్తును అడిగాడు

ఆయన ఇవ్వనన్నాడు

రోజులు గడుస్తున్నాయి ఒకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు ఆ మణిని ధరించి అడవికి వేటకు వెళ్ళాడు అక్కడ ఒక సింహం అతనిని చంపి మణిని ఎత్తుకు పోతుంటే జాంబవంతుడనే భల్లూక రాజు చూశాడు అతను చాలా ప్రాజ్ఞుడు బలవంతుడు భూమ్యాకాశాలు అనేక సార్లు ప్రదక్షిణం చేసిన వాడు. అమృతం తాగటం వలన అతనికి మంచి జవసత్వాలు వున్నాయి అతను వెంటనే సింహం మీదకు దూకి, దానిని చంపి శమంతకమణిని తీసుకుపోయి తన కూతురు జాంబవతి పడుకునే ఉయ్యాలకు ఆట వస్తువుగా వ్రేలాడ తీశాడు.

వేటకు వెళ్ళిన ప్రసేనుడు ఇంటికి తిరిగి రాక పోవటంతో స్యమంతక మణికోసం ప్రసేనుడ్ని కృష్ణుడే సంహరించి మణిని దొంగిలించి వుంటాడని సత్రాజిత్తు అపోహ పడ్డాడు. అదే ప్రచారం కూడా చేశాడు.

ఈ సంగతి తెలిసి కృష్ణుడు చాలా బాధ పడ్డాడు. ఎలాగైనా సరే ఈ నింద నుంచి బయట పడాలని నిశ్చయించుకున్నాడు అడవికి వెళ్ళి ప్రసేనుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు అడవి అంతా తిరిగి తిరిగి, ఒక చోట నుంచి స్పష్టంగా వున్న సింహం అడుగు జాడల్ని బట్టి, రక్తం మరకల్ని బట్టి వెతుక్కుంటూ వెళ్ళి చివరికి భల్లూక పతి గుహ దగ్గరకు వెళ్ళాడు

మెల్లిగా లోపలకు వెళ్ళాడు. అక్కడ ఉయ్యాల పైన ఆటవస్తువుగా వేలాడుతున్న శమంతకమణి ఆయనకు కనిపించింది గుట్టు రచ్చకాకుండా మణిని తెచ్చేద్దా మనుకున్నాడు. కాని అక్కడ వున్న దాది కృష్ణుడ్ని చూసి గట్టిగా కేక పెట్టింది అది విని జాంబవంతుడు ఒక్క దూకులో వచ్చి కృష్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు ఇద్దరూ బాహుబలం ప్రదర్శిస్తూ పోరు సాగించారు

వారిద్దరి మధ్యా ఇరవై ఎనిమిది రోజుల పాటు ఘోరంగా యుద్ధం జరిగింది రాను రాను కృష్ణుడు సమరోత్సాహం చూపుతున్నాడే కాని, ఆయన అలసట పడలేదు జాంబవంతుడు మాత్రం క్షీణించాడు తను ఇన్నాళ్ళూ ఎవరితో మల్లయుద్ధం చేశాడో అతనికి తెలిసొచ్చింది. జాంబవంతుడు చేతులు జోడించి 'మహనుభావా! ఇంతకాలం నా అజ్ఞానం వల్ల నిన్ను నేను తెలుసుకో లేక పోయాను. పురాణ పురుషా నన్ను మన్నించు. కర్మ ధర్మ చక్రవర్తి! నన్ను అనుగ్రహించు మనిషిలో మృగాన్ని చంపిన వాడివి మృగంలోని మనిషిని చూడలేవా? దేవాతి దేవా మురళి పట్టే చేతులతో పిడి గుద్దులు గుద్దావే. చేతులు నొప్పి పుట్ట లేదుకదా!' అని అనునయంగా అడుగుతూ ఆయన పాదాల మీద పడ్డాడు.

కృష్ణుడు సంతోషించి జాంబవంతుడ్ని లేవనెత్తి తన కర పల్లవాలతో భల్లూక రాజు శరీర శ్రమ పోగొట్టాడు

'జాంబవంతా! ఈ శమంతకమణిని నేను అపహరించానని సత్రాజిత్తు మహారాజు అపవాదు వేశాడు అందువల్ల దానికోసం వెతుక్కుంటూ వచ్చాను. అనుకోకుండా మనిద్దరి మధ్యా యుద్ధం జరిగింది. జరిగినదానికి నేనూ బాధపడుతున్నాను' అని కృష్ణుడు అన్నాడు

భల్లూకరాజు వెంటనే మణిని కృష్ణుడికి ఇవ్వడమే కాకుండా తన కూతురు జాంబవతిని కూడా కానుకగా ఇచ్చాడు

మణినీ, కన్యకా మణినీ తీసుకుని కృష్ణుడు ద్వారకకు వెళ్ళాడు రుక్మిణి, దేవకీ వసుదేవులు, నంద యశోదలు, స్నేహితులు, కృష్ణుణ్ని అభినందించారు

ఆ తరువాత శుభ ముహూర్తంలో కృష్ణయ్యకూ, జాంబవతికీ ఘనంగా వివాహం జరిగింది. మంగళ వాద్యాలు మ్రోగాయి కృష్ణయ్యపైనా, జాంబవతిపైనా పుష్ప వృష్టి కురిసింది.

ఆ తెల్లవారు యామున శ్రీకృష్ణ మందిరంలో జాంబవతీ కృష్ణులను చూసి తూరుపు సిగ్గుతో ఎర్రబారింది ●

## రామాయణ్ మహాభారత్‌ల యుద్ధం!

మళ్ళీ ప్రారంభించిన రామాయణానికన్న మహాభారతాన్నే ఎక్కువ మంది చూస్తున్నారట. ఇలా మహాభారతం ఎక్కువ ప్రాబల్యం పొందుతున్నదని రామాయణం దర్శకుడు రామానందసాగర్, మహాభారత్ దర్శకుడు చోప్రాపై పగ పెంచుకున్నాడని, దుష్ప్రచారాలు ప్రారంభించాడని తెలుస్తోంది. మహాభారత్ ప్రజల మీద దుష్ప్రభావాలు వేస్తున్నదని, మహాభారతంలో కరణ్ జునేజా చేసినట్టుగానే ఒక స్త్రీ తన బిడ్డను నదిలో వదిలిందని రామానంద సాగర్ చెపుతున్నాడట. దీనిపై వ్యాఖ్యానిస్తూ చోప్రా "వాళ్ళు మా ప్రాబల్యాన్ని బద్దలు కొట్టలేరు. మా ప్రభావం చాలా విస్తృత మైనది" అన్నాడట.



కలకత్తాలో ముఖ్యమంత్రుల మోహరింపు

## తాజాకాలమ్

# గవర్నర్ల "పాత్ర" ఏమిటి?

రిపబ్లిక్ డే ఉత్సవాలు ఝామ్మని అయిపోయాయి! హైదరాబాద్‌లో గవర్నర్ కుముద్‌బెన్ జోషీగారు – గొప్ప "జోష్"గా స్వర్గీయ యిందిరాగాంధీ స్టయిల్లో సుదీర్ఘమైన ఉపన్యాసం చేశారు. టి. వి. లో అదంతా చూపించారు. కుముద్ బెన్‌గారు స్వర్గీయ నెహ్రూ కుటుంబం నాటి నుంచి నేటి దాకా యీ దేశాన్ని ఎట్లా పెంచి పెద్ద చేస్తున్నారో – మన చెవుల తుప్పు వదిలేలాగ ఉద్ఘాటించారు. కాని రాష్ట్రంలో తాము యీ రాష్ట్ర గవర్నర్‌గా యీ ప్రసంగం చేస్తున్న సంగతి ఆమె మరిచిపోయారు. రాష్ట్రపతి గారు దేశం గురించి గవర్నర్ గారు తన రాష్ట్రం గురించి – అది సాధించిన ప్రగతి గురించి చెబితే సందర్భోచితంగా వుంటుంది కాని ఆమె అలా చేయలేదు. ఎన్. టి. ఆర్.కి తెలుగుదేశం పార్టీకి చాలామంది తెలుగు వారికి కూడా కాస్త "ఎంబరాసింగ్" గా వుండేస్థితి యేర్పడిపోయింది!– దీనిమీద శ్రీ రామారావుని వో విలేఖరి రేకెత్తించాడు. దాంతో ఆయన "చెరిగి పారేశారు" – "అసలీ గవర్నర్‌లు రాష్ట్రాల తిండి తింటూ తిన్నయింటి వాసాలు లెక్కపెట్టేస్తున్నారు" అన్నారట! "తిన్నయింటివాసాలు, దర్వాజాలు, కిటికీలు అవీ లెక్కపెడితే– దాని గురించి చెప్పినట్లే అయ్యుండేది కాని గవర్నర్‌గారు మనవూసెత్తలేదు. రాష్ట్ర ముఖ్యమంత్రి భాష విషయంలో కొంత నిగ్రహం పాటించి వుంటే బాగుండేది కాని – ఆయన వాగ్ధార వాగ్పటిమ గొప్పవి మరి!– విమర్శ మాత్రం సహేతుకమే!

అసలు రిపబ్లిక్ డే పరేడ్‌లో అక్కడ ఢిల్లీలో రాష్ట్రపతి మాట్లాడరు– ముందురోజు రాత్రి దేశవ్యాప్తంగా టి. వి. మీద, రేడియోలోను తమ సందేశం వినిపిస్తారు. "సర్వసత్తాక స్వామ్యవాద లౌకికవాద ప్రజాస్వామిక గణతంత్ర పరిషత్" మనది. అందులో నెంబర్‌వన్ అయిన రాష్ట్రపతిగారే ఆ వేదిక మీద నుంచి ప్రదర్శనలు చూస్తూ కూర్చొని వుంటారే! అటువంటప్పుడు గవర్నర్లెందుకు సుదీర్ఘ గంభీర ప్రసంగాలు చేయడం? ఇదో డౌటు!

గవర్నర్‌ల ప్రసంగాలను ఉభయ సభల సమావేశానికే పరిమితం చేసుకుంటే బెటర్! ఎందుకంటే రాష్ట్రపతి దేశ ప్రగతిని గవర్నర్ రాష్ట్ర ప్రగతిని, కలెక్టర్‌లు జిల్లా ప్రగతిని చెప్పడం అనే సంప్రదాయాన్ని పాటించలేని సందర్భంలో – వారి ఉపన్యాసాలను రాజ్యాంగ బద్ధంగా ఆయా ప్రభుత్వాలు తయారు చేసి యివ్వటమో లేదా యీ గవర్నమెంటు ప్రతినిధులు "స్తోత్ర పాఠాలు" అప్ప జెప్పకుండా– కేవలం వందన స్వీకారానికే వారి "ప్రొటోకాల్"ని పరిమితం చేయడమో చేస్తే బాగు!– గవర్నర్‌ల ఖర్చులు ఎవరు భరిస్తున్నా రన్నది ప్రశ్న కాదు. అది సెంట్రల్ గవర్నమెంటు భరిస్తే– అప్పుడు కుముద్ బెన్ జోషీ గారికి, రాము దులారీ సిన్హా గారికి– రాష్ట్రాల వ్యతిరేకతకి ప్రత్యేక హక్కులు వస్తాయా?– అది కాదు సమస్య– గవర్నర్ "బాధ్యత" "పాత్ర" ఏమిటి?– అదే అయోమయంలో పడిపోయిందిప్పుడు!

## స్వామి "లెటర్‌బాంబ్"

"జనతాదళ్"ని వ్యతిరేకించిన జనతా ఎం. పి. శ్రీ సుబ్రహ్మణ్య స్వామి రామకృష్ణ హెగ్డేని వదలి పెట్టలేదు. శ్రీ హెగ్డేకి స్విస్ బ్యాంకులో ఖాతా లున్నాయన్న మాట వదలి పెట్టలేదు. పైగా రిపబ్లిక్ డే మర్నాడు రాజధాని నగరంలో ఒక విలేఖరుల సమావేశంలో "చలి విరిగి పోయేలాగ" ఆయన మరిన్ని ఆరోపణలు ప్రేల్చాడు. శ్రీ వి. పి. సింగ్ ప్రజల నుంచి చాలా రహస్యాలు దాచేస్తున్నా డన్నది

మొదటి పాయింటు– ఫెయిర్ ఫాక్స్ గ్రూపును కేంద్రం ఎవరి మీద ఎందుకు నియమించిందీ అన్న సంగతి వెల్లడి చేయడంలో శ్రీ వి. పి. పూర్తిగా విఫలమైనా రంటున్నారు స్వామి గారు. ఈ సమావేశంలో ఆయన పత్రికలకి మంచి "మేత" కాగల ఒక "లేఖ"లో భాగాన్ని విడుదల చేశారు–

ఈ ఉత్తరంలో ప్రతిపక్షాల ప్రధాన నాయకుల పేర్లున్నాయి "వీరందరి మీద మీరు చేయమన్న దర్యాప్తును మేం చేస్తున్నాం" అంటూ ఫెయిర్ ఫాక్స్ "బాస్ "హెర్ష్‌మాన్" అప్పటి కేంద్ర మంత్రి అయిన వి. పి. సింగ్‌కి రాసినట్లుగా శ్రీ స్వామి యీ "వుత్తరాన్ని" బయట పెట్టారు– ఈ "లెటర్ బాంబ్" ఎంత ప్రేలిందీ అంటే చెప్పటం కష్టం కాని యింతలో ఎన్. టి. ఆర్., రామకృష్ణ హెగ్డే, జ్యోతిబసు, హెచ్. యన్. బహుగుణ, బిజూ పట్నాయక్, శరద్ పవార్, శ్రీమతి విజయరాజే సింధియా వగైరా పెద్ద పెద్ద పేర్లు అన్నీ వున్నాయి.

ఇంతలో తమాషా అంతా వీళ్లందరికి విదేశీ ఖాతాలు కనెక్షన్‌లు వున్నాయన్న అంశంలో లేదు– వీరందరికి యిప్పుడు యిష్టుడు, "ఫ్రంట్" నాయకుడు అయిన వి. పి. సింగ్– వీరి "గుట్టు మట్టు" అంతా పరిశోధింప జేసి, దగ్గర పెట్టుకున్నాడూ అన్న "ధ్వని" బాగా ప్రేలుతున్నది.

"స్వామి"ని ఉత్త వాచాలకుడు, ఉన్మత్త ప్రలాపి క్రింద త్రోసి పారేసినా పత్రికలలో పడ్డ మాటలు ప్రజలలో ప్రాకక మానవు– వాటి మీద "కామెంట్ యీజ్ ఫ్రీ" కదా?!–

అదృష్టవశాత్తు యీ ఉత్తరం మీద ఫైయిర్ ఫాక్సు గ్రూపు లిమిటెడ్ అధ్యక్షుడు మైఖేల్ జె. హెర్ష్‌మాన్ గట్టి ఖండన వొకటి వాషింగ్‌టన్‌లో ఒక పత్రికా



నూటొక్క టెస్టుల మొనగాడు దిలీప్ వెంగ్‌సర్కార్. వెస్ట్ యిండీస్‌లో మన జట్టుకి నాయకత్వం వహిస్తాడు. అతని డిప్యూటీగా శ్రీకాంత్? లేదా రవిశాస్త్రి? అన్నది తేలలేదింకా.

విలేఖరికి యివ్వడంతో – యీ "లెటర్ బాంబ్" చప్పుడు తగ్గి పోయింది!

మైఖేల్ హెర్ష్‌గారు ఇదంతా "ప్రహసనంగా వుందే" అన్నారు "నేను రాసినట్లుగా స్వామి చెబుతున్న ఆ ఉత్తరం కాపీని నేను చూడాలి! అదంతా నిజం కాదు. స్వామి ఏం చెబుతున్నాడో నాకేం అర్థం కాలేదు' అని ఆయన "స్టేట్స్‌మాన్" వాషింగ్‌టన్ విలేఖరికి చెప్పారుట! ఇది యిలా వుండగా తనకి నూట యాభై కోట్ల రూపాయిల విదేశీ బ్యాంకు ఖాతా లున్నాయన్న దాన్ని "దమ్ములుంటే లోకాయుక్తకి చెప్ప మన్నాడు లేదా కోర్టుకెక్కుతానని కూడా అన్నాడు! శ్రీ రామకృష్ణ హెగ్డే గారు. అయితే యీ స్వామిగారి ఆరోపణల ప్రహసనం మీద శ్రీ జ్యోతిబాసు రియాక్షన్ యింకా బాగుంది. "ఇలాంటి అకవుంట్ లన్నీ కేవలం ప్రతిపక్ష నాయకులకే వుంటాయి అనడం బాగులేదు! కొంత మంది కాంగ్రెసు మంత్రుల పేర్లు కూడా ఎక్కించమనండి యీ "లిస్టు"లో అన్నాడాయన– అవునూ? శ్రీ స్వామి కాంగ్రెసు మంత్రుల నెందుకు ఉపేక్షిస్తున్నట్లు?....

– వీరాజీ



సీరియల్

# మైథిలి

కుందుర్తి ఇందిరా దేవి




(గత సంచిక తరువాయి)

పిండారబోసినట్టుంది వెన్నెల

మైథిలి తులసికోట నానుకుని కూర్చుని ఉంది రాత్రి బాగా ప్రొద్దు పోయింది అందులో పెళ్ళి సందడిలో అలసిపోయిన బంధువులు ఆవలిస్తూ, చిటికెలు వేస్తూ ఇక మేం ఉంతలేం' అంటూ డాబా మీదికి వెళ్ళిపోయారు

అప్పటిక అరగంట నుండీ మైథిలికి హితబోధలు చేస్తున్న శారదాంబ కూడా 'యిక నా పల్ల కాదు తల్లీ' అని వెళ్లబోతూ ఒక్క క్షణం ఆగి 'పెళ్ళయిన తర్వాత ఇష్టమైనా, కష్టమైనా మొగుడి ముఖం చూడక తప్పదని తెలుసుకో' అంది

మైథిలి నిర్లిప్తంగా కూర్చుంది తెల్లటి చీర, తల నిండా మల్లెలు, చేతులకు, పాదాలకు గోరింటాకు రెండు చేతుల నిండా ఎర్రటి గాజులు, మెడలో పచ్చగా మెరిసే పసుపు త్రాడు ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి

అందరూ వెళ్ళిపోయారులా ఉంది పెరడంతా నిశ్శబ్దంగా ఉంది పందిరి మీది జాజులు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి

మైథిలి కళ్ళ ముందు అదే దృశ్యం కదలుతోంది పెళ్ళయి మూడు నిద్రలకు తరలి వెళ్ళారు సత్యన్నారాయణస్వామి వ్రతం అయింది భోజనాలు చేసి ఎక్కడి వాళ్ళక్కడ విశ్రాంతిగా పడుకున్నారు

ఎందుకో పెరటి వైపు వచ్చిన మైథిలి స్థాణువులా నిలబడిపోయింది పెళ్ళి కొడుకు అలంకరణలో ఉన్న మోహన్, అతని చేతుల్లో అతని బంధువు లమ్మాయి.

జగుప్సతో అక్కడి నుండి వెళ్ళి పోదామన్నా అంటుకుపోయినట్టుగా కదలని పాదాలు'

ఇదుగో నువ్విప్పుడు పెళ్ళయిన వాడివి

ఏం' నీకు మాత్రం కాలేదేమిటి

అది గుర్తుకు వస్తేనే జగుప్సతో మనసు చీ అంటోంది అతని చూపులు, స్పర్శ గుర్తు కొస్తే కంపరం కలుగుతోంది ఏ మూలో ఉన్న నమ్మకం ఇప్పుడు పూర్తిగా తుడిచి పెట్టుకు పోయింది

మధూ' మృదువుగా వినిపించింది ఇక్కడే కూర్చున్నావేం?

మైథిలి కాటుక కళ్ళు రెపరెప లాడాయి

వెన్నెల్లో తడుస్తున్న వీనస్‌లా

రవివర్మ కుంచెకు అందని అద్భుత సౌందర్యంలా

ఏ మహాముని శాపానికో గురి అయి విచారంగా కూర్చున్న గంధర్వ కన్యలా

విమల విస్మయంతో చూసింది

ఇది తన కూతురేనా' తను పెంచి పెద్ద చేసిన మైథిలేనా

చాలా పొద్దుపోయింది లేచి రా

మైథిలి ఛర్రుమన్నట్టు చూసింది

చూపుడు వ్రేలు చూపిస్తూ తర్జనితో అంది

'నీకు పెళ్ళికి ముందు చెప్పాను కొట్టి పారేశావు పెళ్ళి అయింతర్వాత చెప్పాను సర్దుకోమంటున్నావు నాకు అతన్ని చూస్తేనే అసహ్యం వేస్తోంది

రోషం, కోపం మిళితమైన స్వరంతో ఖచ్చితంగా అంది 'నువ్వు నా మాట వినవా

'వినను ఈ విషయంలో మటుకు నీ మాట చస్తే వినను మైథిలి సన్నగా అయినా దృఢంగా అంది

విమల ప్రక్కనే కూర్చుని "మీ మేనత్తలు, మేనమామలు ఇప్పటికే నానా మాటలు అంటున్నారు ప్రత్యేకించి నన్ను, నేనెప్పుడైనా నిన్ను బాధ పెట్టానా?' అంది

మైథిలి కళ్ళు బాధతో రెపరెపలాడాయి

అమ్మా

నేనెప్పుడైనా నిన్ను సవతి కూతురిలా చూశానా?'

మైథిలి చప్పున తన చేయి ఆమె నోటికి అడ్డు పెట్టింది

పెళ్ళయిపోయింది ఇప్పుడిహ మనం ఎంత వగచినా లాభం లేదు నీ అదృష్టమే బాగుంటే, అతను మారతాడు మారడనుకో నువ్వు మార్చుకో డానికి ప్రయత్నించు అందుకు నా సహకారం నీకు ఎప్పుడూ ఉంటుంది

కన్నతల్లి కాకపోయినా అంత కంటే ఎక్కువగా చూసి స్నేహితురాలిలా గీతోపదేశం చేస్తున్న తల్లిని చూసి మైథిలి మనసు ఆ క్షణం గర్వపడింది

'అయినా అతను ఎవర్నో తాకటం రెండు సార్లు కళ్ళారా చూసి కూడా ఎడ్జస్ట్ కావాలంటే ఛీ '

విమల నవ్వింది 'నేను మీ నాన్నగారికి రెండో భార్యనని తెలుసుగా "

నేనూ ఎన్నో కలలు కన్నాను మధూ ఆ కలలన్నీ కాలరాచి మీ నాన్నగారికి రెండో భార్యగా, నీకు తల్లిగా వచ్చి జీవితంతో రాజీ పడ్డానని నేనంటే

మైథిలి స్థాణువులా కూర్చుంది

'ఆ రోజైనా, ఈ రోజైనా, ఏ రోజైనా పరిస్థితులతో రాజీపడటం స్త్రీకి తప్పని సరి మధూ నువ్వు చూసిన సంఘటనలు అసలు చూడలేదనుకో అంతకంటే హాయి ఇంకోటి లేదు

సౌజన్యము, సౌభ్రాత్రము, సౌహార్దము నిండిన దేవత లాంటి ఆ తల్లి మాట త్రోసి పుచ్చలేక పోయింది మైథిలి

* * * *

వంట యింట్లో కూరలు తరుగుతోంది మైథిలి విమల హడావిడిగా వచ్చి అల్మారాలో నుండి లడ్లు, అరిసెలు, బూందీ ఒక గిన్నెలో సర్దుతుంటే మైథిలి ఉండబట్టలేక అడిగేసింది

రజనీ వచ్చాడే అబ్బాయి తింటాడని ' విమల వెళ్ళిపోయింది

మైథిలి కూరలు తరగటం మర్చిపోయిన దానిలా నిటారుగా కూర్చుంది రజనీ రావటంలో వింతేమీ లేదు నాలుగు రోజులు సెలవులు వచ్చినా పరిగెట్టుకొస్తాడు ఏదో ఒక టైంలో తనూ తీరిగ్గా అతనితో బాతాఖానీ వేస్తుంది

కానీ యిప్పుడు- మనసు దిగులుతో తల్లడిల్లి పోతుంటే, జీవితాంతం మరిచిపోలేని బంధాన్ని మెడకి తగిలించుకుని, రాజీ పడ్డానని ఆత్మవంచన చేసుకుంటూ, ఎటువంటి స్పందనా కలుగజేయని ఈ కొద్ది రోజుల వైవాహిక జీవితాన్ని నిర్లిప్తంగా పరిస్తుంటే

రజనీకాంత్ వచ్చేశాడు

తన అస్పష్టమైన భావాలు రూపు దిద్దుకుని రజనీగా అవతరిస్తుంటే అప్పటికి తెలిసి వచ్చింది స్వర్గం చేజారిపోయాక

ఆదర్శ బావాలు గల రజనీ'

స్త్రీకో ప్రత్యేక ఔన్నత్యం ఆపాదించి గౌరవించే రజనీ

**జరిగిన కథ -1** :కన్నకూతురు మున్నినే నీ కేరక్టర్ మంచిది కాదంటూ వేలెత్తి చూపేటప్పటికి కుప్పకూలి పోయింది మైథిలి. ఆమెకి గతం స్మృతిలో మెదిలింది. తనకు కాబోయే భర్తగా పెద్దలంతా నిర్ణయించిన మోహన్ వేరొక అమ్మాయితో సన్నిహితంగా ఉండటం చూసిన మైథిలి కళ్ళు పత్తి కాయలయ్యాయి. చూసిన విషయం తల్లికి చెప్పగా ఆమె అతనినే సమర్థించడం విని చివ్వున లేచి వెళ్లిపోయింది.

స్త్రీల పిరికితనాన్ని దూదేకినట్టు ఏకేరజనీ...

గుండెల్లో నుండి తన్నుకుంటూ వస్తున్న దుఃఖపు కెరటం...

రాకమ్మా రాకు! అంతా అయిపోయాక ఇప్పుడు నీ పలకరింపెందుకు?

నా భర్త బుద్ధిమంతుడైతే నీవు నాదరి దాపులకైనా వచ్చేదానివేనా?

అక్కడ రజనీకాంత్ పరిస్థితి కూడా అలాగే ఉంది. మైథిలి వివాహ విషయం వినగానే అతడు స్తబ్ధుయిపోయాడు.

రంగులు వేసిన గుమ్మాలు, వెల్ల వేసిన యిల్లు చూసి విశేషమేమిటమ్మా అనడిగిన రజనీకాంత్‌కి ఉత్సాహంగా మైథిలి వివాహ వార్త చెప్పింది శారదాంబ.

"అంత చిన్నపిల్లకి పెళ్ళేమిటమ్మా?" ఎలాగో అయిపోతూ అడిగాడు.

"చిన్న పిల్లేమిటి? నీ ముఖం. పదహారేళ్ళు. వచ్చే ఈ పాటికి కూతుర్నో కొడుకునో ఎత్తుకోదూ. మొత్తానికి అదృష్టవంతురాలు. కానీ కట్నం లేకుండా అందగాడైన పిల్లాడు దొరికాడంటే మాటలా. పెళ్ళి పీటల మీద మైథిలి మెరిసిపోయిందనుకో... నీ గురించి ఎన్నిసార్లు అనుకుందో. శుభలేఖ కూడా పంపిందిగా..."

మిగిలింది వినకుండానే రజనీకాంత్ అక్కడి నుండి వెళ్ళిపోయాడు. "నాకు ఆకలేదమ్మా" అంటూ.

ఒక్కసారి మైథిలిని చూడాలనిపిస్తోంది. అప్పుడే విమల వచ్చింది లడ్డుల గిన్నె తీసికొని.

అతనికి అవి తినాలంటే చాలా కష్టంగా తోచింది.

అందమైన మైథిలి... అతని మనసులో, కలల్లో ప్రేమ పంటలు పండించే మైథిలి... తన ఊహలకు ఊపిరి పోసి తన భార్యగా తన జీవితంలోకి తెచ్చుకోవాలని ఉబలాటపడే మైథిలి... మరొకరి భార్య అయిపోయింది.

తన ఆశాహర్మ్యాలు కూలిపోయినయి.

చదువైనా పూర్తి కాని తను. పదహారేళ్ళయినా



నిండని మైథిలి తేత్రాయంలోనే నిర్దాక్షిణ్యంగా విడదీసింది

అతను డాబా మీదికి వచ్చాడు దొడ్లో పూలు కోస్తున్న మైథిలి తృళ్ళిపడింది అతను చేయి జాచి పిలిచే లోపే చెంగున మాయమైంది

ఇంతలో తల్లి కేక వేయడంతో క్రిందికి వెళ్ళి స్నానం చేసి దొడ్లో గోడ దగ్గరికి వచ్చాడు బాత్‌రూమ్‌లో నీళ్ళ శబ్దం వినిపిస్తోంది అతను చిన్న చిన్న రాళ్ళు ఏరి బాత్‌రూమ్ తలుపుకి గురి చూసి కొట్టాడు గోడ మీద మైథిలి బట్టలు ఉన్నాయి

మూడోసారి విసరబోతుంటే రక్కున బాత్‌రూమ్ తలుపు తెరుచుకుని ఈల పాట పాడుకుంటూ బైటికి వచ్చింది ఎవరో యువకుడు మైథిలి కాదు

రజనీకాంత్ చప్పున అరటి చెట్టు చాటు చేసుకున్నాడు అతను ఓ నిముషం గోడ వైపె చూసి తిరిగి ఈల వేసుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు

రజనీ మనసులో అస్పష్టమైన దిగులు గూడు కట్టుకోసాగింది

మైథిలి భర్త అందగాడు అందుకె చేసుకు నుంటుంది

మధ్యాహ్నం మైథిలి వచ్చింది అత్త వారింటికి వెడుతూ చెప్పి వెళ్ళడానికి వచ్చింది

శారదాంబ బొట్టు పెట్టి జాకెట్, పళ్ళు చేతిలో పెట్టింది మైథిలి వంగి దణ్ణంపెట్టి లేస్తుంటే శారదాంబ కళ్ళు తుడుచుకుంటూ నాకే కన్నీళ్ళాగటం లేదు మీ అమ్మ ఎలా తట్టుకుంటుందో అంది

మైథిలి మాత్రం నిర్లిప్తంగానే ఉంది ఆ పిల్ల వైఖరేమిటో శారదాంబకు అంతు పట్టటం లేదు

ఆఖరికి అప్పగింతల సమయంలో కూడా కంట తడి పెట్టలేదు విమల మాత్రం భోరున ఏడ్చింది చెమర్చిన కళ్ళతో నిశ్శబ్దంగా తల్లి గుండెల్లో తల దాచుకుందె తప్ప శబ్దం కూడా రాలేదు

అంత చిన్న వయసులో అన్నిటినీ తట్టుకొగలిగే స్థిత ప్రజ్ఞత ఎలా అలవడిందో విమలకె అంతు పట్టదు అది వాళ్ళ అమ్మ పోలిక అంటాడు ప్రసాదరావు మాత్రం

నిజం చెప్పు మైథిలీ నీవు అసలు ఏమాత్రం హుషారుగా లేవు ఈ పెళ్ళి యిష్టం లేదా? అడిగింది శారదాంబ ఉండబట్ట లేక

అదేం ప్రశ్న అత్తయ్యా

నా అనుభవం అంత లేదు నీ వయస్సు

మైథిలి నవ్వింది ఇప్పుడు నేను యిష్టం లేదంటే ఈ తాళిబొట్టు తీసెయ్యగలరా నన్ను నన్నుగా బ్రతకనిస్తారా?

శారదాంబ కళవెళ పడిపోయింది ఏమిటో మైథిలీ ఆ మాటలు పెద్దదాన్ని చాదస్తంగా ఏదో అన్నాననుకో అలా అనెయ్యడమేనా అని కేక లేసింది

ఆ సంభాషణంతా రజనీకాంత్ చెవుల్లో పడుతూనే ఉంది

బైటికి రాబోతుంటే అతను ఎదురు పడ్డాడు

నాలుగు కళ్ళు కలుసుకున్నాయి అస్పష్టంగా కదిలిన పెదవుల మధ్య ఆగిపోయిన మాటలు

క్షణం నిశ్శబ్దం!

మనసులో మెదిలే భావనలకు అద్దం పట్టేది

మాటల కందని భాషను మనోహరంగా తెలియ పరిచేది అదే నిశ్శబ్దం!

ఇద్దరి మధ్యా క్షణకాలం ఆ నిశ్శబ్దమే నిలబడింది

మరుక్షణం అతడు ప్రక్కకు తొలిగాడు ఆమె వెళ్ళిపోయింది

విమల కూడా బైలుదేరిందిలా ఉంది ఆవిడతో బాటే మురళి కూడా రిక్షా ఎక్కాడు

మైథిలి తండ్రికి చెప్పి రిక్షా దగ్గరకి రాబోతూ ఎందుకో ప్రక్కకి తిరిగి చూసింది గుమ్మంలో శారదాంబ డాబా మీద రజని.

అప్పుడు వచ్చింది కన్నీరు. సుడిగుండంలా తిరుగుతూ విశాలమైన రెప్పల మించి చెక్కిళ్ళ మీదికి జారి. కారి కలలన్నీ ఆ కన్నీళ్ళల్లో కొట్టుకుపోతుంటే మెల్లగా కదిలి వెళ్ళిపోయింది

* * * *

"మైథిలీ నా బట్టలు తీసి పెట్టావా!" బాత్‌రూమ్‌లో నుండి వస్తూ అరిచాడు మోహన్

సమాదానం రాలేదు కానీ బట్టలు మాత్రం రెడిగా ఉన్నాయి హడావిడిగా లుంగీ చుట్ట బెట్టుకుని వంట యింట్లోకి పరిగెత్తాడు మైథిలి కంచాలు పెట్టి మంచినీళ్ళు పెడుతోంది

ప్రతిరోజూ వంట సుగుణే చేస్తుంది ఆవిడకి మడీ, ఆచారం, అమ్మవారి నైవేద్యం విడిగా జరిగి తీరాలి మైథిలి పైపనులు చేస్తూ అత్తగారికి కావలసినవి అందిస్తూ అక్కడక్కడే తిరుగుతుంటుంది

అందువల్లనేమో ఆవిడకు కోడలంటే మహా మురిపెం చక్కటి కోడలు చెప్పినట్టు వింటుందని

## మీ జి. కె. ఎంత?-5

1. దక్షిణధ్రువం చేరుకొన్న వైజ్ఞానిక బృందానికి నాయకత్వం వహించిన మొట్ట మొదటి మహిళ ఎవరు?
2. ఒకే విభాగంలో అత్యధిక సార్లు "ఆస్కార్ అవార్డు" పొందిన నటి ఎవరు?
3. డా. లైనస్ పౌలింగ్, మేడమ్ క్యూరీ, ప్రొ. జాన్ బార్డీన్, ప్రొ. ఫ్రెడరిక్‌సాంగర్ ఈ నలుగురు శాస్త్ర వేత్తలకు కలిపి ఒక పోలిక ఉంది. ఆ ప్రత్యేకత ఏమిటి?
4. ప్రపంచంలో ఇప్పటిదాకా ఎన్నికలలో అతి పెద్ద బ్యాలెట్ పేపరు ఎక్కడ ఉపయోగించారు?
5. ఉత్తర ధ్రువం, దక్షిణధ్రువం రెంటినీ చేరుకొన్న మొట్ట మొదటి వ్యక్తి ఎవరు?
6. తాజ్‌మహల్ వాస్తు శిల్పి (ఆర్కిటెక్ట్) ఎవరు?
7. ఇందిరాగాంధీ హత్యా జరిగినప్పుడు బుల్లెట్ గాయాలు తగిలిన ఏకైక గార్డు ఎవరు?
8. టి. వి. సీరియల్ "రామాయణ్" సంగీత దర్శకుడు ఎవరు?
9. "కాయిన్‌ట్రిన్" విమానాశ్రయం అంతర్జాతీయంగా ఒక ప్రముఖ మైన నగరంలో ఉంది. అది ఏనగరం?
10. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో జపాన్ దండయాత్ర జరిపినపుడు చైనా రాజధాని ఎక్కడికి మార్చ బడింది?

(జవాబులు యీ సంచికలోనే)

—జై

మోహన్ చాలా ఆలస్యంగా నిద్ర లేస్తాడు. ఆపాటికి ఇంట్లో పనులన్నీ పూర్తవుతాయి. అతను లేచిందగ్గర్నుండీ ఒకటే హడావిడి.

మైథిలీ బ్రష్ ఏదీ? పేస్ట్ ఎక్కడ అనడంతో మొదలవుతుంది. ఆ యింట్లో నిశ్శబ్దం చుట్టు ప్రక్కలేకుండా పారిపోతుంది.

కాఫీ, స్నానం, బట్టలు, బూట్లు, కర్చీఫ్, పర్స్, వాచీ అని కేకలు వేస్తూనే ఉంటాడు. అన్నీ అమరుతూనే ఉంటాయి కానీ సమాధానం మాత్రం రాదు.

"నోటి ముత్యాలు రాలిపోతాయిటోయ్. వస్తున్నాననో, తెస్తున్నాననో చెప్పచ్చుగా" అని విసుక్కుంటాడు.

సుగుణ మడిగానే వడ్డిస్తుంది. అందువల్ల మైథిలికి ఉదయం పూట వడ్డన చేయాల్సిన అవసరం రాదు. సాయంత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ మోహన్‌కి మైథిలే వడ్డిస్తుంది. సుగుణ అసలు కదలదు.

భోజనం కానించి బట్టలు వేసుకుని బూట్లు తొడుక్కుంటూ "మైథిలీ" అని కేకేశాడు.

సమాధానంగా మైథిలి వక్కపొడి తెచ్చింది.

అక్కడ పెట్టి వెళ్ళబోతుంటే అతను 'ఆ' అని నోరు తెరిచాడు. వక్కపొడి నోట్లో పెడుతుంటే అతను చిన్నగా కొరికాడు వ్రేలు.

పయిట చెంగుకు తుడుచుకుని తిరగబోతుంటే అతను చప్పున కొంగు పట్టుకుని ఆపేశాడు.

"నువ్వసలు భార్యవేనా? ఆ లక్షణాలు నీలో ఏమైనా ఉన్నయ్యా?"

మైథిలి నిశ్శబ్దంగా నిలబడింది.

"నాకు ఆఫీస్ టైమయి ఖంగారు పడుతున్నాను కదా. ఏదైనా సాయం చేయకూడదూ అలా పరిగెత్తకపోతే."

"సాయమా" మైథిలి కళ్ళెత్తింది.

"ఔను" మోహన్ కళ్ళల్లో కొంటెతనం మెరిసింది. మైథిలి చప్పున ఒకడుగు వెనక్కి వేసి "నేను చేసే సహాయం ఏముందని" అంది.

"ఉదాహరణకి నా తల దువ్వచ్చు. నాకు బూట్లు వేయచ్చు. నాకు బెల్టు అందివ్వచ్చు....

మైథిలి చప్పున కూర్చుని బూట్ల నాడాలు బిగించసాగింది.

అతను నుదురు కొట్టుకుంటూ "నీకు ఈ పనే నచ్చిందా. ముచ్చటగా నా క్రాఫ్ దువ్వకూడదూ" అన్నాడు.

మైథిలి సమాధానం చెప్పలేదు. లేచి రుమాలు, పర్సు అందిస్తుంటే అతను "అంత నిశ్శబ్దంగా ఎలా ఉంటావు నువ్వు. మా ఫ్రెండ్సంతా నువ్వు మూగదానివని వెక్కిరిస్తున్నారు" అన్నాడు.

వెళ్ళిపోతున్న మైథిలిని ఆపేసి "సాయంత్రం సినిమాకు వెడదామా" అన్నాడు.

"మీ యిష్టం."



ఫోటో వ్యాఖ్య – 5 పోటీ ఫలితాలు

## బహుమతి పొందిన వ్యాఖ్య

"గడపదాటడం నీతరం కాదు మనవడా! ఈ చేతి కర్ర నీ తాతదని మరువకురా!!" –నమ్మి కనక నాగేశ్వరరావు (పెనుగొండ)

బహుమతిగా వీరికి రెండు మాసాలు ఆంధ్ర సచిత్రవారపత్రిక పంపిస్తాము.

–సం

"డైరెక్టర్" కట్ చెప్పిన వెంటనే మీరు నా మెడకు బిగించిన స్టిక్ తీసెయ్యాలి మేడమ్! లేకపోతే ఆడియన్స్ చూడండి ఎలా నవ్వుతున్నారో!..."

జె. ఉమామహేశ్వరరావు (పాలకొల్లు)

"పడుచుపిల్ల చేతిలో బంది నౌతానని వస్తే! బామ్మ చేతి కర్రకు బందినైనాను అబ్బ!"

కె. శృతి (కంభంపాడు)

"తాతబుద్ధులు అబ్బినాయిరా అబ్బాయ్! దుమ్ము దులపగ దొరికినావుర దొంగాయ్" సుంకర ఇందిరాదేవి (తుని)

లక్కీ పేర్లు:

కూటికుప్పల నరసింహారావు, శ్రీకాకుళం, కె. సత్యనారాయణ, క్రొత్త చెరువు, వి. కిశోర్, అమలాపురం,, నవీన్‌కుమార్, ధర్మవరం, లక్కోజు శ్రీనివాసరావు, విజయనగరం, జి. ఎల్. ఎన్. కుమార్, హైదరాబాద్, ఎ. భాస్కరరెడ్డి, ఒంగోలు, వై. రమాదేవి, అనకాపల్లి, గుమ్మళ్ళ విఠల్, మచిలీపట్నం, వి. విజయలక్ష్మి, రామేశ్వరం.

"నా యిష్టమేమిటి. నువ్వు నా కోసమే అయితే రావద్దు. నేను యిష్టం వచ్చినట్టు సినిమాలు చూస్తాను. నీక్కూడా చూడాలని ఉందేమో అని అడిగాను" కోపంగా అన్నాడు.

మాటలకి కొదవలేదు. అందానికి తక్కువలేదు. వాటికి తోడు కాస్తంత నీతినియమాలు ఉంటే.....

వెళ్ళిపోతున్న మైథిలిని విసుగ్గా పిలిచాడు. "నీకన్నా మా అమ్మ నయం. ఈ రోజుకీ మా నాన్నగారు ఆ సందు మలుపు తిరిగే దాకా గేటు దగ్గరే ఉంటుంది.

రెండు నిముషాలు తర్వాత బాక్స్ కోసం వచ్చిన అతనికి మైథిలి ఎంగిళ్ళు తీస్తూ కనిపించింది.

"ఓ.కే. అయామ్ గోయింగ్" బాక్స్ తీసుకుని వెళ్ళిపోయాడు. ఇల్లు ఎప్పటిలా మళ్ళీ నిశ్శబ్దమైంది.

# సినిమా నృత్యానికి కొత్త భాష్యం చెప్పిన అస్టైర్




నృత్యం క్షణక్షణమూ · అనుభవించవలసిన అనుభూతి. ప్రతి విన్యాసానికీ ప్రేక్షకులెంత ఆశ్చర్యపోతారో నర్తిస్తున్న దేహమూ, ఆదేశిస్తున్న మేథా, హృదయమూ కూడా అంతగానే ఆశ్చర్యపోతాయి. లిప్త లిప్తకూ అనూహ్య ఉద్వేగాన్ని ప్రేరేపించే అద్భుత కళ నృత్యం.

వేల ఏళ్ళుగా మనిషి నృత్యం చేస్తున్నప్పటికీ నృత్యంలో ఏవో కొన్ని భంగిమలు తప్ప మొత్తంగా ప్రక్రియ శాశ్వతత్వం సంతరించుకోలేదు. ఎక్కడో కొన్ని అపూర్వమయిన శిల్పాలు, కొన్ని వందల విన్యాసాలనో, వేల విన్యాసాలనో నిర్దేశించే పుస్తకాలు తప్ప నర్తకుల హావభావాలన్నిటినీ, అంగవిన్యాసాలన్నిటినీ, అభినయ సామర్థ్యాన్నంతటినీ మన కళ్ళ ముందర కట్టే దృశ్యాలు లేవు.

నృత్య ప్రక్రియలో చరితార్థులుగా నిలిచిపోదగిన వాళ్ళందరూ తమ అసాధారణత్వాన్ని గాలిలో లిఖించి తరలిపోయారంటాడు రిచర్డ్ షికెల్. కాని అట్లా తన ప్రతిభ రంగస్థలం మీదనే రద్దయిపోకుండా శాశ్వతంగా నిలిచిపోయేలా చూసుకున్నాడు ఫ్రెడ్ అస్టైర్.

మూకీ చిత్రాల రోజుల్లో అమెరికన్ల దృష్టిలో నృత్యమంటే లయబద్ధంగా సాగే పదఘట్టన మాత్రమే. అస్టైర్ చిత్రసీమలో ప్రవేశించక ముందు సినిమా నృత్యమంటే ఏదో ఒక అస్పష్ట ధ్వనికి అనుగుణంగా సాగే గందరగోళం మాత్రమే. ఇటువంటి పరిస్థితిలో ఏమంత పెద్ద ఆశ లేకుండానే ఒమాహా నుంచి అస్టైర్, ఆయన చెల్లెలు అడిల్ రంగస్థలం మీద అడుగు పెట్టారు. ఆ ప్రయాణంలో అడిల్ మధ్యలోనే ఆగిపోగా అస్టైర్ మాత్రం ప్రముఖ నర్తకుడై న్యూయార్క్‌కు, లండన్‌కు చేరుకున్నాడు. ఆయన హావభావాలు, గొంతు ఆయన చాలా మామూలు మనిషని అనిపించేలా ఉండేవి. కాని ఆయన తాను చూపించే ప్రభావాన్ని ఖచ్చితంగా అంచనా వేసుకునేవాడు. తాను అనుకున్నది నెరవేర్చడంలో నిర్దిష్టంగా, నిర్దుష్టంగా ఉండేవాడు. ఆయన ఎప్పుడూ ప్రేక్షకులలో ఆశ్చర్యాన్ని, ఆరాధననూ రేకెత్తించగలిగేవాడు. ఆయన ఎప్పుడూ ఇతరుల లాగనే తననుంచి తనే బైట నిలబడి తన కళను ఆస్వాదించే వాడని ఒక కళా విమర్శకుడన్నాడు.

1933 నుంచి 1939 వరకు జింజర్ రోగర్స్‌తో కలిసి నిర్మించిన తొమ్మిది చిత్రాల ద్వారా అస్టైర్ సినిమానృత్యానికి కొత్త భాష్యం చెప్పాడు. ఈజ్ నాట్ దిస్ ఎ లవ్‌లీ లేడీ, లెటజ్ కాల్ ది హోల్ థింగ్ ఆఫ్ వంటి చిత్రాల ద్వారా ఆయన ప్రేక్షకుల హృదయాల మీద చెరగని ముద్ర వేశాడు. జింజర్‌తో పాటు ఆయన రీటా హేవర్త్, సిడ్ ఛారిస్, లూసిల్ బ్రెమర్ వంటి ప్రముఖ నటీమణులతో చిరస్మరణీయమైన చిత్రాలెన్నింటిలోనో నృత్యం చేశాడు. ఛారిస్‌తో కలిసి నటించిన 'డాన్సింగ్ ఇన్ ది డార్క్' ఆయన చిత్రసీమ జీవితంలో మకుటాయమానమైనదని విమర్శకులంటారు. సినిమా చరిత్రలో ఒంటరిగా సుదీర్ఘకాలం నృత్యం చేసిన ఘనత కూడా అస్టైర్‌దే. ఒకప్పుడు అద్భుతమైన సాహిత్యానికి అసాధారణ ప్రజ్ఞతో నృత్యాన్ని జోడించి ప్రేక్షకుల హృదయాల్ని మీటిన అస్టైర్ నిండా 88 సంవత్సరాలు జీవించి, చౌకబారు సాహిత్యంతో, విచిత్ర ధ్వనుల సమ్మేళనంతో కూడిన వీడియో నృత్యం కూడా చూసి ఇటీవలే మరణించాడు.

●

## మైథిలి

భోజనాలు చేసేటప్పుడు సుగుణ మందలించింది.

"మగవాళ్ళు బైటికి వెళ్ళేటంత వరకూ వాళ్ళ అవసరాలు తీర్చి బైటికి పంపే ప్రయత్నంలోనే ఉండాలి. అంతే కానీ వాళ్ళకి దూరంగా పరిగెత్తకూడదు."

మైథిలి అలాగే అన్నట్టు తలూపింది. ఇంట్లో అల్మైరాలో చాలా పుస్తకాలు ఉన్నాయి. మైథిలి వాటి దుమ్ముదులిపి వచ్చేందగ్గర్నుండీ దాదాపు సగం చదివేసింది. అందులో బాగా ఆకర్షించినవి చలం నవలలు.

ఆమె ఆలోచనలు క్రొత్త పుంతలు తొక్కాయి.

చిమ్మ చీకటిలో అలమటిస్తూ కూర్చునే కంటే ప్రయత్నించి ఒక చిన్న దీపాన్నయినా వెలిగించవచ్చుగా.

ఆ మాత్రం భర్తను మార్చుకోలేదూ.

సాయంత్రం భర్త వచ్చేసరికి రెడీ అయి అతనితో పాటు సినిమాకి వెళ్ళింది.

టిక్కెట్ల కోసం వెళ్ళిన భర్త ఇంకా రాలేదేమిటా అనుకుంటూ వెళ్ళిన మైథిలికి కంటపడిన దృశ్యం...

జనమంతా థియేటర్లోకి వెళ్ళిపోయినా ఇంకా నిలబడి మాట్లాడుకుంటున్న వాళ్ళు ఆమెని చూడలేదు.

హుషారుగా మాట్లాడుతున్న మోహన్ చెయ్యి ఆమె రెండు చేతుల్లో బంధింపబడి ఉంది. ఆమె ఆ రోజు గుళ్ళో గన్నేరు చెట్టు క్రింద చూసిన అమ్మాయి.

మమకారాలు మరీ వికలవుతూంటే మైథిలి మౌనంగా నిలబడి పోయింది.

★ ★ ★ ★

మైథిలి వివాహానంతరం వచ్చిన మొదటి పండుగ ఉగాది. ప్రసాదరావు పండుగకి తీసి కెళ్ళి కూతురికి బట్టలు పెట్టాడు. అల్లుడికి తనకి యిష్టమైనవి కొనుక్కోమని రెండు వందలు యిచ్చాడు.

మోహన్ మొహమాటంగా డబ్బు పుచ్చుకుని యింటికి వచ్చాక తల్లితో "నేనెప్పుడైనా ఛీప్ బట్టలు వేసుకున్నానమ్మా! రెండు వందలకి ఏమొస్తాయని" అన్నాడు ఫిర్యాదుగా.

"మీ మామగారినే బట్టలు తెమ్మనలేక పోయావు" అన్నాడు చిదంబరం.

సుగుణ మాత్రం మందలించింది. "ఎవరి శక్తి కొద్దీ వాళ్ళు యిస్తారు. ఆయన అంత యిదిగా చెప్పినప్పుడు ఏవోటి కొనుక్కో. లేకపోతే ఇంకో వంద నువ్వే వేసుకుని నచ్చినవి కొనుక్కో."

తండ్రి తమ బట్టల కోసం అప్పు చేశాడని మైథిలికి తెలుసు. కానీ ఆ మాట పైకి చెప్పి చులకన కాదలుచుకోలేదు.

ఆ రాత్రి ఆ రెండు వందలు భార్య కిచ్చాడు మోహన్. ఆమె ప్రశ్నార్థకంగా చూసింది.

అతను నవ్వుతూనే అన్నాడు "అవి దాచు. అవసరమైనప్పుడు తీసుకుంటాను."

అతను మంచి మూడ్‌లో ఉన్నాడులా ఉంది. మైథిలితో చాలా సేపు కబుర్లు చెప్పాడు. ఫరవాలేదు. పీడించే మనిషి కాదు. మైథిలి తేలిగ్గా ఊపిరి తీసుకుంది.

కానీ తన అంచనా తప్పని ఆమెకి త్వరలోనే తెలిసి వచ్చింది.

(ఇంకా ఉంది)

# ఇప్పుడు హార్లిక్స్ అదనపు కేల్షియంతో






## "ఎదిగే పిల్లలకు అదనంగా కేల్షియం అవసరం."

హార్లిక్స్‌ని యిప్పుడు అదనపు కేల్షియంతో సంపన్నం చేశారు–ఎదిగే పిల్లలలో దంతాల గట్టిదనానికి, ఎముకల బలానికి, యావత్ కుటుంబం మంచి ఆరోగ్యంగా ఉండేందుకు యిది చాలా కీలకమైనది.

హార్లిక్స్‌లో సహజ పోషకాలు పుష్కలంగా ఉన్నాయి–ప్రొటీన్లు, విటమిన్లు, మినరల్స్, మరియు కార్బొహైడ్రేట్లు–ఇవి జీవ శక్తిని, బలం సమకూరుస్తాయి. ఇప్పుడు అదనపు కేల్షియం అంటే అర్థం అదనపు ఆరోగ్యం అన్నమాట.

**మంచి పుష్టికరమైనది**




HTA 6037 TEL

# సుబ్బనళినీయమ్

## (అను మగ వంట కథ)

నళిని గురించి చెప్పే ముందు, కాస్త వంట గురించి చెప్తాను. నళినికి వంట రాదని కాదు గానీ, నలుడు ఫలానా సుబ్బారావు అని చెప్పడానికి ముందు



– వంట గురించి చెప్పాలి.

వంట అన్నా, కథ అన్నా– ఉప్పుతో పదీ, పప్పుతో తొమ్మిదీ చూసుకోవాలి ఉప్పుతో పదీ, పప్పుతో తొమ్మిదీ ఎందుకూ? అని కథానాయకుడు సుబ్బారావుని అడిగితే, అతను చెప్పలేడు కనుక– లేదా చెప్పకపోవచ్చును కనుక– నాయిక నళినిని అడగవచ్చును అయితే, ఆ నళిన దళాక్షి వారపత్రికలలో వారగా వేసే వంటలూ– వార్పులూ గట్రా చదవదు గనుక ముక్కు గుద్దినట్లు (ఈ ముక్కు సుబ్బారావుదా? ప్రస్తుతం కాదు) "నాకు తెలియదు అని చెప్పగలదు'

వంట అనేది 'కళ' అనీ 'శాస్త్ర' మనీ రెండు వాదాలున్నాయి జీవితం అనేది మిధ్య అనీ సత్యమనీ రెండు వాదాలు వుండి, ఆ రెంటినీ ఏ విధంగా ఐతే 'యిదమిత్థ'మనీ తేల్చలేరో– అలాగే యీ వంట అనేది కూడా శాస్త్రమా లేక కళా? అన్నది కూడా నిర్ణయించలేరు– అని సుబ్బారావు వుద్దేశం

సుబ్బారావు మొదట్నించీ చురుకైన వాడు చురుకుగా, సులువుగా వాళ్లమ్మ వెనుక అదీ యిదీ సాయం చేస్తూ చిన్నప్పుడే వంట నేర్చుకున్నాడు మరీ– ఏడో ఏట మూడో క్లాసూ, పదో ఏట ఏడో క్లాసూ చదువుకున్నాడు ప్రస్తుతం పెద్దవాడై– పట్టభద్రుడై ఆ డిగ్రీ కాయితాన్ని భద్రంగా పటం గట్టి గోడకి వ్రేలాడగట్టాడు'

అలాగే– మొన్న నా మధ్య వాళ్లమ్మా, నాన్న గారూ కూడ బలుక్కొని– తిరుపతిలో అని చెప్పి, తిరుచానూరులో సలక్షణంగా ఉపనయనం చేసి, మూడు పోగుల జందెం వేసి, దీవిస్తే– 'అత్తిరీ– యిరవై నాలుగు సంవత్సరాల, ఎనిమిది మాసాల తొమ్మిది రోజుల పెళ్లీడు వాడికి మూడు పోగులేనా వేస్తారూ. అంటూ బాద పడ్డట్లు– ఆ జెందెం ముక్కను డిగ్రీ పట్టా తగిలించడానికని గోడకి కొట్టిన మేకుకే తగిలించేశాడు కూడా' అంటే– పెళ్లికీ, ఉద్యోగానికీ కూడా సుబ్బారావ్‌కి అర్హత వచ్చేసిందన్న మాట'

సుబ్బారావు డిగ్రీకి ఓ కాపీ తీసి, పోస్టులో పంపగానే ఆడపిల్ల లెక్కువగా వున్న తండ్రి– అల్లుణ్ణి కొల్చుకునీ, చూసుకొనీ చెయ్యకుండానే పిల్లనిస్తానని వచ్చినట్లు– ఓ కంపెనీ వాళ్లు అర్జెంటుగా, తిరుగు టపాలో ఉద్యోగమిచ్చేశారు

సుబ్బారావుకి ఎగిరి గెంతేసినంత సంతోషం వేసి, ఎగిరి గెంతేశాడు కూడా' కాని ఏం చేస్తాం– అంతెగిరినా ఆఖరికి నట్టింటి గుమ్మం కూడా నెత్తికి తగల్లేదే, ఇలాంటి పసివాణ్ణి పట్నం వుద్యోగానికి ఎలా పంపనూ?' అని వాపోయింది వాళ్లమ్మ కానీ వాళ్ల నాన్నగారు మాత్రం యీ విషయంలో కాస్త కోప్పడ్డారు 'ఆ యీడుకి నేనూ, నువ్వూ వాణ్ణెత్తుకుని ఆడించాం పైగా ఎన్నాళ్లేం? ఒంటి రెక్క బతుకు– వేణ్ణీళ్లకు చన్నీళ్లు అని నాకు నాలుగు రాళ్లూ– వాడికి కాస్త లోకానుభవం రావాలి" అంటూ సుబ్బారావుని రైలెక్కించేశాడాయన

వాళ్లమ్మ ప్రేమగా– ఒక అర బస్తా దంపుడు బియ్యం, ఒక మణుగు నెయ్యి, ఒక బుట్ట నిండా నీరుల్లిపాయలు, (వెల్లుల్లిపాయలంటే సుబ్బారావుకి పరమసహ్యం!) ఒక జాడీలోకి– పాతగూనలో నుంచి ప్రత్యేకంగా తీసిన ఊట ఆవకాయ, యింకా కొన్ని మినప సున్ని వుండలూ (అవి అంటే సుబ్బారావు చెవి కోసుకుంటాడని వాళ్లమ్మకి మాత్రమే తెలుసు) గట్రాతో రైలెక్కించేసింది' దంపుడు బియ్యం వద్దనీ– అక్కడ పట్నంలో వండి పెట్టగల వంట వాళ్ళు– సుబ్బారావుకు ఫలానీ కంపెనీ వారిచ్చే జీతం కంటే మరో పాతిక ఎక్కువిస్తే గానీ దొరకరని– నమ్మించి, వాళ్ల నాన్న– అర మూట బియ్యం దింపేశాడు– సుబ్బారావుని రైలెక్కించేశాడు కూడా'

పట్నంలో సుబ్బారావు 'కథా నాయకుడి'లా దిగాడు అతనితో పాటు ఆవకాయ, ఆవు నెయ్యీ దిగాయి! (సుబ్బారావు గారింట్లో గేదెలు మాత్రం గలవు కాని ఆవునెయ్యి ప్రత్యేకం సుబ్బారావు కోసం కొంటారు )

ఇక్కడ కథానాయిక – నళిని గురించి పరిచయం చేయడం అవసరం నళినికి వాళ్ల బామ్మ అంటే కోపం బామ్మకి నళిని అంటే యిష్టం ముఖ్యంగా నళిని ఒక్క జెడ వేసుకోడం మరీ యిష్టం సవరం పెట్టుకుని యించక్కా



పొడుగ్గా బారెడు జెడ అల్లుకోవే అమ్మో అంటుందావిడ పొట్టిగా, వొత్తుగా పెరిగిన కేశ సంపద కలిగిన మనుమరాలికి రెండు జెడలు- పైగా ఆ రెండూ నిజం జుట్టుతోనే వేసుకోడం యిష్టం- కొసలు వెడల్పుగా అట్టకాడల్లా వుండాలి అదీ ఫ్యాషన్. నళినికి రేడియో పెట్టడం వచ్చును

కాని బామ్మకి- నళినిని పాట నేర్చుకోమనడం- పాట పాడమనీ వేధించడం వచ్చును నళినికి 'పియ్యూసి' పార్టు వుండిపోయింది అంచేత, యీ ఏడాది ఆ అమ్మాయి యింట్లోనే వుండిపోయింది నళినికి ఒక అన్నయ్య వుండేవాడు-




మరే వుండె వాడు అంటే అర్థం యిప్పుడు లేడని కాదు ప్రస్తుతం యింట్లో లేడని తాత్పర్యం' వాల్తేర్‌లో పెద్ద బళ్ళో చదువుకుందికి వెళ్ళేడు ఆ అబ్బాయి ఒక గది ఆ యింట్లో అతనికి కేటాయింపుగా వుండేది ఆ గది ప్రస్తుతం ఖాళీగా వుంది నళిని వాళ్ళ నాన్నగారు ఆ గదిని అద్దె కిద్దామా అని గట్టిగానే అనుకుంటున్నాడీ మధ్య సుబ్బారావుకి ఉద్యోగం యిచ్చిన కంపెనీలో నే ఒక గురవయ్య గారున్నాడు అతనికి నళిని 'ఫాదర్' మనసులోని ఉద్దేశం బాగా తెల్సును ఎందుకంటే, ఆ యిద్దరూ, చతుర్ముఖ పారాయణం ఫ్రెండ్సు- పైగా గురువయ్య నోరూ, అలాగే సుబ్బారావు అదృష్టం- రెండూ మంచివి అనడం మూలాన, తన సిఫార్సు మీద - నళినీ వాళ్ళ యింట్లో ఖాళీగా వున్న- మెట్ల మీద గదిలో సుబ్బారావు అద్దెకి దిగిపోగలిగాడు సుబ్బారావుతో పాటు-ఆవు నెయ్యీ, ఆవకాయీ, నీరుల్లిపాయలూ ప్రవేశించాయి (కొన్ని పాయలలో వుల్లి మొక్కలు కాడలై మొలిచాయి కూడా')

నళిని సుబ్బారావుని చూడలేదని- సుబ్బారావు అనుకున్నాడు కాని - నళిని సుబ్బారావునీ- సుబ్బారావు సామానులో వున్న ఆవకాయని కూడా చూడగలిగింది ఆ సంగతి నళినీ వాళ్ళ బామ్మ కొక్కర్తికే తెలుసు

ఆవిడ, వెంటనే కోప్పడే మనిషి కాదు కనుక నళినికేసి యిలా చూసి, రెండు జెడలు వేసుకుంటే గానీ నీకు మొగుడు రాడని బెంగేమిటే?' అని అడిగింది నళిని మొహం ముడుచుకుని, 'అలా అయితే అసలు నాకు పెళ్ళే అక్కర్లేదు పో అంది అవ్వ' అన్నది వాళ్ళ బామ్మ నోరు నొక్కుకొని

నళిని రెండు జెడలలో యింత 'విప్లవగాడ' వుందని తెలియని సుబ్బారావు, బుద్ధిగా ఆఫీసుకి, అక్కడి నుండి కాఫీ హొటల్‌కీ, ఆ తర్వాత తిన్నగా భోజన హొటల్‌కీ కూడా వెళ్ళి, రెండు రోజులు ఎలాగో, ఏదో తిని నేరుగా 'రూమ్'కి వచ్చేడు మూడో రోజున ఉదయం తొమ్మిదిన్నర గంటలకి నళిని కూని రాగాలు తీస్తూ వాళ్ళ 'దొడ్లో' బాత్ రూమ్‌లో, వేణ్ణీళ్ళతో స్నానం చేస్తోంది వాళ్ళ బామ్మ పెరట్లో- రోట్లో పప్పు పచ్చడి రుబ్బుతోంది అదే సమయానికి, అద్దంలో చూసుకుంటూ - ఆరో సారి క్రాపింగు దువ్వుకుంటున్న సుబ్బారావుకి, 'టక్కున' ఓ సంగతి గుర్తొచ్చింది

వెంటనే హొల్డాలు ప్రక్కనే వున్న 'సజ్జ' కేసి భయంగా చూశాడు ఉల్లికాడలు తొంగి చూశాయి' - ప్రక్కనే వున్న జాడీ మూత ఎత్తాడు ఆవకాయ 'ఎర్రగా' చూసింది' నోరూరింది పాపం' సుబ్బారావుకి' కాని సీసాలో ఆవు నెయ్యి బూజు పడుతోంది ఆవకాయని ఒక గ్లాసులోకి తీసుకుని, హొటలికి పట్టుకెళ్తే? ' సుబ్బారావుకి ఆలోచనలు మెరుపుల్లా వస్తాయి కానీ పిడుగుల్లాటి అనుమానాలు కూడా వాటిని వెంటతగులుతాయి

నళిని చూస్తుందో ఏమో?' అని భయం వేసింది [illegible] ఆవకాయా, ఆవునెయ్యీ ఉల్లిపాయలూ అన్నీ తీసుకుని మరీ హొటల్‌కి పోతున్నాడూ అనుకుంటుందేమో ఆ పిల్ల' అనుకున్నాడు సుబ్బారావు (వంట రాకపోతే అంతేనని కూడా అంటుందేమో?)

కానీ, ఆ సమయంలో సుబ్బారావుకి అసలు తర్కమే తలకెక్కలేదు ఏమైనా, 'నళిని- రెండు జెడలు వేసుకునే నళిని- హిందీ సినిమా పాటలు గొణిగే నళిని- చూస్తూ వుండగా ఆవకాయ కాదు కదా, ఒక్క నీరుల్లిపాయ అయినా జేబులో వేసుకుని ఆ మేడ మెట్లు దిగలేను' అని ఒప్పేసుకున్నాడు సుబ్బారావు- అద్దంలో తన కెప్పుడూ అందంగా కనబడే ప్రతిబింబం ముందు నిలబడి'

ఆ విధంగా సుబ్బారావు ఆవకాయనీ, ఆవు నెయ్యినీ, కంది పొడినీ, కొరివి కారాన్నీ అన్నింటినీ 'రూమ్'లోనే భద్రంగా వొదిలి, దీనంగా మెట్లు దిగుతూండగా, స్నానం పూర్తి చేసుకుని, పరికిణీ వోణీ వేసుకొని- అలా, పెరట్లోంచి వస్తూ, యిలా యింట్లోకి పారిపోతున్న నళిని, ఓ చూపు చూసింది' దాంతో, సుబ్బారావు దీన వదనం, చెంప దెబ్బ కొట్టినట్లు చైతన్యవంతమైంది

ఇంకా నయం, ఆవకాయ లేదు చేతిలో ననుకున్నాడు- దిగి, నేరుగా ఆఫీసుకి వెళ్ళిపోయాడు (భోజనం మాట మర్చిపోయి)

అలా నాలుగు రోజులు ఉత్త చేతుల్తో వెళ్ళి హొటలులో తిండీ, ఆపీసులో పనీ చేతకాక, చీవాట్లు తినేసరికి- సుబ్బారావుకి, నాలుక మీదా గెడ్డం మీదా కూడా వెంట్రుకలు మొలిచాయి

అబ్బ' నాకీ నూనె, 'రీఫైన్‌డ్ ఆయిల్' అయినా పడదు నాకీ పచ్చడి, 'చెట్నీ' అనబడినా కిట్టదు, అనుకున్నాడు కాని 'ఏం చేస్తాం?' రూములో అన్నీ వుండీ ఏమీ లేని వాడయ్యాడు సుబ్బారావు ఉల్లిపాయల సజ్జలో - ఎలుకలు వచ్చి కాపరం పెడుతున్నాయి కాబట్టి, సజ్జతో సహా వాటిని అవతల పారేశాడు (విధి బలీయం కదా') కాని, చూస్తూ చూస్తూ - కాస్త వేలితో నాకి చూసిన తర్వాత కూడా- ఆవకాయనీ, ఆవు నెయ్యినీ ఎలా పారెయ్యడం? కానీ సుబ్బారావు చురుకైన వాడనీ, పట్టుబద్రుడనీ ముందే చెప్పాను కదా' ధైర్యం కోసం, వాళ్ళమ్మ రాసిన ఉత్తరం తీసి చదువుకున్నాడు మరో సారి' 'బాబూ' ఆశీస్సులు ఎలా వున్నావో ఏమో? అయ్యో' దంపుడు బియ్యం కాకపోతే మానె, మర బియ్యమైనా ఓ పావు మూట నీతో పట్టుకు పోకపోతివె నని ఆమె బాధ పడుతూ రాసింది



# సుబ్బనళినీయమ్! అను మగ వంట కథ

ఆ వేళ ఆఫీసులో సుబ్బారావుకి పని తోచలేదు. 'వంట' బుర్రలో ప్రవేశించింది. నళిని కూడా గుర్తుకు రాలేదు. ఎంత సేపూ భోజనం– ముఖ్యంగా వేడివేడి అన్నం, నెయ్యీ, కంది పొడుం, ఆవకాయా లాంటి తెలుగు మాటలన్నీ బుర్రను దొలి చేస్తున్నాయి. అవి తలలోంచి. చేతి మీదుగా కలంలోకి దూరి, కాయితం మీదికి 'నల్ల'గా జారి పోతాయేమోనని భయమేసింది. ఎట్టకేలకు సుబ్బారావు ఒక నిర్ణయం చేసుకున్నాడు. "నేను వండుకుంటాను" అనుకున్నాడు. వండుకోడానికి ఏం కావాలీ? మొదటిది వంట రావాలి. అది సుబ్బారావుకి రాదని ఏ చరిత్రకారులైనా రాస్తే, వాళ్ళని గుండేసి కొట్టినా పాపం లేదు. సుబ్బారావు భీముడు కాకపోయినా, నలుడు కాగలడు.

తిన్నగా మానేజర్ దగ్గరకు వెళ్ళి, "సార్ ఐ వాంట్ లీవ్" అన్నాడు.

"ఎందుకూ?" అన్నాడు మానేజర్– "వంట వండుకోవాలి" అని అనేసి, సుబ్బారావు నాలిక్కరుచుకున్నాడు. ఆ మానేజర్ తెల్లబోయి, "వ్వాట్" అన్నాడు. సుబ్బారావు సిగ్గుపడుతూ– "నేను నా రూములోనే వంట పెట్టుకుని భోజనం చేస్తాను సార్. యీ హొటలు తిండి నాకు పడటం లేదు అని మా అమ్మ లెటర్ రాసింది" అన్నాడు. సుబ్బారావు తెగువకి మానేజర్ తెలుగులో నవ్వేసి, 'లీవ్'




యింగ్లీషులో 'గ్రాంట్' చేశాడు!

"ఇక నళిని నన్ను చూసి "నవ్వపోదు" అని సుబ్బారావు ధైర్య పడ్డాడు.

★ ★ ★ ★

తక్షణం ఒక జనతా స్టౌ కొన్నాడు– రెండు సిల్వర్ గిన్నెలు, ఒక గరిట కొన్నాడు– నలుడై పోయిన సుబ్బారావు. తను తెచ్చుకున్న ఆవకాయా, ఆవునెయ్యీ తినాలంటే– తన స్వయంపాకం సుబ్బారావుకి, అతనిలోని భోజనప్రియత్వమనే కళాత్మకమైన అభిరుచికీ కూడా– అప్పట్లో అత్యవసరం కనుక– అవి వెంటనే కొన్నాడు. కానీ కిరసనాయిలు మర్చిపోయాడు. బీడీలు కాల్చే అలవాటు లేదు కనుక అగ్గిపెట్టె కొనుక్కోలేదు. ఒక యిత్తడి గ్లాసు, టిఫిన్ కారియర్‌లోని అయిదు గిన్నెలూ రూములో వున్నాయి. ఫర్వా లేదని ఆలోచించాడే తప్ప– మూకుడూ, దాంతో పాయ్యీ– దానిలోకి యింధనం లేని వంట సామాగ్రి సశేషమని తెలుసుకోలేకపోయాడు సుబ్బారావు.

అంచేత, ఆ రాత్రికి సుబ్బారావు మళ్ళీ హొటల్‌కి వెళ్ళాల్సి వచ్చింది. వెళ్తూండగా నళిని కనిపించింది. "పోనీ వీళ్ళను కాస్త కిర్సనాయిలూ, అగ్గిపెట్టే ఎరువు అడగనా?" అనుకున్నాడు సుబ్బారావు. కానీ, చూస్తూ– చూస్తూ రెండు జెడలు వేసుకున్న ఆడపిల్లను ఎలా అడగటమా? అని సంకోచించాడు. కాని, సుబ్బారావు గట్టివాడు. ముఖ్యంగా యిలాంటి విషయాల్లో హరిబ్రహ్మాదులు అడ్డంగా వచ్చినా, అనుకున్న పని చేసి తీరుతాడు. కాబట్టి, అడ్డంగా వచ్చిన నళినిని అడిగి తీరాలి అనుకున్నాడు. అది గమనించినట్లు నళిని కూడా "ఏం కావాలండీ?" అంది కమ్మగా...

"కిర్సనాయిలు"– పెదాలు తడవుకున్నాడు. నళినికి ఆశ్చర్యంతో పాటు కాస్త భయం కూడా వేసింది. కాని, తెలివైంది గనుక, కరెంట్ పోతే, కొవ్వొత్తులున్నాయిగా, యిస్తానంది– జాలిగా.

"కాదు, కరెంట్ వుంది... వండుకుందామని... కిర్సనా...." సుబ్బారావునిక యెవ్వరూ ఆడ్డలేరు. కానీ మాట పూర్తి కాకముందే నళిని పారిపోయింది. భయమో, ప్రేమో, అనుమానమో, అదొక శృంగార చేష్టా విశేషమో లేక తెలుగు పాఠమో తెలియని సుబ్బారావు కూడా, అంత కంగారూ పడిపోయాడు: నళిని వెళ్ళి వాళ్ళ బామ్మను పంపింది. కానీ అంతలో కంగారు పడి, బయట పడ్డ సుబ్బారావు– హొటలు దాకా వెళ్ళి గానీ తిరిగి చూడనే లేదు.

వాళ్ళ బామ్మ నళినిని పిలిచి, "ఏమే! నీవు పెంకితనం చేస్తున్నావా? లేక, ఆ కుర్రాడు వేషాలు వేస్తున్నాడా? చెప్పు. "కిర్సనాయలెందుకూ అతగాడికీ? ఏడీ ఎక్కడున్నాడూ?" అని గుడ్లురిమింది.

నళిని నవ్వి, అంతలో ఏడుపు మొహం పెట్టి, "నీ మీద ఒట్టు బామ్మా! ఆ అబ్బాయి వొండుకుందికి కిర్సనాయిలే అడిగాడే" అంది.

"వొండుకుంటాడా? అయితే ఒట్లు కాబోలే పిల్లా!... పోన్లే రేపు యిద్దాం," అంది ఉదారంగా బామ్మ.

అయితే, పౌరుషం గల సుబ్బారావుకు– ఆ, 'రేపు' కిర్సనాయిలు, వడ్లు లాంటివి అడిగే అవసరమే లేదు. అన్నీ స్వయంగా తెచ్చుకున్నాడు. తన గదిలోనే ఒక ప్రక్కన– కాలువ కన్నం వున్న దగ్గర, 'స్టౌ'– పెట్టాడు. పప్పూ, ఉప్పూ అన్నీ చిన్న చిన్న పొట్లాల పెట్టె లాంటి దాంట్లోనే అమర్చాడు. నళిని గారింట్లో పని చేసే 'గంగాయమ్మ' చేతనే డాబా మీదే బియ్యం కడిగించేడు. గంగాయమ్మ– జాలిపడి, "ఎందుకు బాబూ? మీకీ శ్రమ! కావాలంటే క్రింది బామ్మగారు మడిగా వండి పెడతారు. తినరాదా? నేను చెప్పనా ఏంటి?" అని అడిగింది– కానీ సుబ్బారావు తెలుగులో– విశ్వస్త పడ్డించినా, వెల్లుల్లి వేసినా తినడానికి నేను ఏమీ శ్రీనాథుణ్ణి కాను గంగాయమ్మా!" అన్నాడు.

"నాకు వంటవచ్చునుగా" అని కూడా ప్రకటించాడు.

"సరే! మీ యిష్టం" అంది గంగాయమ్మ. "పిచ్చి కాబోలు" అని స్వగతం పలుక్కుంది కూడా!

కారియర్ గిన్నెలతోనూ– సిల్వర్ మూకుడుతోనూ– మొత్తం మీద– సుబ్బారావు అన్నం, కూరా చేసుకున్నాడు. బంగాళా దుంపలు తొక్క తీయకుండా బ్లేడుతో తరిగి, ఆవు నెయ్యితో 'వేపడం' చేసుకున్నాడు!

మధ్య మధ్య కాస్త చెయ్యి కాల్చుకున్నాడు గానీ మరీ అంత ప్రమాదం లేదు. ఆవకాయలో అన్నం నంజుకుని (కాస్త చిముడు, చిమిడుగా వుంది అన్నం మరి) కూర ముక్కలకు ఉప్పు అద్దుకుని– మొదట వేయడం మర్చిపోయాడు– (క్రొత్త గదా మరి) తిని– వెంటనే పరుగెత్తి, ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

కాని, అరగంట ఆలస్యమైంది అని 'మెమో' యిచ్చాడు వాళ్ళ మానేజర్ ఛీ... ఛీ! సుబ్బారావు ఎంత పాకశాస్త్ర వీరుడో బొత్తిగా యెరుగని మానేజర్!

★ ★ ★ ★

నళిని– సుబ్బారావు వంట వుద్యమం అంతా గంగాయమ్మ ద్వారా విన్నది. కుతూహలం, సంతోషం, జాలి లాంటి వన్నీ ఆ పిల్ల మనసుని పెనవేశాయి. అద్దంలో చూసుకుంటూ కూడా– రెండు జెడలకు బదులు– పరధ్యానంలో– ఒక్క జెడ వేసుకుని, తిన్నగా, బామ్మ కంట బడకుండా, డాబా మీదకు వెళ్ళి– సుబ్బారావు గది కిటికీలో నుంచి చూసింది. 'నిజంగా వండుకున్నాడు– పైగా

చాలా నీటుగా వండుకున్నాడు కూడా'నని మనసారా మెచ్చుకుంది డిగ్రీ పుచ్చుకుని కూడా వంట చేయగలగడం ఎంతో బాగుందీ అని ఆశ పడ్డది ఛీ. చీ! నాకు బామ్మ అంటున్నట్టు- రెండు జెడలు వేసుకోడం తప్ప- వంట కూడా రాదూ," అని బాధ పడింది పోనీ! సుబ్బరంగా, సుబ్బారావు లాంటి భర్త వస్తే, హాయిగా, తీరిగ్గా- రెండు జెడలే వేసుకుంటూ వుండొచ్చునని కూడా ధైర్య పడింది నేరుగా క్రిందికి దిగి వెళ్ళి బామ్మతో, 'బామ్మా! నువ్వు స్వార్థపరురాలివి, అంది గట్టిగా.

"ఏం జరిగిందే లక్ష్మిందేవీ? అన్నది వాళ్ళ బామ్మ, మడిగా, దూరంగా నుంచొని

"మడీ మడీ అంటూ ఆఖరికి నాకు వంట కూడా నేర్పలేదు' అన్నది నళిని కోపంగా

"ఆదా! నీ బెంగ? వంట దేం భాగ్యమే పిల్లా! రెండు జెడలు వెసుకోడం నేను నేర్పేను గనుకనా వంట నేర్పడానికి? అది మీ అత్తవారింట నేర్చుకుందువు గాని లే" నని ధైర్యం చెప్పింది బామ్మ

ఉహూ(! నేను నేర్చుకోను" అంది నళిని

"సరే! మీ నాన్న ఓ వంట వాణ్ని చూసి తెస్తాడులే నవ్వింది బామ్మ

బోలెడు నవ్వి- పారిపోయింది నళిని

ఆ పారిపోవడంతో బోలెడు దూరదృష్టితో పారిపోయింది ఆ వంట వాడూ, ఆ నలుడూ- ఆ సుబ్బారావే అయితే- ఎంత బాగుణ్ను! హాయిగా దమయంతిలా 'కానీ సుబ్బారావు పెళ్ళయాక వంట మానేస్తాడేమోనని బయం వేసింది

నళిని- వెంటనే వాళ్ళమ్మ దగ్గరికి వెళ్ళి, అమ్మా! అంది అత్యవసరంగా వాళ్ళమ్మ వెంటనే "పాపం! మన యింట అద్దెకు దిగిన అబ్బాయి చెయ్యి కాల్చుకుంటున్నాడటగా" అన్నది

ఔను! నన్నే అగ్గిపెట్టి అడిగాడు , అంది నళిని

"ఓసి నీ యిల్లు బంగారంగానూ అన్నది వాళ్ళమ్మ అని, మళ్ళీ కూతురు తల నిమిరి, 'మన వాళ్ళ అబ్బాయేనట పాపం! బుద్ధిమంతుడు కాకపోతే- యీ రోజుల్లో కూడా స్వయం పాకం చేసుకుంటాడా?" అన్నది

"పాపం! వంట చేసేవాళ్ళు లేరు కాబోలే అంది నళిని

మీ నాన్న గారితో చెప్పనా? వాళ్ళమ్మ మాటలకు ఆశ్చర్యపోయి, పారిపోయింది

నేరుగా బామ్మ దగ్గరికి వెళ్ళి, బామ్మా! నేను వంట నేర్చుకోను', అని గట్టిగా 'అరిచి, గదిలోకి పారిపోయి, మంచం మీదకు గెంతి, 'కల నిజమాయెగా అంటూ కాళ్ళెగరేస్తూ పాడుకుంది అలాగే నిద్రపోయి, కలలో సుబ్బారావు వంట అతను తినిపించగా, రుచి కూడా చూసింది!

* * * *

కాని ఏం చేస్తాం! కథల్లో విలన్లు ప్రవేశిస్తారుగా! కద వంటతో ప్రారంభించి, పెళ్ళితో ముగిస్తే- రుచిగా బాగుణ్ను గానీ, సుబ్బారావు లాంటి వంట వండుకుని తినేటంత చాదస్తం వున్న వాడికి- ఆఖరిః హొటల్‌లో నైనాతినడం రాని వాడికి- 'పిల్లను యివ్వను , అన్నాడు నళినీ వాళ్ల నాన్నగారు నళిని- యీ విలన్ లాంటి నాన్నలున్నంత కాలం- ఆడపిల్లలు వంటలు- ఆఖరికి వారపత్రికలు చదివైనా సరె నేర్చుకోవల్సిందే నని పశ్చాత్తాప పడింది విధిని తిట్టుకుంది

నలుడు వరించి వచ్చినా- మి నాన్నగారు వరం యివ్వనన్నారు , అంది వాళ్ళమ్మ బాదగా'

ప్చ్! ఏం చేస్తాం? నళినీ వాళ్ల నాన్నగారలాంటి వాడు! కాని నళినికి మాత్రం సుబ్బారావు మీద ఆశ పోలేదు- వంట - పైగా- బామ్మ మడి కట్టుకుని చేసే వంట అంటేనే ఆ పిల్లకి యిప్పుడు మరీ అయిష్టమైపోయింది తన ప్రేమ గాద విషాద గాథ కాకుండా రక్షించే దేముడెవడాని చూస్తోంది

వీరాజీ





# వి.ఐ.పి. ట్రీట్‌మెంట్

డాక్టర్ శ్రీధర్

హెల్త్ మినిష్టర్ ధనుంజయరావుకి ఆఫీసులో ఫైల్స్ చూస్తుండగా కడుపులో కాస్త నొప్పిగా అన్పించింది బహుశా నిన్న రాత్రి మున్సిపల్ మినిస్టర్ ఇచ్చిన విందు భోజనం తాలూకు ఫలితమేమో అనుకొని ఊరుకున్నాడు దనుంజయరావు అరగంటయ్యేసరికి నొప్పి కాస్తా తీవ్రం కావటంతో పి ఎ. ని పిలిచి సెక్రెటేరియట్ డాక్టర్‌కి కబురంపమన్నాడు ధనుంజయరావు.

మంత్రిగారికి అందులోనూ. ఆరోగ్య శాఖామంత్రికి కడుపు నొప్పి అనడంతోనే హడావిడిగా పరిగెత్తుకుంటూ వచ్చాడు డాక్టర్

మంత్రి చేంబర్‌లోనే బెడ్ మీద పడుకోబెట్టి పరీక్ష చేసాడు పది నిముషాలు పొట్ట అక్కడా ఇక్కడా నొక్కి చూసి ఏవో రెండు మాత్రలు ఇచ్చి అరగంటయ్యాక మళ్ళీ కబురంపమని చెప్పి వెళ్ళిపోయాడు డాక్టర్

ఆ మాత్రలు వేసుకున్నా ఫలితమేమీ లేకపోయింది నొప్పి తగ్గకపోగా మరి కాస్త ఎక్కువయినట్టనిపించింది ధనుంజయరావుకి

మళ్ళీ డాక్టర్‌కి కబురు వెళ్ళింది ఆపసోపాలు పడుతూ పరిగెత్తుకుంటూ వచ్చి మరో పది నిముషాలు కడుపంతా నొక్కి చూచి పి. ఎ. వైపు తిరిగి చావు కబురు చల్లగా చెప్పాడు డాక్టర్

"అపెండిసైటిస్ కావచ్చు" అని

"ఓ గాడ్! ఇప్పుడేమిటి చెయ్యడం?" ఆదుర్దాగా అడిగాడు పి ఎ

"మెడికల్ కాలేజి హాస్పిటల్‌కి తీసుకెళితే మంచిది. ఏ నిముషాన్నైనా ఆపరేషన్ అవసరం కావచ్చు" అన్నాడు డాక్టర్

పి ఎ తన రూమ్‌లోకి వెళ్ళి మెడికల్ కాలేజీ హాస్పిటల్‌కి ఫోన్ చేశాడు హాస్పిటల్ సూపరింటిండెంట్ - అప్పటికే ఇంటికి వెళ్ళిపోయాడట ఆర్. ఎం. ఓ కి ఫోన్ చేసి, విషయం చెప్పి మంత్రిగారు వస్తున్నారంటూ కబురు చేసాడు పి. ఎ.

హాస్పిటల్ ఆర్. ఎం. ఓ. కి ఒక్క నిముషం ఏం చేయాలో తోచలేదు. తన సర్వీసులో మినిస్టర్ సర్‌ప్రైజ్ విజిట్ చేయడం తెలుసుగానీ ఇలా పేషెంట్‌గా రావడం ఇదే మొదటిసారి

వెంటనే సూపరింటిండెంట్ గారింటికి ఫోన్ చేసాడు ఆర్ ఎం ఓ అదృష్టవశాత్తూ ఆయన ఇంట్లోనే ఉన్నాడు ఆసమయానికి మంత్రిగారికి కడుపునొప్పని, ఏ నిముషాన్నైనా హాస్పిటల్‌కి రావచ్చు గనుక వెంటనే హాస్పిటల్‌కు రావలసిందని కోరాడు ఆర్. ఎం ఓ

వెంటనే కారు తీసుకొని బయలుదేరాడు సూపరింటిండెంట్

ఆర్ ఎం ఓ ఎమర్జన్సీ వార్డుకి ఫోన్ చేసి మినిస్టర్‌గారు వస్తున్నారని, అన్నీ సిద్ధంగా ఉంచమని డాక్టర్‌కి ఆర్డరిచ్చేడు

ఈ లోగా ఛీఫ్ సర్జన్‌కి ఈ విషయం చెప్పడం జరిగింది సమయానికి చీఫ్ సర్జన్ ఇంట్లో లేడు ఏదో ప్రైవేట్ నర్సింగ్‌హోంలో ఆపరేషన్ చేస్తున్నాడు. ఆయన ఎక్కడున్నదీ కనుక్కునేసరికి ఆర్ ఎం ఓ కి తలప్రాణం తోకకొచ్చినంత పనైంది ఒకవేళ మంత్రిగారు చీఫ్ సర్జన్ చేతనే ఆపరేషన్ చేయించుకుంటానంటే, అదే సమయానికి చీఫ్ సర్జన్ లేకపోతే ఇంకేమైనా ఉందా? తామందరూ శంకరగిరి మాన్యాలకు ట్రాన్సఫర్లయి పోవలసిందే

ఎంత త్వరగా వీలైతే అంత త్వరగాహాస్పిటల్‌కి రావలసిందిగా కబురంపాడు ఆర్ ఎం ఓ చీఫ్ సర్జన్‌కి

చేస్తున్న ఆపరేషన్ మధ్యలో వదిలేసి రావడం వీలు కాదు కనుక పావు గంటలో ముగించి అరగంటలోపల ఎమర్జన్సీ వార్డ్‌కి వచ్చేస్తానన్నాడు ఛీఫ్ సర్జన్.

ఈలోగా మంత్రిగారి పి. ఎ నుండి మళ్ళీ ఫోనొచ్చింది. మంత్రిగారు బయలుదేరుతున్నారంటూ.

ఆర్. ఎం ఓ. ఎమర్జన్సీ వార్డుకి బయలుదేరాడు మంత్రిగారిని స్వయంగా రిసీవ్ చెసుకోవడానిక, అతనక్కడికి చేరుకొనేసరికి హాస్పటల్ సూపరింటిండెంట్, డ్యూటీ డాక్టర్ రెడీగా ఉన్నారు

"ఈజ్ ఎవిరిథింగ్ రెడీ?" వస్తూనే అడిగాడు డ్యూటీ డాక్టర్‌ని.

"అన్నీ అయిపోయినట్టే కేస్ షీట్‌తో సహా" గర్వంగా చెప్పాడు డ్యూటీ డాక్టర్

ముగ్గురూ పోర్టికో దగ్గరే నుంచున్నారు మినిస్టర్‌ని రిసీవ్ చేసుకోవడానికి

కొద్ది నిమిషాల తరువాత ముందు పైలట్ కారు, ఆ వెనుక మినిష్టరు కారు వచ్చి ఆగాయి పోర్టికోలో.

సూపరింటిండెంట్, ఆర్ ఎం ఓ కారు దగ్గరికి పరిగెత్తారు డోరు తెరవడానికి మినిష్టర్‌గారు వెనక సీట్లో కాస్తంత ప్రక్కకు ఒరిగి కళ్ళు మూసుకుని కూర్చుని ఉన్నారు

ఈ లోగా హెల్త్ సెక్రటరీ కారు పోర్టికోలో వచ్చి ఆగింది. హెల్త్ సెక్రటరీ ఆయన వెంట మందీ మార్బలమూ బిలబిలా కారు దిగి మంత్రిగారి కారు చుట్టూ మూగారు

"వీల్ ఛైర్ తీసుకురండి" ఆర్డరిచ్చేడు ఆర్ ఎం ఓ ప్రక్కనే నిలబడి చోద్యం చూస్తున్న వార్డ్‌బోయ్‌కి

వార్డ్‌బోయ్ హడావుడిగా వీల్‌ఛైర్ నెట్టుకుంటూ వచ్చాడు. కిరకిర్‌మంటూ చప్పుడు చేస్తోందా వీల్ ఛైర్ ఒక చక్రానికి రబ్బరు తొడుగు ఊడిపోయిందేమో, ఆ వైపుకి కాస్తంత వంగిపోయి నడుస్తున్నప్పుడు కర్ణకఠోరంగా చప్పుడు చేస్తోందా వీల్ ఛైర్

వీల్ ఛైర్ అవతారం చూసేసరికి హాస్పిటల్ సూపరింటిండెంట్‌కి ఎక్కడలేని కోపం వచ్చింది ప్రక్కనే నుంచుని గుడ్లప్పగించి చూస్తున్న ఆర్ ఎం ఓ ని మోచేత్తో పొడిచి, వీల్‌ఛైర్‌ని చూపించాడు సూపరింటిండెంట్

"మంచి వీల్ ఛైర్స్ దొరకలేదా? ఈ డొక్కు వీల్ ఛైర్ మీద ఆయన్ని తీసుకెళితే, రేపు మనిద్దరికీ మెమోలు తప్పవు అది ఏ క్షణాన్నయినా విరిగేట్టుంది' అన్నాడు సూపరింటిండెంట్ ఆర్ ఎం ఓ కే వినబడేలా

"మరేం చెయ్యమంటారు అన్నింటిలోకీ అదే మంచి వీల్ ఛైర్ ఇంకా మంచిది కావాలంటే లోపల వార్డ్సు నుంచి తెప్పించవలసిందే" అన్నాడు గుస గుసగా ఆర్ ఎం ఓ

"వెంటనే ఆ ఏర్పాట్లేవో చూడండి ఈ లోపల మంత్రిగారు కారు దిగకుండా నేను చూస్తాను" అనేసి కారు వైపు కదిలాడు సూపరింటిండెంట్

కారు డోర్ దగ్గరకెళ్ళి "సర్ మీరు కాసేపు కారులోనే కూర్చుంటే మంచిది వీల్ ఛైర్ తేవడానికి వార్డు బాయ్‌ని పంపించాను" అన్నాడు సూపరింటిండెంట్ చేతులు నలుపుకుంటూ

సూపరింటిండెంట్ వంక తినేసేలా చూసాడు మినిష్టర్

"కడుపు నొప్పితో నేను చస్తుంటే మధ్య వీల్ ఛైర్ గొడవేమిటి? ఏదో ఒకటి త్వరగా పట్రండి" అన్నాడు మినిష్టర్

ఈలోగా హెల్త్ సెక్రెటరి కల్పించుకొని "ఏమిటండీ సూపరింటిండెంట్‌గారూ? మంచి వీల్‌ఛైర్ కరువైందా ఇంత పెద్ద హాస్పిటల్‌లో? ఇట్స్ రియల్లీ షేమ్‌ఫుల్" అన్నాడు కోపంగా

"సర్ నేను ఆర్ ఎం ఓ ని తరువాత ఎక్స్‌ప్లనేషన్

అడుగుతాను సర్" అన్నాడు సూపరింటెండెంట్ ఆర్. ఎం ఓ. పైపళ్ళు నూరుతూ

వీల్ చైర్‌కని లోపల వార్డుకెళ్ళిన వార్డుబోయ్ తాపీగా పావు గంట తర్వాత దానిని నెట్టుకుంటూ వచ్చాడు కారు దగ్గరికి

ఎలాగైతేనేం మంత్రిగారిని ఎమర్జన్సీ వార్డులో చేర్పించడం జరిగింది

అప్పటికే ఒక బెడ్‌ని రెడీ చేసి ఉంచారు మంత్రిగారి కోసం డాక్టర్స్ కూర్చునే టేబుల్‌కి దగ్గరగా ఉన్న ఒక బెడ్ చుట్టూ స్క్రీన్స్ అరేంజ్ చేసి ఆ బెడ్ మీద మంత్రిగారిని పడుకోబెట్టడం జరిగింది

డ్యూటీ డాక్టర్ పల్స్ బి పి రికార్డ్ చేసి, కేస్ షీట్‌లో నోట్ చేసాడు సిస్టర్‌ని ఇంజక్షన్ బెరాల్గాన్, ఇంట్రావీనస్‌ఫ్లూయిడ్స్ స్టార్ట్ చేయమని ఇన్ స్ట్రక్షన్స్ ఇచ్చాడు

"చీఫ్ సర్జన్ ఇంకా రాలేదా?" అడిగాడు సూపరింటెండెంట్ ఆర్ ఎం ఓ వంక తిరిగి

"ఒక పావు గంటలో రావచ్చు" అన్నాడు ఆర్ ఎం ఓ

ఈలోగా ధనుంజయరావు బాధ మరీ ఎక్కువయింది బెడ్ మీద అసహనంగా అటూ ఇటూ దొర్లడం మొదలెట్టాడు మినిష్టర్ దనుంజయరావు

పావు గంట గడిచినా ఛీఫ్ సర్జన్ రాకపోయేసరికి చిర్రెత్తుకొచ్చింది సూపరింటెండెంట్‌కి

"ఇంకెప్పుడొస్తాడయ్యా ఛీఫ్ సర్జన్?" కోపంగా అడిగాడు ఆర్ ఎం ఓ ని

"నేనేం చేసేది సర్? కబురంపి అరగంట దాటింది" అన్నాడు ఆర్ ఎం ఓ గొణుగుతూ

మంత్రిగారి బెడ్‌కి కాస్తంత దూరంగా సూపరింటెండెంట్‌ని పిలిచి మెల్లగా అడిగాడు ఆర్ ఎం ఓ పోనీ ఇప్పుడున్న డ్యూటీ సర్జన్‌ని ఆపరేట్ చేయమంటే? ఆ మాత్రం అపెండిసెక్టమీ చేయలేడా?"

"ఏమో ఎంతైనా మంత్రిగారు కదా" చీఫ్ సర్జన్ చేత చేయిస్తేనే బాగుంటుంది రేపేదైనా కాంప్లికేషన్ వస్తే మనందరికీ ముప్పు తప్పదు" అన్నాడు సూపరింటెండెంట్

'పోనీ హెల్త్ సెక్రటరీ గారినడిగితే?" సలహా యిచ్చాడు ఆర్ ఎం ఓ

సరేనన్నాడు సూపరింటెండెంట్ ఇద్దరూ కలిసి హెల్త్ సెక్రటరీ గారిని ప్రక్కకు పిలిచి అడిగారు ఇదే విషయం

"అబ్బే వీల్లేదు ఆపరేషన్ చీఫ్ సర్జన్ మాత్రమే చేయాలి వెంటనే ఆయన్ని పిలిపించే ఏర్పాటు చేయండి" మంత్రిగారా మజాకా అన్నట్టు చూసాడు హెల్త్ సెక్రటరీ

"భగవంతుడా! చీఫ్ సర్జన్ త్వరగా వచ్చేట్టు చూడు స్వామీ" మనసులోనే మొక్కుకున్నాడు సూపరింటెండెంట్

దేవుడు అతడి మొర ఆలకించాడా అన్నట్టు చీఫ్ సర్జన్ పరిగెత్తుకుంటూ రావడం కన్పించింది

"హమ్మయ్య" హాయిగా గాలి పీల్చుకున్నారందరూ

పరిగెత్తుకుంటూ వచ్చాడేమో వగరుస్తున్నాడు చీఫ్ సర్జన్

"సారీ సర్ లేటయింది దారిలో ట్రాఫిక్ జామ్ అయి కారు చిక్కుకు పోయింది అది తప్పించుకుని వచ్చేసరికి ఇంత లేటయింది ఇంతకూ మినిస్టర్ గారెక్కడ?" అడిగాడు చీఫ్ సర్జన్

"ష్ గట్టిగా మాట్లాడ వద్దన్నట్లు సైగ చేసి స్క్రీన్ అరేంజి చేసిన గోడ వైపుకి వేలు చూపించాడు సూపరింటెండెంట్

గబగబా అటు వైపు నడిచాడు చీఫ్ సర్జన్ పావు గంట క్షుణ్ణంగా పరీక్షించాడు" ఎక్యూట్ ఎపెండిసైటిస్ అన్న నిర్ణయానికొచ్చాడు

డ్యూటీ డాక్టర్ వంక తిరిగి అడిగాడు "కేస్ షీట్" ఎక్కడ?

సిస్టర్ కేస్ షీట్ అందించింది

పల్స్ చూసి "బి పి కాస్త ఎక్కువగా ఉన్నట్టుందే" అన్నాడు చీఫ్ సర్జన్

"నొప్పి వల్ల కలిగిన ఆంగ్జైటీ వల్ల కావచ్చు సార్? అయినా ఏమంత ఎక్కువగా లేదు ఇట్ ఈజ్ బోర్డర్ మార్జినల్లీ హై' అన్నాడు డ్యూటీ డాక్టర్

"నో నో వియ్ కాంట్ టేక్ ఎనీ రిస్క్ కార్డియాలజిస్ట్‌ని పిలిపించండి ఈ లోగా బ్లడ్






బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

ఇద్దరు వ్యక్తులు నేరం చేసినట్లు నరసారావుపేట పోలీసులు 1985లో కేసు రిజిష్టరు చేశారు గుంటూరు ఎడిషనల్ సెషన్సు జడ్జి రెండవ ముద్దాయిని అరెస్టు చెయ్యకుండా ఏంటిసిపేటరీ బెయిలు మంజూరు చేశారు మొదటి ముద్దాయి షేక్ కాసిమ్ కూడా ఏంటిసిపేటరీ బెయిలు కోసం పిటిషన్ పెట్టుకున్నాడు కాని పోలీసులు మేజిస్ట్రేట్ కోర్టులో ఇద్దరు ముద్దాయిలపై కేసు పెట్టారు అందుచేత షేక్ కాసిమ్ పెట్టుకున్న పిటిషన్‌ను

## ఏంటిసిపేటరీ బెయిలు

జిల్లా జడ్జి తిరస్కరించారు దీనిపై షేక్ కాసిమ్ క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 438 సెక్షన్ క్రింద హైకోర్టుకు పిటిషన్ పెట్టుకున్నాడు ఈ సెక్షన్ క్రింద ఒక ముద్దాయికి మేజిస్ట్రేటు అరెస్టు వారెంట్ ఇచ్చిన తర్వాత హైకోర్టుకు లేదా సెషన్సు కోర్టుకు ఆ ముద్దాయికి ఏంటిసిపేటరీ బెయిలు మంజూరు చెయ్యడానికి అధికారం ఉన్నదా లేదా అన్నది ఇందులో ఉన్న ప్రశ్న అని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఫుల్ బెంచ్ తమ తీర్పులో పేర్కొన్నారు 1983లో హైకోర్టు డివిజన్ బెంచ్ 438 సెక్షను క్రింద మేజిస్ట్రేటు కోర్టులో చార్జిషీటు పెట్టినప్పుడు అరెస్టు వారెంట్ ఇచ్చిన తర్వాత ఏంటిసిపేటరీ బెయిలు ఇవ్వడానికి వీలు లేదని తీర్పు ఇచ్చారు ఈ తీర్పులో 1985లో షేక్ కాసిమ్ కేసు విచారిస్తున్న డివిజన్ బెంచ్ ఏకీభవించ లేదు అందుచేత ఈ కేసును హైకోర్టు ఫుల్ బెంచ్‌కు పంపించారు హైకోర్టు సంపూర్ణ ధర్మాసనం తమ తీర్పులో పోలీసులు చార్జిషీటు పెట్టినప్పుడు మేజిస్ట్రేటు వారెంట్ ఇచ్చినప్పటికి 438 సెక్షను క్రింద బెయిలు మంజూరు చెయ్య వచ్చును అన్నారు 438 సెక్షను క్రింద హైకోర్టుకు లేదా సెషన్సు కోర్టుకు ముద్దాయికి అరెస్టు వారెంట్ క్రిమినల్ కోర్టు ఇచ్చినప్పటికి ఏంటిసిపేటరీ బెయిలు మంజూరు చెయ్యడానికి అధికారం ఉన్నదని హైకోర్టు సంపూర్ణ ధర్మాసనం 1986లో తీర్పు చెప్పారు ఏంటిసిపేటరీ బెయిలు మంజూరు చేసే విషయంలో కోర్టు యొక్క అధికారాన్ని 438 (3) సెక్షను పరిమితం చెయ్యలేదు ఏంటిసిపేటరీ బెయిలు ఇచ్చినప్పుడు ముద్దాయిని అరెస్టు చేసినప్పటికి తిరిగి విడిచి పెట్టవలెను అని హైకోర్టు సంపూర్ణ ధర్మాసనం 1986లో తీర్పు చెప్పారు ●

## వి.ఐ.పి ట్రీట్‌మెంట్

షుగర్ రిపోర్ట్ కూడా తెప్పించండి అన్నాడు చీఫ్ సర్జన్

"ఎస్ సర్" అని ఫోన్ వైపు నడిచాడు డ్యూటీ డాక్టర్

కార్డియాలజిస్ట్‌కి కబురెళ్ళింది. మంత్రిగారిని చూడడానికి రమ్మంటూ

ఐ సి సి యు లో కేసెస్ చూస్తున్న కార్డియాలజిస్ట్ హడావిడిగా ఎమర్జన్సీ వార్డుకొచ్చాడు

మినిష్టర్ బి పి స్వయంగా చెక్ చేసి ఆపరేషన్ చేయడానికేమీ అభ్యంతరం లేదని కేస్ షీట్‌లో నోట్. చేసాడు కార్డియాలజిస్ట్ అయినా ఎందుకైనా మంచిదని ఆపరేషన్ అయ్యేంత వరకు మినిష్టర్ ప్రక్కనే ఉండమని రిక్వెస్ట్ చేసాడు సూపరింటిండెంట్

ఈ తతంగమంతా ముగిసేసరికి ఇంకొక గంట పట్టింది ఈ లోగా మంత్రిగారి నొప్పి మరింత ఎక్కువయింది అప్పటి దాకా సన్నగా ఉన్న మూలుగు మరింత ఎక్కువయింది కడుపు చేతొ పట్టుకుని అటూ ఇటూ దొర్లుతున్నాడు ధనుంజయరావు

"సిస్టర్ థియేటర్ రెడీయే గదా?" అడిగాడు చీఫ్ సర్జన్

"ఎస్ సర్ ఎవ్విరిథింగ్ ఈజ్ రెడీ"

"డ్యూటీ ఎనస్థటిస్ట్ ఎవరు?" సర్జికల్ గౌను వేసుకుంటూ అడిగాడు చీఫ్ సర్జన్

"డాక్టర్ సీతాపతి సర్" అన్నాడు డ్యూటీ డాక్టర్.

"ఓ గాడ్ డాక్టర్ సీతాపతా ఎనస్థీషియా ప్రొఫెసర్‌కి ఫోన్ చేయండి వెంటనే రమ్మని" అనేసి తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు ఛీఫ్ సర్జన్

ప్రొఫెసర్ ఆఫ్ అనెస్థషియా డాక్టర్ నిరంజనరావు వచ్చేసరికి మరో గంట గడిచింది

ఆఖరికి ఎలాగయితేనేం మినిష్టరుగారికి పర్సనల్ గౌన్ తొడిగి ఆపరేషన్ థియేటర్‌లోనికి తీసుకెళ్ళటానికి స్ట్రెచర్ మీద పడుకోబెట్టారు

చీఫ్ సర్జన్, చీఫ్ అనెస్థటిస్ట్, కార్డియాలజిస్ట్, డ్యూటీ డాక్టర్ అందరూ సర్జికల్ గౌన్స్ వేసుకొని వాష్ చేసుకొని రెడీగా థియేటర్‌లో నుంచున్నారు

ఈలోగా ముఖ్యమంత్రిగారి దగ్గర నుండి ఫోనొచ్చింది తను ఓ పది నిమిషాల్లో హెల్త్ మినిష్టర్ ధనుంజయరావుని చూడడానికి వస్తున్నట్టు

సూపరింటిండెంట్ డైలమాలో పడిపోయాడు. వెంటనే మంత్రిగారిని థియేటర్‌లోకి పంపడమా? లేక పది నిమిషాలాగి చీఫ్ మినిష్టర్ వచ్చి వెళ్ళిన తరువాతే ఆపరేషన్ మొదలెట్టడమా అని హెల్త్ సెక్రటరిని సలహా అడిగాడు సూపరింటిండెంట్

చీఫ్ మినిష్టర్ స్వయానా చూడడానికి వస్తున్నారు గనక ఆగడమే మంచిదన్నాడు హెల్త్ సెక్రటరీ

చీఫ్ సర్జన్‌ని థియేటర్‌లోంచి బయటకు పిలిచి ఆపరేషన్ 10 నిమిషాలు వాయిదా వెయ్యమన్నాడు సూపరింటిండెంట్

"బట్ సర్, ఎపెండిక్స్ ఏ నిమిషానైనా బర్స్ట్ కావచ్చు" అన్నాడు చీఫ్ సర్జన్

ఒక నిముషం ఆగి మెల్లగా అన్నాడు సూపరింటిండెంట్, "వియ్ విల్ హావ్ టు టేక్ చాన్సెస్ అయ్ కాంట్ హెల్ప్ ఇట్"

గ్లవ్స్ తీసేసి కుర్చీలో కూలబడ్డాడు చీఫ్ సర్జన్

పదిహేను నిముషాలయ్యాక చీఫ్ మినిష్టర్ ఆయన వెంట ఓ పాతికమంది హెల్త్ మినిష్టర్ చుట్టూ మూగారు

పరామర్శించడం అయిపోయి చీఫ్ మినిష్టర్ వెళ్ళేసరికి మరో అర గంట అయింది

చీఫ్ మినిష్టర్ వెళ్ళిన వెంటనే స్ట్రెచర్‌ని థియేటర్‌లోకి తీసుకెళ్ళి ఆపరేషన్ టేబుల్ పైకి మంత్రిగారిని మార్చారు

అబ్డామెన్ ఓపెన్ చేసిన చీఫ్ సర్జన్ లోపల ఫ్లూయిడ్ చూసి "అనుకున్నంతా అయింది ఎపెండిక్స్ రప్చర్ అయినట్టుంది" అనుకుంటూ కుడి వైపు చేతిని పోనిచ్చి ఎపెండిక్స్ బయటకు తీసి క్లాటత్ అప్లై చేసి కట్ చేసాడు

మామూలుగా పింక్ కలర్‌లో ఉండే అపెండిక్స్ ముదురు ఆకుపచ్చ రంగులోకి మారి ఉంది టిప్ దగ్గర వంకర టింకరగా ఉన్న సన్నటి చీలిక ఆపరేషన్ ఆలస్యంగా జరిగిందనడానికి నిదర్శనంగా ఉంది

ఫ్లూయిడ్ సక్ చేసి అబ్డామెన్ మూసి చర్మానికి స్టిచెస్ వేస్తూ అనుకున్నాడు చీఫ్ సర్జన్

"అపెండిసైటిస్ గనక ఏ మామూలు మనిషికో అయ్యుంటే ఆసుపత్రికి వచ్చిన అరగంట లోపల ఆపరేషన్ జరిగుండేది కాని మినిష్టర్‌గారు వి ఐ పి గనుక ఆయనకి ఆపరేషన్ అయ్యేసరికి ఆరు గంటలు పట్టింది.

"రప్చర్ అపెండిక్స్‌కి కాంప్లికేషన్స్ తప్పనిసరి" కనుక ఆయన కోలుకొనేసరికి ఏ రెండు నెలలో పడుతుంది అదీ మామూలుగా అయితే రెండవ రోజే ఇంటికి పంపించడం జరిగుండేది

వి ఐ పి అవటం కూడా ఒక్కోసారి నష్టానికే దారి తీస్తుంది కానీ తప్పదు" అనుకుంటూ గ్లవ్స్ తీసేసి ప్రక్కనే ఉన్న బుట్టలో పడేసి బయటికి నడిచాడు ఛీఫ్ సర్జన్ ●

# ఆంధ్రసచిత్రవారపత్రిక

హ హ్హ హ్హ!! హ హ్హ హ్హ!!

## గెలవండి రు. 3200 లు!

## హాస్య నవలికల పోటీ!

- వర్తమాన సంఘం మీద కలం దూసి వ్యంగ్య రచనలు చేసే వారికి, రాజకీయ అవగాహన- సామాజిక స్పృహ వున్న చతుర కలం జీవులకి యిదే సవాల్!
- 40, 45 పేజీలు- పేజీకి 20 నుంచి 25 పంక్తులకు మించకుండా ఒక హాస్య చతుర సామాజిక నవలికను రాసి పోటీకి పంపండి! (వెకిలి రచనలు వద్దు సుమా!) మంచి యితివృత్తం ఎన్నుకోండి!

| | |
|---|---|
| మొదటి బహుమతి | రు. 1500.00 |
| రెండో బహుమతి | రు. 1000.00 |
| మూడో బహుమతి | రు. 700.00 |

షరా మామూలే :

★ కాపీ కొట్టకూడదు- ప్రచురణ ప్రసారం అయిన వాటిని పంపకూడదు: సంపాదకుని నిర్ణయానికి కట్టుబడి వుండాలి!

★ నిడివి ఎక్కువైనా చిక్కే... తక్కువైనా యిబ్బందే...

★ రచయిత్రులు, రచయితలు అంతా పాల్గొనాలి! హామీ పత్రం జత చేయాలి. లావాదేవీలు వస్తే బాధ్యత వహించాలి!

★ రచనలు తిరస్కరింపబడితే త్రిప్పి పంపబడాలని కోరుకునేవారు- తగినన్ని తపాలా బిళ్ళలు అంటించిన- సొంత చిరునామాగల (చాలినంత) కవరుని పంపించాలి! లేదా ఆ వ్రాత ప్రతులు మరి దొరకవ్!

పోటీకి పంపే కథలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520003" అనే చిరునామాకి పంపాలి.

–సం.

**గడువు తేదీ ఫిబ్రవరి 27, 1989 దాకా!**



# సీరియల్ సూపర్ గర్ల్

## వింజమూరి విజయ శాంభవి

(గత సంచిక తరువాయి)

లేచి కిటికీలోనుండి చూసిందామె! నాలుగు స్కూటర్లు తమ ఇంటికి ఎదురుగావుండే సంగమేశ్వర్రావు ఇంటిలోకి వెళ్ళాయి

సూటూ బూట్లతో టిప్‌టాప్‌గా వున్న ఆ వ్యక్తుల్ని సంగమేశ్వర్రావు ఆహ్వానించి లోపలికి తీసుకెళుతున్నాడు! వాళ్ళని గమనిస్తున్న కార్తీకి వారిలో ఒకర్ని ఎక్కడో చూసినట్టు అనిపించింది.

## రెడ్ సూట్‌లో హెల్మెట్‌తో ఎవరతను?

ఎక్కడ? హఠాత్తుగా గుర్తువచ్చిందామెకి! నిన్న సాయంత్రం రాణి లెటర్ అందుకుని ఆ సందు మలుపు తిరుగుతుండగా రెడ్ సూట్ ధరించి తలమీద హెల్మెట్‌తో రాయల్ ఎన్‌ఫీల్డ్ మీద ఎదురయిన వ్యక్తి! అవును! అతనే!

సరిగ్గా అదే సమయంలో ఆ వ్యక్తి సంగమేశ్వర్రావుతో ఏదో అంటూ తలతిప్పి కార్తీ వాళ్ళ యింటి వైపు చూశాడు! చప్పున కదిలి యివతలికి వచ్చేసింది కార్తీ!

ఎవరతను? రాణి శత్రువులకి సంబంధించిన మనిషి కాదు కదా? ఆమెని వేధించిన రెండు ముఠాల్లో ఎవరికి చెందిన వాడు? తమ ఇంటి వైపు చూస్తున్నాడేమిటి? తన ఉనికిని పసిగట్టారేమిటి కొంపదీసి!

## సూట్‌కేసు ఎలా సంపాదించాలి?

ఈ ఆలోచనతో కార్తీకి ఖంగారుగా అనిపించింది!

ముందు ఆ సూట్‌కేస్ సంపాదించాలి! ఎలా? ఆ వంట వెధవ ఆ సూట్‌కేస్ విప్పిచూస్తే ఎలా? ఏముంది అందులో! అది లాక్ చెయ్యబడి వుంది! దాన్ని విడదియ్యటం అంత సులభం కాదు! వాడా పని చేసేలోగా పట్టుకోవాలి!

కార్తీ టైమ్ కోసం తలెత్తి గోడ మీదికి చూసింది! సరిగ్గా తొమ్మిది గంటలు! టాంగ్ టాంగ్ టాంగ్

'బేబీ! డాడీ ఫ్యాక్టరీకి వెళుతున్నారు' తల్లి కేకేసింది

చప్పున క్రిందికి దిగివచ్చిన కార్తీకి కారెక్కబోతున్న తండ్రితో పాటు డ్రైవర్ రాము పట్టుకున్న సూట్‌కేస్‌ని చూసేసరికి మెరుపులాంటి ఆలోచన తట్టింది!

వెంటనే ముందుకి కదిలి తండ్రితో, 'డాడీ! ఈ పూట బాంబే నుండి ఫ్లయిట్‌లో పార్ట్‌నర్స్ వస్తారన్నావు గదా! నువ్వు పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి రిపోర్టు చేసి ఎర్‌పోర్టుకి వెళ్ళేసరికి లేటవుతుంది ఫ్లయిట్ వచ్చేస్తుంది! ఈలోపల! అందుకని మీరు ఎర్‌పోర్టుకి సరాసరి వెళ్ళిపోండి. నేను ఆ సూట్‌కేస్ పట్టుకెళ్ళి పోలీసులకి అప్పగించి వస్తాను. మీకు టయిమ్ వేస్టు కాకుండా

"నువ్వా? సందేహంగా అన్నాడు తండ్రి

సుమిత్ర చప్పున అడ్డుపడింది. ఆడపిల్లవి! నువ్వు పోలీసు స్టేషన్ల వెంట తిరగడం ఏమిటి? నీకేమయినా మతివుందా అసలు?

"అబ్బా. నీకు తెలీదు! నువ్వు వూరుకో మమ్మీ! తల్లిని విసుక్కుని సి ఐ అంకుల్‌తో మాట్లాడి వస్తాను సరేనా? కార్తీ తండ్రితో అన్నది

ఆనంద్ సందేహం తీరిపోయినట్టు చూశాడు

ఓకె బేబీ! ఆ పనిచెయ్యి! మీ మమ్మీ చెప్పే గొడవ వెంగ రాత్రికి మళ్ళీ వస్తానంటూ! అప్పటికి ఫ్లయిట్ టైమ్ దగ్గరపడుతోంది! అని కూతురితో అని డ్రైవర్ వైపు తిరిగి మరేం ఖంగారులేదులే! మన వంద్రం మొన్ననే ట్రాన్స్‌ఫర్ అయి యిక్కడికి వచ్చాడుగా? వాడితో మాట్లాడి వస్తుందిలే! నేను డైరెక్ట్‌గా ఎయిర్‌పోర్టుకి పోతాను అని చెప్పి కార్లో కూర్చున్నాడు ఆనంద్. సూట్‌కేస్ చెడిపే తప్పించుకున్నట్టు రిలీఫ్ ఫీలయిపోతూ

ఇద్దరూ ఇద్దరే తండ్రి కూతుళ్ళు! మీరేమయినా? దాన్నిలా మగరాయుడిలా తయారయింది? కోపంగా అంది సుమిత్ర!

అబ్బ మిత్రా ఇప్పుడేం మునిగిపోయింది? పోనిద్దూ! అన్నాడతను

కారు వెళ్ళిపోయింది! సుమిత్ర గొణుక్కుంటూ లోపలికి వెళ్ళింది

రాము అక్కడ వుంచివెళ్ళిన సూట్‌కేస్‌ని తన రూమ్‌లోకి తెచ్చి ఆతృతగా ఓ పెన్‌చేసి చూసింది! ఆమె ఊహ కరెక్టయింది! బట్టల అడుగునవున్న కొన్ని ఉత్తరాలు కనిపించాయి! మల్లెలూరు అనే వూరు నుండి అతని మేనల్లుడు రాసిన ఉత్తరాలు అవి! ఆ ఉత్తరాల్నిబట్టి రమేష్ వంటవాడైన వినాయకానికి అక్కడ కాస్త పొలమూ ఇల్లూ వుందని అర్థంచేసుకున్నది కార్తీ! అంతేకాదు ఆ ఉత్తరాల్నిబట్టి మల్లెలూరు ఇక్కడికి నలభై కిలోమీటర్ల దూరంలో వున్న చిన్న పల్లె అని ఇక్కడ బస్సెక్కితే ఆ వూరి పొలిమేరల్లో దిగవచ్చని కూడా తెలిసిందామెకి

ఉత్సాహంగా ఈల వేసింది కార్తీ! సందేహంలేదు! వంటవాడు వినాయకం ఆ వూరికే పారిపోయి వుంటాడు అంటే ఇప్పుడు వాడు ప్రయాణంలో వుంటాడన్నమాట? మరో గంట ఆగి తను ఆ వూరు బయలుదేరకతప్పదు! బయలు దేరుతుంది తనకెం భయం లేదు! ఇంట్లో ఏం చెప్పాలి? ఎక్కడికి వెళుతున్నట్టు నమ్మించాలి!

బాగా ఆలోచించి క్రిందికి వచ్చింది కార్తీ

అప్పుడే భర్త నుండి ఫోన్‌కాల్ అందుకున్న సుమిత్ర కూతురితో చెప్పింది బేబీ డాడీ ఈ రాత్రి ఎనిమిది గంటలకిగానీ ఇంటికి రారట! హోటల్ నుండి ఫోన్‌చేశారు బిజినెస్‌మెన్ అంతా వచ్చారట! అక్కడేదో మీటింగ్ వుందిట! ఈ రోజు లంచ్, డిన్నర్ వగైరా అన్నీ అక్కడే

తల్లిమాట పూర్తికాకముందే హుషారుగా ఈల వేసింది కార్తీ

సుమిత్ర ఉరిమిచూసింది 'ఆ వేషాలే వద్దనేది అని గద్దించింది

మమ్మీ! జిన్నీ బర్త్‌డే మమ్మీ ఈవాళ! నిన్న ట్రిప్ ఇన్‌స్టిట్యూట్ దగ్గరికి వెదుక్కుంటూ వచ్చి మరీ ఇన్వయిట్ చేసింది. అంకుల్ ఇంటినుండి అటు వెళతాను ప్లీజ్ మమ్మీ! అంటూ గారంగా అడిగింది!

ఏమో తల్లీ నాకు తెలీదు! నీకు ఒకటే తిరుగుడెక్కువైంది అయినా నిన్న నీ పుట్టిన రోజు

**జరిగిన కథ —4 : కార్తీకి వెళ్ళేసరికి కొన ప్రాణంతో ఉన్న రాణి తర్వాత చెయ్యవలసిన పని చెప్పి చనిపోతుంది. వెంటబడిన దుండగుల్ని తప్పించుకుంటూ రమేష్ ఇల్లు చేరి అక్కడి నుండి కూడ బైట పడుతుంది. ఇంటికి క్షేమంగా చేరి విజయవాడ వెళ్ళే ఆలోచన ప్రారంభిస్తుంది. కార్తీని పట్టుకోలేక పోయినందుకు, అనుచరులను తిడుతుంది సోఫియా. రమేష్ ఇంట్లోంచి ఎలాగైనా ట్రంకు పెట్టెలోని రెడ్ సూట్‌కేసు తెప్పించాలని రజియాను మాటల గారడి చేసి ఆ పని ఆమెకి అప్పగిస్తుంది కార్తీ. కాని రమేష్ వంటవాడు హత్యా నేరం తన మీదకు వస్తుందన్న భయంతో అప్పటికే ఆ ట్రంకు పెట్టెలు తీసుకుని పారిపోయినందువల్ల రజియా సూట్‌కేస్ తేలేకపోతుంది. పారిపోయిన వంట వాడిని ఎక్కడని పట్టాలని ఆలోచనలో పడిపోతుంది కార్తీ.**

జరుపుకోనప్పుడు వాళ్ళ బర్త్‌డే పార్టీలకి వెళ్ళడం మాత్రం ఏం బాగుంటుంది?" నిలదీసింది సుమిత్ర.

"పోదూ మమ్మీ! నీకు తెలీదు.... పాపం జీనీ వాళ్ళ డాడీకి ట్రాన్స్ఫర్ వచ్చేట్టుందట! హఠాత్తుగా వెళ్ళిపోవచ్చుట! కాబట్టి చివరిసారిగా ఫ్రెండ్స్‌కి ఈ రూపంగా పార్టీ యిస్తోంది."

"సరే! నీ ఇష్టం!" అంటూ తల్లి నిట్టూర్చింది.

"మా అమ్మ బంగారు అమ్మ" తల్లి బుగ్గమీద ముద్దుపెట్టుకుంది!

కార్తీకి బాగా సంతోషం కలిగినప్పుడు అలా అంటుంది తల్లిని!

"చెప్పానుగా ఈ వేషాలు బాగా తెలుసని" ఈసారి నవ్వింది సుమిత్ర!

తరువాత ఎవరో పక్కింటావిడ రావటంతో తల్లి ఆవిడతో మాట్లాడుతూన్న సమయం చూసి చైతన్యకి ఫోన్‌చేసి.... "అనుకోకుండా ఫ్రెండ్ యిస్తున్న పార్టీకి ఎటెండ్ కావాల్సివచ్చిందికాబట్టి అతని ఇంటికి లంచ్‌కి రాలేనని" చెప్పింది కార్తీ! అతనికి 'సారీ' కూడా చెప్పింది.

"థాంక్యూ బేబీ! ఇప్పుడు నువ్వు ఇక్కడికి రాకపోవడమే మంచిది" అవతలినుండి మెల్లగా అన్న చైతన్య లైన్ కట్‌చేశాడు.

కార్తీ ఆశ్చర్యపోయింది.

"ఎందుకలా అన్నారు అంకుల్?" అని ఒక్కక్షణం మాత్రం ఆలోచించిందామె! తరువాత "బహుశా అంకుల్‌కి అనుకోకుండా ఏదైనా పనిపడిందేమోలే" అని సరిపెట్టుకుంది!

చైతన్య ఏం పనిచేస్తాడో కార్తీకి తెలీదు! ఒకటి రెండుసార్లు అడిగినా అతడు చెప్పలేదు. ఆ తరువాత కార్తీ అడగనూలేదు. కానీ, అతను బాధ్యతగలిగిన పెద్దపని ఏదో చేస్తున్నాడని అనుకుంటుందామె! సమయం సరిగ్గా తొమ్మిది గంటలయింది. కార్తీ చకచక డ్రెస్ చేసుకోసాగింది.

సన్నని జరిపూలు కుట్టిన ఎల్లోకలర్ అమెరికన్ జార్జెట్ పరికిణీ ఆదేజరీ పూలున్న జాకెట్ వేసుకుంది. నల్లని ఓణీ వేసుకుని ఒక్కజడ పొడవుగా అల్లుకుని తన హేండ్‌బ్యాగూ వంటవాడి పాత సూట్‌కేసూ తీసుకుని క్రిందకి వచ్చింది. తల్లి ఇంకా



పక్కింటావిడతో మాట్లాడుతూనేవుంది!

"మమ్మీ.... నేను వెళుతున్నాను." అంది కార్తీ.

మాటల్లోవున్న సుమిత్ర తలతిప్పి చూసింది! గుమ్మంలో అందంగా బొమ్మలా నిలబడివున్న కూతుర్ని చూసి సుమిత్ర కళ్ళు మెరిసాయి!

# సూపర్‌గర్ల్

"వెళ్ళి రానా మమ్మీ?" మళ్ళీ అడిగింది!

"వెళ్ళిరా! జాగ్రత్త" అంది సుమిత్ర తదేకంగా కూతుర్ని చూస్తూ!

పక్కింటావిడ కళ్ళప్పగించి కార్తీనే చూస్తోంది

సాధారణంగా రకరకాల మోడ్రన్ డ్రస్‌ల్లో కనిపించే కార్తీ ఎప్పుడోగాని అరుదుగా యిలా పరికిణీ ఓణీ ధరించదు' ఈ రోజు ఆమె అందం ద్విగుణీకృతమైనట్టుగావుంది వెళ్ళబోతున్న కూతుర్ని వెనక్కిపిలిచింది సుమిత్ర తన మెడలోని సన్నని చైన్‌తీసి కూతురి మెడలో వేసి

'ఐతే స్టేషన్‌కి వెళుతున్నావా కార్తీ?' అంది అప్పుడే కార్తీ చేతిలోని సూట్‌కేస్‌ని గమనించినట్టు'

అవును' అంది కార్తీ అయిష్టంగావున్న తల్లి మొహంలోకి చూస్తూ

మరేం పరవాలేదుమమ్మీ' పోలీసులూ మనుషులే' అందులో అక్కడవున్నది మన చంద్రం అంకుల్ కదా' అంది కార్తీ

'పోనీ చంద్రానికి నేను ఫోన్ చెయ్యనా?' అంటున్న తల్లివైపు కోపంగా చూసి 'నో మమ్మీ నేను మరి చంటిపిల్లననుకుంటావు అయితే నేపోనేపోను అంది కార్తీ బుంగమూతితో

సరే వెళ్ళిరా' అంది సుమిత్ర అయిష్టంగానే

మళ్ళీ సాయంత్రానికిగానీ రాను ఖంగారుపడి అందరికీ ఫోన్‌లుచేసి గొడవపెట్టకు' డాడీ ఖంగారు పడిపోతారు కొంపలంటుకుంటాయ్' అంది కార్తీ నవ్వుతూ

సుమిత్ర చిరుకోపంగా చూస్తే నవ్వుకుంటూనే బయటికివచ్చింది కార్తీ

లోపల్నుండి పక్కింటావిడ తల్లితో అనడం వినిపించిది 'ఎంతయినా మీరు అదృష్టవంతులు సుమిత్రా' ఒక్క కూతురైనా అందం, తెలివీ, ధైర్యం తనసొత్తు' నాకూ వున్నారు నలుగురు వంశోద్ధారకులు' ఎందుకూ? ఆడపిల్లలకంటే అధ్వాన్నం

సుమిత్ర కంఠం గర్వంగా కాస్త దిగులుగా వినిపించింది ఒట్టి గడుగ్గాయిపిల్ల' ఎప్పుడేం నెత్తిమీదకు తెచ్చుకుంటుందో అని భయం నాకు

తల్లి చయానిక మరోసారి నవ్వుకుని మాలిని పంపించి ఆటో తెప్పించుకుంది కార్తీ తరువాత ఆమె పోలీసుస్టేషన్‌కి బయలుదేరింది ఆమె సూట్‌కేస్‌ని పోలీసుస్టేషన్‌లో అప్పగించడానికి బయలుదేరలేదు యిప్పుడు'

అదేసమయంలో కార్తీ ఇంటికి ఎదురుగావున్న సంగమేశ్వర్రావు ఇంట్లో

* * *

వచ్చిన వ్యక్తులందరూ వెళ్ళిపోగా హెల్మెట్ ధరించివున్న రెడ్‌సూట్‌వాలా మాత్రం మిగిలాడు అతని కళ్ళుకూడా ఎర్రగా వున్నాయి మొహం అందంగావున్నా క్రూరంగావుంది అతనిచేతిలో విస్కీ గ్లాస్‌వుంది అతని ముందు టీపాయ్‌మీద జీడపప్పు కాజొలు ప్లేట్‌నిండా వుంది'

సంగమేశ్వర్రావు దీర్ఘాలో చనాపరుడైనట్టుగా కూర్చునివున్నాడు సోఫాలో వెనక్కివాలి' అతను తన ఇంటిక ముఖ్యమైన పనిమీదవచ్చే ఫ్రెండ్స్‌కి బిజినెస్ పార్ట్‌నర్స్ గెస్ట్‌కి ఏనాడూ వెట్‌పార్టీ ఇవ్వకుండా పంపడు' కానీ, తను మాత్రం తాగడు' తాగడు అంటే అతనికి అలవాటు లేదని అసలు తాగడనీ మాత్రం కాదు' ఆల్కహాల్ నలుగురిలో వున్నప్పుడు తీసుకోగూడదని దానివల్ల చాలా నష్టాలు, సమస్యలు సంభవిస్తాయని అతని ఉద్దేశ్యం మత్తులో మనకి తెలీకుండానె గమ్మత్తుగా ఎన్నో మాటలు రహస్యాలూ బయటకి రావచ్చని అతని నమ్మకం అందుకే అందరిలో ఎప్పుడూ తాగడు అతనికి అతిసన్నిహితులైన కొందరికి తప్ప ఎవరికీ అతనికి తాగే అలవాటుందని తెలీదు

ఆ సన్నిహితులైన కొందరిలో ఈ రెడ్‌సూట్ వ్యక్తి ఒకడు

హఠాత్తుగా అన్నాడు రెడ్‌సూట్ మిస్టర్ రావ్' మీ ఎదురింట్లో వుండే ఆ అమ్మాయిని గురించి మీ కేం తెలుసు?

ఆ మాట విని ఉలిక్కిపడి చూశాడు సంగమేశ్వర్రావు'

ఆ అమ్మాయిని గురించి మీతో మాట్లాడాలనే నేనిప్పుడు వాళ్ళతోపాటు వెళ్ళకుండా ఇక్కడ వెనక్కివుండిపోయాను అన్నాడతను మళ్ళీ మాటలను ఆచితూచి వాడుతూ

విషయం మామూలు కాదని అర్థమైపోయింది సంగమేశ్వర్రావుకి' ఆగంతకుడు ఏదో అనబోయ్యాడు'

సంగమేశ్వర్రావు అతన్ని వారించాడు 'ఇక్కడవద్దు పద పైకివెళ్ళి మాట్లాడుకుందాం అన్నాడు క్లుప్తంగా

అప్పుడే అక్కడికిరాబోయిన ఓ శాల్తీ టక్కున ఆగిపోయింది. ఆ శాల్తీ తాలూకూ రెండు చెవులూ ఆ మాటల్ని విననేవిన్నాయి చటుక్కున పక్కకి తప్పుకుని వేగంగా మెట్లమీదినుండి మేడమీదకి దారితీశాయి ఆ శాల్తీ తాలూకు కాళ్ళు

అయిదునిముషాల తరువాత సంగమేశ్వర్రావూ ఆ వ్యక్తి మేడమీది గదిలోకి వెళ్ళారు అది సంగమేశ్వర్రావు బెడ్‌రూమ్ నౌకర్ కుర్రాడు తను తెచ్చిన ట్రేని అక్కడ టీపాయ్‌మీద వుంచివెళ్ళాడు సంగమేశ్వర్రావు రూమ్ తలుపులు బిగించి ఫ్రిజ్‌లోనుండి విస్కీ బాటిల్స్ మిగతా సరంజామా అంతా తెచ్చి అక్కడచేర్చాడు

తరువాత గ్లాసులు నింపి 'చీర్స్' చెప్పి తాగటం మొదలెట్టాక ఆ ఆగంతకునివైపు చూసి నవ్వాడు సంగమేశ్వర్రావు ఆ నవ్వు ఓ క్రూరమృగం నవ్వులా వుంది

'అయితే ఆ పిల్ల మన లిస్టులోకి వచ్చిందన్నమాట? కసిగా అన్నాడు సంగమేశ్వర్రావు

'స్వయంగా బాస్‌గారే చెప్పేరు విస్కీ సిప్‌చేసి చెప్పాడు అతను

'ఐ సీ అక్కసుగా అన్నాడు

ఏమిటా పిల్ల వివరాలు?

'చెబ్తాను' సంగమేశ్వర్రావ్ సిగార్ వెలిగించాడు మరో రెండునిముషాల తరువాత ప్రారంభించాడతడు

'దాదాపు మూడు కోట్ల రూపాయల ఆస్తికి ఏకైక వారసురాలు' కార్తీకపౌర్ణమినాడు చంద్రోదయవేళ





పుట్టిందిగాబట్టి కార్తీక పున్నమి" అని పేరుపెట్టారు ఆర్ట్స్ గ్రూప్‌తో ఇంటర్మీడియట్ పరీక్షలు వ్రాసింది రాంక్ స్టూడెంట్ అద్భుతమైన తెలివితేటలు ఆ పిల్ల సొత్తు. ఇక ఆ పిల్ల స్వభావం గురించి ఒక సంఘటన చెబుతాను విను అగాడు సంగమేశ్వర్రావు

గ్లాసులోని విస్కీని మొత్తంగా గొంతులో పోసుకుని మళ్ళీ గ్లాస్ నింపాడు అతని మొహం క్రూరంగావుంది

నెల క్రితం ఇదే రూమ్‌లో కూర్చునివున్నాను నేను రాజేష్ తెలుసుగా నా ఏకైకపుత్రుడు! ఇక్కడే కూర్చుని ఏదో నావెల్ తిరగేస్తున్నాడు హఠాత్తుగా ప్రత్యక్షమైంది ఆ పిల్ల యిక్కడ ఈ గుమ్మంలో సివంగిలా ముందుకి ఉరికి నా కళ్ళ ఎదుటే కుర్చీలో కూర్చున్న రాజేష్‌ని కాలర్ పుచ్చుకుని క్రిందకి ఈడ్చేసింది ఎడాపెడా కరాటే దెబ్బలతో ఉతికేయసాగింది వాడ్ని ఆ పిల్ల దాటి ఆ భద్రకాళి అవతారాన్ని చూసి దెబ్బలుతింటున్న రాజేష్ సంగతేమోగాని నేను షాక్ తిన్నాను ఆ పిల్ల చేతుల్లోనుండి వాడ్ని విడిపించడానికి సైతం నాకు ఆ సమయంలో ధైర్యం చాల్లేదు అలా వాడ్ని ఓ పదినిముషాల్లో ముద్దలాచేసి సోఫాలోకి నెట్టి, నా వైపు తిరిగి

మీ కొడుకుని అదుపులో పెట్టుకోమని మీకు ఇప్పటికే నాలుగుసార్లు పిర్యాదు చేశాను అంకుల్! మీరు పట్టించుకోలేదు

అచ్చోసిన ఆంబోతులా వూరి మీదకు వదిలారు! ఆడపిల్లల్ని టీజ్‌చెయ్యడం అనేది తన జన్మహక్కుగా ఈ వెదవ బావించేలా తయారుచేశారు మీరు వీడ్ని కానీ మగవాడచేత వేదింపబడటం, ఆడదాని తలరాత అని భావించి సరిపెట్టుకునే వెర్రివెంకమ్మ లాంటి ఆడపిల్లనికాను నేను! అయామె కార్తీ! ఇలాంటి వెదవలకి సరైన గుణపాఠం చెప్పటమే నా ధ్యేయం ఇందుకోసం పోలీసులకి రిపోర్టు యివ్వడం తల్లిదండ్రులకి కంప్లెయింట్ చెయ్యడం వేస్ట్ అన్న అభిప్రాయానికి వచ్చాను నేను మి లాంటి తండ్రులని చూశాక టిట్ పర్ టాట్ అన్నది యికనుండి నా సిద్ధాంతం అందుకనే ఈసారి మీకు కూడా చెప్పదలచుకోలేదు మీ ఎదురుగానే ఈ వెదవకి బుద్ధిచెబితే మీ లాంటి తండ్రులకి కూడా బుద్ధివస్తుందన్న సత్యం నాకు బాగా అర్థమైంది చూశారుగా ఈతరం ఆడపిల్లలకి ప్రతినిదినైన నా శక్తిని ఇకనైనా ఆడపిల్లయొక్క రెండు దెబ్బలకి ఓర్చుకోలేని ఈ చచ్చువెదవని అదుపులో పెట్టుకోండి బీ కేర్‌ఫుల్ ముక్కుపుటాలు అదురుతూండగా అనేసి విజయగర్వంగా నడుస్తూ వెళ్ళిపోయింది



## 'కార్తి' సాహసం

**మీరు కూడా యువతిగా వున్నప్పుడు - లేదా యిప్పుడు యువతిగా వుండి ఏదైనా సాహసం చేశారా? అది ఫలించిందా? అటువంటిదివుంటే మీ ప్యాస్‌పోర్టు సైజు ఫొటోతో 15, 20 లైన్లలో రాసి పంపండి! –ప్రచురణ యోగ్యమైతే వేస్తాం. –సంపాదకుడు**

## సీమటపాకాయా? ఆటంబాంబా?

చెప్పటం ఆపి గ్లాసులోని ద్రవాన్ని ఖాళీచెయ్యటం ప్రారంబించాడు అతడి కళ్ళు ఎర్రజీరలతో బయంకరంగా వున్నాయి

రెడ్‌సూట్ వ్యక్తి అదోలా నవ్వాడు అయితే ఆ పిల్ల సీమటపాకాయ అన్నమాట?

కాదు ఆటంబాంబు ...రావు ఒప్పుకున్నాడు

మళ్ళీ తనే చెప్పాడు ఆ సంఘటన తం... ఆ పిల్ల తండ్రికి ఫోన్‌చే... విషయం ... ...వాను సిగ్గువిడిచి ఆ పిల్ల... ...ట్టకొమని హెచ్చరించాను అతడు అప్పాలజీ చెప్పుకుంటాడనుకున్నాను ... అతడా పని చెయ్యలేదు పైగా తన ... ...మర్థించాడు నా కొడుకుని నిందించాడు త... ...తురు చాలా గొప్పపనిచేసిందని సగర్వంగా అన్నాడు నా గుండెలు మండిపోయాయి ఆ తండ్రీ కూతుళ్ళ మీద పగతో నా హృదయం ప్రజ్వరిల్లుతోంది ఆ ఇద్దరి మీద కక్ష తీర్చుకుని బుద్ధి చెప్పే అవకాశం కొసం లక్ష కళ్ళతో ఎదురుతెన్నులు చూస్తున్నాను ఇప్పుడు యిలా అదృష్టంలా అవకాశం కలసి వచ్చింది ఒక షాట్‌తో కూతురి పొగరూ తండ్రి గర్వం రెండూ అణగిపోతాయి కసిగా అన్నాడు సంగమేశ్వర్రావు

చెప్పు ఏం ఆర్డర్ యిచ్చాడు బాస్? ఎలా వచ్చిందా పిల్ల ఆయన దృష్టిలోకి? ఏం చెయ్యాలని దాన్ని? అడగాడు

జేబులోనుండి త్రిబుల్ ఫైవ్ సిగరెట్ పాకెట్ తీసి ఓ సిగరెట్ వెలిగించుకుని చెప్పాడా రెడ్ సూట్ వ్యక్తి

ఓ అరబ్ షేక్ పదిరోజులక్రితం ఇండియావచ్చాడు అతడు యువకుడు ప్రస్తుతం అతడు ఢిల్లీలో ఓ పెద్ద హొటల్‌లో బసచేసివున్నాడు అతగాడికి చురుకైన చాకులాంటి టీనేజ్ గర్ల్ కావాలట! కేవలం మజాచేసుకోవడానికే కాదు అవసరం అయితే నిఖా చేసుకోవడానికి సైతం అర్హతలు కలిగిన పిల్ల కావాలిట! ముఖ్యంగా ఉర్దూ చక్కగా మాట్లాడగలిగి వుండాలిట! ఇంగ్లీషు సరేసరి మనవాళ్ళు యిప్పటికి డజను మంది అమ్మాయిల్ని తీసుకెళ్ళి చూపించారు అతడికి ఒక్కపిల్లా నచ్చలేదు పెదవి విరుస్తున్నాడు మన బ్రాంచిలన్నింటికీ ఈ విషయమై ఆర్డర్స్ పంపాం! షేక్‌గారు లక్షలు కుమ్మరించడానికి రెడీగావున్నారు మన ఏజంట్లు అలాంటి పిల్ల కోసం జల్లెడవేసి గాలిస్తున్నారు రెండు రోజుల క్రితం ఈ పిల్లని బాస్ తన కళ్ళారా చూశారు ఓ షాపింగ్ సెంటర్లో తొలిచూపులోనే నచ్చింది వెంటనే ఈ పిల్లని గురించిన వివరాలు సేకరించే బాధ్యతని నాకు అప్పగించారు షేక్‌గారికి కావలసిన క్వాలిఫికేషన్స్ అన్నీ ఈ పిల్లకున్నట్టు తెలిసింది నా ఎంక్వయిరీలో మీ రేం చెబుతారో నని అంటూ ఆగాడు

# స్వామియే శరణమయ్యప్పా! అయ్యప్ప మహిమలు!

## స్వామిదయ

నిరుడు మా తమ్ముడు "అయ్యప్పస్వామి" దీక్షపూనాడు. కాయగూరల భోజనం, చన్నీళ్ళ స్నానం పడనివాడు దీక్ష పూనాడంటే, మాకు ఒక్కసారి గుండె గుభేల్మంది. నలభై రోజులు స్వామిని సరిగ్గా పూజిస్తాడో, లేడో అని అనుమానం వేసింది.



రోజూ ప్రొద్దున్నే చన్నీళ్ల స్నానం చేసి, అన్ని దేవాలయాలకి వెళ్లడం, భజన కార్యక్రమాలు నిర్వహించడం చేసే వాడు. రోజులు గడుస్తున్న కొలదీ, శరీరం బాగా చిక్కిపోయింది. కళ్లు తీక్షణంగా తయారయ్యాయి. మిగతా స్వాములు బాగానే ఉండేవారు. ఇతనికి మటుకు చిరాకు, కోపం ఎక్కువయ్యాయి. పూజలో ఏ చిన్న అసౌకర్యం ఏర్పడ్డా, విరుచుకుపడేవారు. మా అమ్మగారు కంగారుపడేవారు. ఏమన్నా తిరిగి అందామంటే. దీక్షలో వున్నాడాయె. స్వామి కరుణ కటాక్షం కలిగే ముందు అలాగే చిన్న చిన్న చికాకులు స్వామి కలిగిస్తాడని, మా వాళ్ళకు నచ్చ చెప్పాను.

"శబరిమలై" వెళ్ళే ముందు అయితే, ముఖం అంతా ఒకే రకమైన తేజస్సుతో నిండిపోయింది. కళ్ళు వెలుగుతున్నట్టుయిుండేవి. మొఖం వైపు చూడాలంటే మాకు భయమేసేది.

"మకరజ్యోతి సందర్శనం", అయ్యప్పస్వామి దర్శనం చేసుకుని 'శబరిమలై' నుంచి వచ్చిన తర్వాత వాడు ఎన్నో ఏళ్ళ నుంచి పడుతున్న చికాకుల నుంచి, ఆర్థిక ఇబ్బందుల నుంచీ తప్పించుకోగలిగాడు. అంతా స్వామి మహిమ.

"స్వామియే శరణమయ్యప్పా".

సుంకరి రమణి, వైజాగ్

## మహిమ చూపిన స్వామి!

నేను కరపగ్రామంలో ఉండేటప్పుడు మా వూళ్ళో బాడ్మింటన్ ఆడుతున్నాం. ఆ రోజు ఆట జోరుగా సాగుతోంది.

ఎక్కణ్ణుంచి వూడిపడిందోగాని మా వూరి కరణంగారి ఆబోతు భయంకరంగా రంకె వేస్తూ ఎవరో తరుముకొస్తున్నట్టు శరవేగంతో మా వైపు దూసుకొచ్చింది. అదిరిపడ్డ మేమంతా ప్రాణభయంతో కాళ్ళకు బుద్ధి చెప్పాం.

మా బాడ్మింటన్ కోర్టు దగ్గరకు వాళ్ళ తమ్ముణ్ణి పిలుచుకు పోయేందుకని వచ్చిన అయ్యప్పదీక్షలో ఉన్న రామనారాయణ మాత్రం కళ్ళు మూసుకొని కదలకుండా ఉన్న చోటనే వుండిపోయాడు -

"స్వామి శరణం! అయ్యప్ప శరణం!" అనుకుంటూ (చిన్నతనంలో పోలియో వచ్చి ఎడమ కాలుసక్రమంగా పనిచేయటం మానేసిందాయనకు)

అంతే! అతని దగ్గరకొచ్చేసిన ఆ ఆబోతు బ్రేకు వేసినట్టు ఆగిపోయి అతని కుడి కాలును నాకసాగింది. కళ్ళు తెరచిన అతను భక్తి



పారవశ్యంతో అయ్యప్ప స్వామిని మరింతగా కీర్తిస్తూ, దాని ఒళ్లంతా నిమిరాడు.

ప్రాణాలర చేత పట్టుకుని ముళ్ల కంచెల్ని సైతం లెక్క చెయకుండా అప్పటికే ఆమడ దూరం పారిపోయిన మా బ్యాచ్ అందరికి దాదాపు కాళ్లకు ముళ్ళు దిగి కొందరికి రక్తం సైతం బయటి కొచ్చింది. తరవాత అంతా అయ్యప్ప దీక్షవహించాం.

-పాట్నేడి చక్రరావు;విశాఖపట్నం

ఈ శీర్షికని ఇంతటితో నిలిపివేస్తున్నాం. -సం

# సూపర్ గర్ల్

## సూపర్‌క్లాస్ కిడ్నాపింగ్

"నీకు అందిన ఇన్ఫర్మేషన్ సెంట్‌పర్సెంట్ కరెక్ట్" ఉత్సాహంగా అన్నాడు సంగమేశ్వర్రావు.

"సో... షేక్‌గారు నాలుగు రోజుల్లో హైదరాబాదు రాబోతున్నారు ఈ పిల్లని ఆయనకు అప్పగించాలి. నచ్చుతుందనే నా నమ్మకం. ఏదైనా సూపర్‌ప్లాన్‌తో ఎవరికీ అనుమానం రానివిధంగా కిడ్నాప్ చెయ్యాలి. దానికి మీసహకారం ఎంతైనా అవసరం."

"ష్యూర్.... ష్యూర్. నువ్వు అడగాల్నా? ఇందులో నాకుమాత్రం బాధ్యతలేదా ఏమిటి? చెప్పానుగా నాకూ ఆ పిల్లపట్ల ద్వేషం వుందని. సంతోషంగా యిందులో భాగం పంచుకుంటాను! అయితే యిక్కడ ఒక్కవిషయం గమనించాలి మనం. ఆమె తండ్రి ఆనంద్ వెరీ ఇన్‌ఫ్లుయన్షల్! సెంట్రల్ హోంమినిష్టర్‌గారి అబ్బాయి యితనికి క్లోజ్ ఫ్రెండ్! రాష్ట్ర హోంమినిష్టర్ ఇతని క్లాస్‌మేట్. తీగలాగితే డొంక మొత్తం తిరగబడిందన్నట్టు మన రహస్యాల్ని బజారుకి ఎక్కించగలడు. చాలా జాగ్రత్తగా షేక్‌గారు ఈ పిల్లతో ఫ్లయిట్ ఎక్కేంత వరకూ ఈ విషయం బయటికి పొక్కనంత.... ఎవరికీ ఏ అనుమానమూ కలగనంత పకడ్బందీగా వ్యవహారాన్ని నడిపించగలగాలి మనం..." అంటూ హెచ్చరించాడు సంగమేశ్వర్రావు.

ఆలోచనగా చూశాడు రెడ్‌సూటు వ్యక్తి.

హఠాత్తుగా అన్నాడు సంగమేశ్వర్రావు "నేను ప్లాన్ చెప్పనా?"

ఆసక్తిగా ముందుకి ఒంగాడు రెడ్‌సూట్ వ్యక్తి. కంఠం తగ్గించి తన ప్లాన్ వివరించసాగాడు సంగమేశ్వర్రావు. శ్రద్ధగా వినసాగాడు అతడు. అలా పదినిముషాలపాటు చెప్పి....

"ఎలావుంది నా ఐడియా?" అడిగాడు సంగమేశ్వర్రావు.

"ఒండర్‌ఫుల్ ఆయిడియా" హుషారుగా అన్నాడా వ్యక్తి.

"బాగా గుర్తుంచుకో. నీకూ నాకూ మధ్యనే వుండాలి ఈ రహస్యం. ఈ రోజు రాత్రే" గుంభనంగా నవ్వాడు సంగమేశ్వర్రావు.

ఆ వ్యక్తి సంతృప్తిగా తలాడించాడు! తరువాత రెడ్‌సూట్ వ్యక్తి యిక మాట్లాడలేదు. గ్లాసులు ఖాళీచెయ్యడంలో బిజీ అయిపోయాడు. సంగమేశ్వర్రావు కర్కశమైన మొహంలో తీరబోతున్న కసి కనిపిస్తోంది.

(ఇంకావుంది)

## క్రికెట్ ప్లేయర్
# నవజ్యోత్ సింగ్ సిద్ధూ హంతకుడా?

నవజ్యోత్ సింగ్ సిద్ధూ యిండియా వన్‌డే మ్యాచ్‌లలో గొప్ప దూకుడుగా ఆడే బ్యాట్స్‌మన్. సిద్ధూ అనుకోకుండా ఒక హత్య కేసులో యిరుక్కున్నాడు. పాటియాలా ట్రాఫిక్ జామ్‌లో అతని కారు మరో కారుని ఢీ కొన్నప్పుడు లేదా మరొకరి కారు తన కారు ఢీ కొన్నప్పుడో మొత్తం మీద నవజ్యోత్ క్రికెట్‌లో బంతిని పుతికేసినట్లు - అవతలి మోటారు కారు ఆసామిని చావ బాదేశాడు.- వెంటనే తన స్నేహితునితో కలిసి కారులో పారిపోయాడు. అవతలి కారులో వున్న వ్యక్తి పేరు గుర్నామ్ సింగ్. గుర్నామ్ సింగ్ భౌతిక కాయాన్ని తీసుకుని- అదే కారులో వున్న అతని బంధువులు యిరువురు కూడా పోలీసు స్టేషన్‌కి పరిగెత్తారు.

ఆటు తరువాత నవజ్యోత్‌సింగ్ సిద్ధూ అవసరమైన లాయర్‌ల మద్దతుతో అరెస్టయినాడు- అయితే గుర్నామ్ సింగ్ మరణం - "హత్య" అని అకాలీదళ్ యిప్పుడు రంగంలోకి దిగింది. నవజ్యోత్ తండ్రి మాజీ అటార్నీ జెనరల్ అవడమే కాకుండా కాంగ్రెస్(ఐ) మద్దతుదారు కూడా. మంచి పలుకుబడి వుంది. ఈ ఏడాది మొదటి వారంలో సిద్ధూను పోలీసులు మేజస్ట్రేటు ఎదుట హాజరు పరిచారు. జెయిలు మంజూరైంది.

అయితే యిప్పుడు సిద్ధూ క్రికెట్ జీవితం అయోమయంలో పడిపోయింది. జామీను ఇచ్చిన కోర్టు ఆదేశం ప్రకారం అతను యిండియా విడిచి పోకూడదు. ఎప్పుడు కావాలి అంటే అప్పుడు పోలీసు స్టేషన్‌కు వచ్చి- ప్రశ్నలకి జవాబులు చెప్పాలి. ఈ పరిస్థితిలో అతన్ని క్రికెట్ కంట్రోలు బోర్డు ఎంపిక చేయగలదా? చేసినా వెస్టిండీస్ వెళ్ళగలడా? -వెళ్ళి ఆడగలడా? అన్నప్రశ్నలకి మీరిది చదివే వేళకి జవాబులు మీ ముందు వుంటాయి కాని నవజ్యోత్‌సింగ్ సిద్ధూ తండ్రి తన పలుకుబడిని వినియోగించి కోర్టు వెలుపల ఒక పది లక్షల దాకా పైకం ఖర్చు పెట్టి కేసుసెటిల్ చేసేద్దాం అనుకుంటున్నాడన్న వదంతి వ్యాపించింది. అయితే హతుడు లేదా మృతుడు గుర్నామ్ సింగ్ కుటుంబానికి డబ్బుతో పని లేదు. వాళ్ళంతా భూస్వాములు,బాగా సంపన్నులు-

సిద్ధూ చాలా దూకుడు మనిషి అవతలివాడి కారు తనకారుకు తగిలిందన్న ఆవేశంలో వాణ్ణి చావ చంపి వుంటాడన్న వాదం కూడా బాగా ప్రచారం అవుతోంది.

అనుకున్నట్లే నవజ్యోత్ సిద్ధూని ప్రాథమిక ఎంపికలో వెస్ట్ యిండీస్ టూరు చేసే జట్టులోకి క్రికెట్ కంట్రోలు బోర్డు ఎంపిక చేసింది. అతనికి ముందస్తు జామీను కూడా లభించింది.

అసలు "క్రికెటర్"లు, "బాక్సర్"లు యితర ఆటలలో విపరీతమైన గ్లామర్‌తో పాప్యులారిటీ సంపాదించిన క్రీడాకారులు; పబ్లిక్ ప్రదేశాలలో చాలా విచ్చలవిడిగా ప్రవర్తిస్తారన్న అపవాదు వున్నది.అది యీ సిద్ధూ కేసుతో మరింత బలపడ్డది ●



# గ్రామదేవత

గిరిపురం గ్రామం అలజడిగా ఉంది గ్రామస్తులందరూ ఊరి మధ్యనున్న రావి చెట్టు దగ్గరి రచ్చబండ దగ్గర గుమిగూడి ఉన్నారు అందరి కళ్ళల్లోనూ మృత్యు ముఖానికి చేరువవుతున్న భయం కదలాడుతున్నది

గ్రామ పెద్ద జోగయ్య రచ్చబండమీద కూర్చొని ఉన్నాడు అతని కళ్ళు చింత నిప్పుల్లా ఉన్నాయి ఆ కళ్ళల్లో ఆకలిగొని ఉన్న పులి కళ్ళల్లో కన్పించే క్రౌర్యం దాగిఉంది అతనికున్న బుఱ్ఱ మీసాలు అక్కడక్కడా నెరసి ఉన్నాయి అతని వయసు యాభైపైబడినా మనిషి దృఢంగా ఉన్నాడు

అతని కెదురుగా గ్రామంలోని ఆడ, మగా, ముసలీ ముతకా అంతా చేతులు కట్టుకొని వినయంగా, అంతకు మించి భయంగా నిలబడి ఉన్నారు

పెళ్ళి కాని ఆడపిల్లల తల్లితండ్రుల కాళ్ళు సన్నగా వణుకుతున్నాయి అరచేతులకు చెమట పడుతున్నది గుండెలు భయంతో వేగంగా స్పందిస్తున్నాయి

అక్కడి వాతావరణం తుఫాన్ వచ్చే ముందటి ప్రశాంతతతో నిశ్శబ్దంగా ఉంది రావిచెట్టు మీద అంతవరకూ ఉన్న పిట్టలు జోగయ్య రాగానే మెత్తగా రెక్కలు విప్పి చప్పుడు చేయకుండా ఎగిరిపోయాయి

జోగయ్య ఒక్క సారి అందరి వంకా దృష్టి సారించాడు అతని చూపు భయం గొలిపే విధంగా ఉంది అతని కళ్ళలోకి చూసే ధైర్యం ఎవరికీ లేదు అందుకే అందరూ తలలు దించుకుని నిలబడ్డారు

'గ్రామదేవతగా ఉండడానికి ఎవరైనా సిద్ధపడ్డారా'' లేక నేనే ఎంపిక చేయాలా'' అని ప్రశ్నించాడు అతని స్వరం పిడుగు పాటులా ఉంది కొంచెం సేపటి వరకూ అక్కడ మౌనం రాజ్యమేలింది

'ఎవరూ ముందుకు రావ్లేదు మీరే ఎంపిక చేయండి దొరా' అని అందరి తరఫునా సమాధాన మిచ్చాడు పోలిగాడు వాడు నోరు తెరవగానే నాటుసారా కంపు గుప్పున కొట్టింది

జోగయ్య చూపులు ఒక్కో కన్నెపిల్లనూ తాకుతూ ముందుకు పోతున్నాయి గ్రామస్తులందరూ ఎవరికి వారు ఆ చూపు తమ కూతురి మీదెక్కడ నిలుస్తుందో నని భయం భయంగా చూస్తున్నారు

జోగయ్య చూపు అప్పుడే విరిసిన మందారంలా ఉన్న ఓ కన్నెపిల్ల మీద పడి అలానే నిలచిపోయింది 'నీ పేరు అంకమ్మ కదూ'' అన్నాడు జోగయ్య అతనికళ్ళు లేడి పిల్లలను చేజిక్కించుకున్న పులి కళ్ళల్లా మెరిసాయి 'అవును దొరా' అంది అంకమ్మ వణికే గొంతుతో జోగయ్య పెదవుల మీద విషపు నవ్వు చోటు చేసుకుంది



ఎన్. శివనాగేశ్వరరావు

'అమ్మా! అంకమ్మా! నీకెంత కష్టం వచ్చిందే! తల్లీ!' అంటూ కుప్పకూలి పోయారు అంకమ్మ తల్లిదండ్రులు యాదగిరి, లచ్చమ్మ

★ ★ ★ ★ ★

గిరిపురం అంతగా అభివృద్ధి చెందని కొంత ప్రదేశం ఆ ఊరు మిగిలిన ప్రాంతాలకు దూరంగా విసిరి పారేసినట్లు దూరంగా ఓ మూల ఉండడంతో మిగిలిన ఊర్లకూ, ఈ ఊరికీ మధ్య సంబంధాలు లేకుండా పోయాయి

అందుకే ఆ ప్రాంతం అంతగా అభివృద్ధి చెందలేదు ఆ గ్రామస్తులు అనాగరికంగా ఉంటారు అక్కడ నోరున్న వాడిదే రాజ్యం' తాత, ముత్తాతల నాటి ఆచారాలు ఇంకా కొనసాగుతున్నా, అవి దురాచారాలైనా అక్కడి యువత ఎదిరించేది కాదు మౌనంగా చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నట్లు మిన్నకుండి పోయేది

పెద్దవారు తమకేం అన్యాయం జరిగినా అంతా మన ఖర్మ అని సర్దుకు పోయేవారు అటువంటి పరిస్థితులలో జోగయ్య ఆ ఊరిని మకుటం లేని మహారాజులా యదేచ్ఛగా పరిపాలిస్తున్నాడు ఆ మాట కొస్తే తరతరాలుగా ఆ గ్రామాన్ని జోగయ్య వంశీయులే కట్టడి చేస్తున్నారు

చాలా తరాలకు ముందు మాట జోగయ్య వంశ వృక్షానికి మూలపురుషుడు రుద్రయ్య రుద్రయ్య ఎక్కడి నుంచో ఆ గ్రామానికి ఊడి పడ్డాడు ఆ గ్రామస్తులందరూ అతని కంటే తక్కువ కులస్తులు అందుకే అందరూ అతని మాటను మన్నించేవారు దాన్ని ఆసరాగా తీసుకొని, దానికి తన వాక్పటిమను జోడించి రుద్రయ్య గ్రామ పెద్దగా చలామణి అయ్యాడు

రుద్రయ్యకు స్త్రీ కాంక్ష ఎక్కువ భార్య అందించే సుఖంతో సంతృప్తి చెందేవాడు కాదు అందుకే బాగా ఆలోచించి, గ్రామస్తుల బలహీనతను ఆసరాగా తీసుకొని తన కోరికను తీర్చుకోవాలని పథకం వేసాడు

గిరిపురం గ్రామస్తులు అంకాళమ్మ అనే గ్రామ దేవతను ఆరాధించేవారు అంకాళమ్మ పిలిస్తే పలికే దేవతని, కన్ను మూస్తే కన్పించే దేవతని గ్రామస్తులు నమ్మేవారు ఆ నమ్మకానికి తన పథకాన్ని తెలివిగా ముడిపెట్టాడు రుద్రయ్య

గ్రామదేవత అంకాళమ్మ తనకు కలలో కన్పించి సంవత్సరానికి ఒక కన్నె పిల్లను గ్రామ పెద్దగా తను కన్నెరికం చేసి ఊరివారికి కానుకగా ఇవ్వాలని, ఆమె ఎవరు కోరితే వారికి సంవత్సరం పాటు శారీరక సుఖం అందించాలని, ఆమెను, ఆమె చేసే పనిని ఎవరూ చిన్న చూపు చూడకుండా ఆమెను గ్రామ దేవతలా చూసుకోవాలని, అందువల్ల ఊరికెంతో మంచి జరగడమే కాకుండా, వయసొచ్చిన కుర్రకారు, పెళ్ళాలు పోయిన పెద్ద వారు ప్రక్కత్రోవలు పట్టకుండా ఉంటారని, చెప్పిందని ప్రచారం చేసాడు రుద్రయ్య

అమాయకులైన గ్రామస్తులు రుద్రయ్య మాటలు గ్రుడ్డిగా నమ్మారు గ్రామదేవతగా ఉండడానికి ఏ కన్నె పిల్లయినా ముందుకు రావచ్చుని, అలా రాని పక్షంలో తనే ఎంపిక చేయవలసి ఉంటుందని ప్రకటించాడు రుద్రయ్య

ఎవరూ ముందుకు రాకపోవడంతో రుద్రయ్య తనే ఓ కన్నె పిల్లను ఎంపిక చేసి ఆమెకు కన్నెరికం చేసి ఊరివారికి కానుకగా ఇచ్చాడు ఆ పిల్ల అప్పటి నుంచి రోజుకొకరు చొప్పున పిలిచిన వారింటికి వెళ్ళి తన శరీరాన్ని పక్కగా పరిచేది ఆమె నుంచి సుఖం

అందుకున్న పురుషుడు ఆమెకు ఏవో, బియ్యమో ఇచ్చేవాడు. వాటితో ఆమెకు జరుగుబాటు అయ్యేది. ఆమెను ఎవరూ తప్పుగా చూసేవారు కాదు.

ప్రతి ఆచారం ప్రకారం విధిగా రుద్రయ్యతో గడపాలి. అలాఅని రుద్రయ్య ఉత్తర్వు. సంవత్సరం గడిచాక ఇష్టపడితే ఎవరైనా ఆమెను పెళ్ళాడవచ్చు. లేని పక్షంలో ఆమె ఊరివారికి దూరంగా ఉండాలి. అవసరమైన తిండీ, బట్టా సమకూర్చేవారు. ఆమె మాత్రం ఊళ్ళోకి రాకూడదు. ఊరివారు ఆమెను కలవ గూడదు.

రుద్రయ్యతో మొదలైన ఆ దురాచారం అలానే కొనసాగింది. కాలక్రమంలో అది దురాచారమని గ్రహించినా గ్రామ పెద్ద బలానికి, బలగానికి భయపడి గ్రామస్థులు నోరు విప్పేవారు కారు.

* * * * *

'యాదగిరి! అదృష్టవంతుడివిరా! నీ కూతురు గ్రామదేవత కాబోతున్నది' అన్నాడు జోగయ్య. 'ఏం అదురుష్టం దొరా! నా బిడ్డను నా చేతులతో నేను బజారు దాన్ని చేస్తున్నాను. ఈ గోరం సూడకుండా నా పేణం పోయిన బావుణ్ను' అని మనసులో గొణుక్కుంటూ, బుజం మీది కండువాను నోట్లో కుక్కుకొని కళ్ళనీళ్ళెట్టుకున్నాడు యాదగిరి.

లచ్చుమ్మ కూతురు భవిష్యత్ తలచుకొని నేల కూలిపోయింది. అంతకు ముందటి గ్రామ దేవతలు మానం పోగొట్టుకొని, మనువాడే వారులేక ఊరినుంచి వెలివేయబడి, గ్రామ పెద్ద క్రౌర్యానికి శిక్షగా పొందిన జబ్బులతో ఎలా నికృష్టంగా బ్రతుకుతున్నారో తలచుకుంటే లచ్చుమ్మ గుండె చెరువయింది.

జోగయ్య ముత్తయిదువుల వంక చూసి 'అంకమ్మను తీసుకు పోయి, జరగవలసిన ఏర్పాట్లు త్వరగా జరిపించండి' అని ఆదేశించాడు.

ముత్తయిదువులు, అంకమ్మను తీసుకొని పోతుంటే లచ్చుమ్మ గుండె బాదుకొని విలపించింది. యాదగిరి లోలోపలే కుమిలిపోయాడు. వారి రోదన అరణ్యరోదనే అయింది.

ముత్తయిదువులు అంకమ్మను చెరువు గట్టుకు తీసుకొని పోయి శుభ్రంగా స్నానం చేయించారు. సంపంగి నూనె రాసి తల దువ్వారు. తలలో సువాసనలు గుబాళించే పూలు తురిమాయి. పట్టు బట్టలు కట్టబెట్టారు. నుదుటి మీద కాసంత బొట్టు పెట్టి, గంధం పూసారు. ఆతరువాత అంకమ్మను, అంకాళమ్మ గుడికి తీసుకొని పోయారు.

ఆ సరికే జోగయ్య శుచిగా స్నానం చేసి పట్టు బట్టలు కట్టుకొని, ఒంటినిండా విభూతి రేఖలతో నుదుటి మీద బొట్టుతో అక్కడున్నాడు.

పూజారి విశ్వకర్మ, ముత్తయిదువులు అలంకరించి తీసుకొని వచ్చిన అంకమ్మను చూసి 'ని సౌందర్యం అద్భుతం అంకమ్మా! నేటి నుంచి నీవు గ్రామదేవతగా ఈ ఊరివారందరినీ చల్లగా చూడు.



## వేడి చేసింది

"అదేమిట్రా నీ నోట్లోంచి పొగ వస్తోంది" అడిగాడు తనను చూసి సిగిరెట్ దాచిన కొడుకుని ఉద్దేశించి తండ్రి కృష్ణమూర్తి.

"వేడి చేసింది నాన్నా! ఆవిర్లు వస్తున్నాయి నోట్లోంచి" తాపీగా చెప్పాడు కొడుకు శ్రీ కుమార్ తడుము కోకుండా.

---

ఆచారం ప్రకారం ఈ రోజు జోగయ్యగారితో, రేపు నాతో గడుపు' అని అంకాళమ్మకు హారతిపట్టి, స్తోత్రపరనం చేసి అంకమ్మను ఆశీర్వదించాడు.

తన ఎదురుగా జరుగుతున్న అన్యాయాన్ని అరికట్టడానికి అంకాళమ్మ తన మహిమ తెలిపి ప్రదర్శించలేదు. రాతి బొమ్మగానే ఉండిపోయింది.

ముత్తయిదువులు అంకమ్మను తీసుకొని పోయి జోగయ్య ఇంటి దగ్గర వదిలారు.

అలంకరణతో, ప్రాణమున్న బొమ్మలాగా, బలి పశువులాగా తమ ఇంటిలోకి అడుగిడుతున్న అంకమ్మ వంక జోగయ్య భార్య కామాక్షమ్మ, ఆమె కూతురు వేదవతి బాధగా చూసారు.

జోగయ్య ఏడాది కొకరిని అలా బలిపశువుగా చేయడం కామాక్షమ్మకు, వేదవతికి బాధగా ఉండేది. ఆ అనాచారం ఎలా రూపొందిందో వారిద్దరికీ బాగా తెలుసు. అయినా కామాక్షమ్మ భర్త మాట జవదాటకూడదన్న కట్టుబాటుతో అతని మాట జవదాటడం గాని, అతనికి ఎదురు చెప్పడం గాని చేసేదికాదు.

వేదవతి తల్లి దగ్గర 'ఇదంతా ఏమిటమ్మా!' అని నోరు తెరిస్తే, 'నాన్న గారు అన్నీ ఎరిగిన సర్వజ్ఞులు తల్లీ! ఏం మాట్లాడకు' అని నోరు మూయించేది.

వేదవతి జరుగుతున్న ఘోరానికి మనసులో ఎంతో ఆవేదన అనుభవించేది. తండ్రి కామాగ్నికి ఆహుతవుతున్న వాళ్ళు ఎవరో కన్నబిడ్డలే! ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఎంతగా ఆవేదన చెందుతారో! ఆ కన్నె పిల్ల కలలు ఎలా కల్లలవుతాయో అని ఆలోచన చేసేది వేదవతి. ఆమె హృదయం బాధతో విలవిల్లాడేది. 'ఆ అనాచారం అరికట్టాలి' అని ఆలోచించేది వేదవతి. 'కాని ఎలా?' పరిష్కారం దొరికేది కాదు.

వేదవతికి తండ్రి గదిలో నుంచి అంకమ్మ ఏడుపు, తండ్రి మందలింపు సన్నగా వినిపిస్తున్నాయి. వేదవతి ఏ చదువూ చదువుకోలేదు. కానీ విశాలంగా ఆలోచించే మనసిచ్చాడు దేవుడు. అందుకే ఆమె ఆలోచనలు నడుస్తున్న దురాచారాన్ని అంత మొందించడం గురించి సాగేవి.

* * * * *

ఓ రోజు గుడి నుంచి వస్తుంటే వేదవతికి, కొంచెం దూరాన అంకమ్మ కన్పించింది. అంతలో ఒక కుర్రవాడు జొన్నతోటలో నుంచి 'అంకమ్మా! రేపు రాత్రికి ఇక్కడకు రా! నీకివ్వవలసినవి ఇస్తానులే!' అని కేకేసి మాయ మయ్యాడు. ఆకేక వేదవతి చెవిన కూడా పడింది.

వేదవతిని చూడగానే అంకమ్మ భయ, భక్తులతో చేతులు జోడించింది. తన తండ్రి రాక్షసత్వానికి బలైకూడా ఆ పిల్ల తనను గౌరవిస్తున్నది. ఆ అమాయకత్వం వలననే తన తండ్రి వంటి వారి ఆటలు సాగుతున్నాయి– అనుకుంది వేదవతి.

'ఎలా ఉన్నావు? అంకమ్మా!' అని అడిగింది వేదవతి. 'బాగానే ఉన్నానమ్మాయి గోరూ!' అని బదులు పలికింది అంకమ్మ. 'అంకమ్మా! నీకు జరిగిన అన్యాయానికి నేనెంతగానో బాధపడుతున్నాను. ఇటువంటి అనాచారం ఎప్పుడు అంతమవుతుందా? అని ఎదురుచూస్తున్నాను. గుడిలో నీ కెదురవుతున్న సాదక బాధకాలు నాతో మనసు విప్పి చెప్పవూ?' అని అడిగింది వేదవతి.

వేదవతి సానుభూతి వచనాలకు అంకమ్మ హృదయం స్పందించింది. 'ఏం చెప్పనండమ్మాయి గోరూ! పగలు పెద్ద మనుషుల్లా కన్పించే ఈ మగాళ్ళు రాత్రుళ్ళు రాక్షసుల్లా మారుతారు. నా శరీరాన్ని హింసించి ఆనందం పొందుతారు. ఇందాక జొన్న తోటలో నుంచి ఒకడు కేకేసాడు 'రేపు రాత్రికిరా' అని. ఆచారం ప్రకారం కాదనకూడదు. వాడికంగా మిసం కూడా రాలేదు. ఈ ఆచారం కుఱ్ఱాళ్ళను పాడు చేస్తున్నది' అని చెప్పింది అంకమ్మ.

అంతా విన్న వేదవతి చిన్నగా నిట్టూర్చి 'క్షమించు అంకమ్మా! నీ కష్టాలు వినగలిగేదాన్నే గాని, తీర్చగలిగేదాన్ని కాదు' అని ముందుకు కదిలింది. 'మీరు బాధ పడకండమ్మాయి గారూ!' అంతా నా ఖర్మ' అంది అంకమ్మ. ఈ కర్మ సిద్ధాంతాలే ఈ అనాచారానికి మూలమేమో! ఈ గిరి నుంచి బయట పడి తన తండ్రిని ఎదిరించగలిగిన నాడే ఈ అమాయకులకు ఈ ఆచారం నుంచి విముక్తి

లభిస్తుంది' అనుకుంది వేదవతి

మరునాడు తెలతెలవారుతుండగా పూజారి ఐశ్వకర్మ, జోగయ్య ఇంటికి వచ్చి 'అయ్యో' అంకమ్మ దేవాలయం ముందున్న బావిలోపడి ప్రాణం తీసుకుంది' అని చెప్పాడు జోగయ్య తాపీగా 'ఎందుకా పాడుపని జేసింది?' అని విసుక్కున్నాడు రాత్రి పోలిగాడు దానితో రాక్షసంగా ప్రవర్తించాడట భయపడి పోయిన అంకమ్మ చచ్చింది' అని చెప్పాడు ఐశ్వకర్మ

'పోలిగాడ్ని పిలిపించు కొరడా వేయిద్దాం' అన్నాడు జోగయ్య. జోగయ్య అప్పటికప్పుడు రచ్చబండ దగ్గర సమావేశం ఏర్పాటు చేసి, పోలిగాడి కోసం కబురు పంపాడు వాడప్పటికే ఇల్లు వదలి పారిపోయాడని తెలిసింది

ఆ ఊరికి పోలీస్ స్టేషన్ లాంటిది లేదు అసలటువంటివి ఉంటాయని కూడా ఆ ఊరివారికి తెలియదు ఎవరేతప్పు చేసినా శిక్ష విధించేది జోగయ్యే'

పోలిగాడు కన్పించడం లేదని వినగానే జోగయ్య అగ్గిమీద గుగ్గిలంలా మండి పడ్డాడు వాడెక్కడో దాక్కుని ఉంటాడు వెదకి పట్రండి అని ఆదేశం జారీ చేసాడు

జొన్న చేనులో దాక్కొని ఉన్న పోలిగాడిని నలుగురు కుఱ్ఱాళ్ళు జుట్టుపట్టుకుని లాక్కొచ్చారు జోగయ్య వాడి వంక ఉరిమి చూస్తూ 'నీచుడా' గ్రామదేవతను పూవులా చూసుకోవాలని తెలియదా? పశువులా ప్రవర్తించి ఆమె చావుకు కారకు డయ్యావు నీకు నూరు కొరడా దెబ్బలు శిక్షగా విధిస్తున్నాను అనుభవించు' అన్నాడు

జోగయ్య పాలేరు కొండన్న కొరడా తీసుకొని పోలిగాడ్ని కొట్టడం మొదలు పెట్టాడు ఒక్కొక్క దెబ్బ తగులుతుంటే పోలిగాడు వెఱ్ఱిగా కేకలు పెట్ట సాగాడు అది చూసిన జనం స్థాణువులై పోయారు

యాభై కొరడా దెబ్బలు తినే సరికి పోలిగాడు నేల మీదకు వాలిపోయాడు అయినా జోగయ్య శాంతించలేదు వంద కొరడా దెబ్బలు కొట్టడం పూర్తయ్యాక వాడి తండ్రి వచ్చి శవంలా పడిఉన్న పోలిగాడ్ని రెండు చేతులకు ఎత్తుకొని పోయాడు

అంకమ్మను తనివితీరా అనుబవించలేదన్న జోగయ్య కడుపు మంట అప్పటికి కొంచెం శాంతించింది

జోగయ్య ఇల్లుచేరి, స్నానానికి వెళ్ళ బోతూ ఉండగా ఎక్కడి నుంచో ఊడిపడ్డాడు యాదగిరి 'అయ్యో' నా బిడ్డ చావుకు కారణం మీరే! మీరే నా బిడ్డను పొట్టన పెట్టుకున్నారు నా ఉసురు మీకు తగలక పోదు మీరూ, మీ కుటుంబం సర్వనాశనమై పోతారు' అని బయట నుంచి బిగ్గరగా అరవ సాగాడు

యాదగిరి అరుపులకు జోగయ్య కళ్ళు ఎఱ్ఱబడ్డాయి నాసికా పుటలు అదిరాయి తనవంటి వాడిని దూషించడానికి, దుయ్యబట్టడానికి యాదగిరికి ఎంత ధైర్యం? వాడి మాటలు జనం వింటూనే ఉండి వుంటారు తను మిన్నకుండిపోతే తన ప్రతిష్ట దెబ్బ తినదూ? తను చేతగాని వాడినని అందరూ అనుకోరూ?

జోగయ్య వంకీకి తగిలించిన చొక్కా అందుకొని, తొడుక్కుని బయటికి వచ్చాడు యాదగిరి ఆవేశంతో రొప్పుతున్నాడు

'యాదిగా' ఇందులో నేను చేసిందేమీ లేదు మనూరి ఆచారం ప్రకారం నీ కూతుర్ని గ్రామదేవతను చేసాను పోలిగాడు చేసిన తప్పుకు అంకమ్మ చచ్చింది అందుకు తగిన శిక్ష పోలిగాడికి వేసాను నీవు హద్దుమీరి మాట్లాడుతున్నావు బిడ్డ చచ్చిన దుఃఖంతో ఉన్నావని క్షమిస్తున్నాను నోరు మూసుకొనిపో' అని గద్దించాడు జోగయ్య

జోగయ్య మాటలు ఖాతరు చేసే స్థితిలో లేడు యాదగిరి అతను ప్రాణానికి తెగించాడు అంకమ్మ మరణం అతన్ని ఉన్మాదస్థితికి చేర్చింది 'హద్దు మీరడం కాదు ఇన్నాళ్ళు హద్దు మీరక పోబట్టే మీ ఆటలు సాగుతున్నాయి గ్రామ దేవత పేరుతో మా కూతుళ్ళను ఎలయాళ్ళుగా మార్చి మీ కోరిక తీర్చు

కుంటున్న మీరు మీ కూతుళ్ళకు అదే పరిస్థితి వస్తే భరించగలరా?' అని ప్రశ్నించాడు

అదే సమయానికి, జరుగుతున్న గొడవకు బయటకు వచ్చిన వేదవతి చెవిన పడిందా ప్రశ్న యాదగిరి ప్రశ్న ఆమె హృదయాన్ని సూటిగా తాకింది దాని తీవ్రతకు చలించిందామె

'యాదిగా'' అని పెద్దగా కేకేసాడు జోగయ్య ఆ అరుపుకు చెట్టు మీదున్న పిట్టలు ఎగిరిపోయాయి చుట్టు ప్రక్కల వాళ్ళు భయపడి ఇళ్ళలోనికి పోయి తలుపులు వేసుకున్నారు

నీవు హద్దు మీరావు ఇక ఉపేక్షించను ఒరే! కొండన్నా!' అని పిలిచాడు జోగయ్య 'చెప్పండి దొరా!' అని ముందు కొచ్చాడు కొండన్న

'ఈ యాదిగాడు నోటి కొచ్చినట్లు వాగుతున్నాడు మరిక వాగకుండా వీడి నాలుక కోసెయి అన్నాడు జోగయ్య కొండన్న కత్తి తీసుకుని వచ్చాడు మరిద్దరు నౌకర్లు యాదగిరి చేతులు విరచి పట్టుకున్నారు అక్కడ పరిస్థితి విషమించ బోతున్నదని గ్రహించిన వేదవతి నాన్నగారూ! ఈసారికి వాడిని క్షమించి వదిలేయండి' అని ప్రాధేయ పడింది

వేదా! ఈ వ్యవహారాల్లో నీ జోక్యం అనవసరం ఇంట్లోకి పో అని గద్దించాడు జోగయ్య వేదవతి నిస్సహాయంగా లోనికి నిష్క్రమించింది

యాదగిరి నాలుక తెగి నేలమీద పడింది

* ** * *

రచ్చబండ దగ్గర మళ్ళీ అందరూ గుమి గూడారు వాళ్ళందరి కళ్ళల్లోనూ భయం గుండెలో ఆవేదన కాళ్ళల్లో ఒణుకు ఏమీ చేయలేని నిస్సహాయత ఎదిరించలేని పిరికితనం

వాళ్ళందరి వంకా పరిశీలనగా చూసిన జోగయ్య గ్రామదేవత మీద పోలిగాడు అత్యాచారం జరిపినందుకు వాడికి తగిన శిక్ష విధించిన సంగతి మీ అందరికీ తెలుసు అంకమ్మ మరణించి గ్రామదేవతలో ఐక్యమై పోయింది అందుకే మరొక కన్నె పిల్లను గ్రామదేవతగా ఊరిలో ఏర్పరచడానికి మీ అందర్నీ రప్పించాను ఏ పిల్లయినా తనంతట తాను ముందుకు వస్తే సంతోషం లేకుంటే ఆ ఎంపిక నేనే చేయవలసి ఉంటుంది' అన్నాడు జోగయ్య

'ఎవరూ లేరా?' అని జోగయ్య అరిచాడు 'నేనున్నాను' అన్న ఓ యువతి స్వరం అతని చెవిన పడింది 'శహభాష్! ముందుకురా'' అన్నాడు జోగయ్య అంతవరకూ చెట్టు చాటున నిలబడిఉన్న ఆ యువతి కదలి జోగయ్య ముందుకు వచ్చింది

ఆమెను చూసి జోగయ్య అదరి పడ్డాడు ఎంత భయపడ్డాడంటే, పొదచాటున పొంచి ఉన్న పులి అమాంతం మీదకు ఉరికి నప్పుడు, చేతిలో ఏ ఆయుధం లేక పోయినా జోగయ్య అంత బయపడేవాడు కాదు

వేదా! నీవు ఇక్కడికెందు కొచ్చావు?' అన్నాడు జోగయ్య అతని స్వరంలో అంతకు ముందున్న గంభీరత లేదు మాటలు పేలవంగా వచ్చాయి

ఎందుకేమిటి? గ్రామదేవత ఎంపిక జరుగుతున్నదని తెలిసి అంత పవిత్రమైనది మరొకరికి దక్కనీయడం ఎందుకని పరుగు పరుగున వచ్చాను ఏం? నన్ను గ్రామదేవతను చేయగూడదా? అంది వేదవతి

మన కుటుంబీకులకు మినహాయింపు ఉంది నీవు గ్రామదేవతగా ఉండడానికి పనికిరావు అన్నాడు జోగయ్య

అని ఎవరన్నారు? ఈ మినహాయింపు ఏర్పరచిన నియమంలో లేదు ఎవరైనా ముందుకు రావొచ్చు మీరు అనవసరంగా ఆందోళన చెందకుండా జరగవలసిన కార్యక్రమం చూడండి అంది వేదవతి ఆమె మాటలు స్థిరంగా ఉన్నాయి

జరుగుతున్న సంఘటన చూస్తున్న గ్రామస్తులు విస్తుపోయారు అది కలో నిజమో వారికి అర్థం కాలేదు కొందరు జోగయ్యకు అలాగే జరగాలని మనసులో అనుకున్నారు

అంతలో పూజారి విశ్వకర్మ ముందుకొచ్చి జోగయ్యగారూ! సందేహించకండి మీ అమ్మాయిన్ని గ్రామదేవత చేసారంటే మీ పేరు చరిత్రలో శాశ్వతంగా మిగిలిపోతుంది కానీయండి అన్నాడు పూజారికి వేదవతి అందం మత్తెక్కిస్తున్నది ఆమెను ఎంత త్వరగా అనుభవిద్దామా? అని ఉంది

జోగయ్య ఏం మాట్లాడ లేకపోయాడు జరుగుతున్నది కలో నిజమో అవగతం కాని పరిస్థితి ముత్తయిదువులు ముందుకొచ్చి వేదవతిని చెరువు గట్టుకు తీసుకొని పోయి శుచిగా స్నానం చేయించి, తలకు సంపంగి నూనె రాసి, జడవేసి, పూలు తురిమి, పట్టు బట్టలు కట్టి జోగయ్య ఇంటికి తీసుకొని పోయారు

ఇంట్లో అశాంతిగా పచార్లు చేస్తున్న జోగయ్య అలంకరణ చేసుకొని ఇంటిలోకి అరుదెంచుచున్న కూతుర్ని చూసి, తన గదిలోనికి పోయి, దడేళ్న తలుపు వేసుకున్నాడు ఆచారం ప్రకారం తన కూతురికి తనే కన్నెరికం చేయాలి

హే భగవాన్ నేను చేసిన పాపాలకు ఇంత కఠిన మైన శిక్ష విధిస్తావనుకోలేదు ఎందరో కన్నె పిల్లల జీవితాలను కాల రాచినందుకు నాకీ శిక్ష తగినదే నేనిక బ్రతకలేను అనుకొని దూలానికి త్రాడు బిగించి ఉరిపోసుకుని చచ్చిపోయాడు

తల్లి ఎంత చెప్పినా వేదవతి వినలేదు మరునాడు విశ్వకర్మ ఇంటికి వెళ్ళింది విశ్వకర్మ వేదవతి అందాన్ని తృప్తిగా ఆరగించాడు ఆ తరువాత మరొకడు ఆ తరువాత మరొకడు

కాలచక్ర పరిభ్రమణంలో నెలలు తిరిగాయి జోగయ్య మరణంతో అతని కొడుకు శివయ్య ఊరి పెద్ద అయ్యాడు

తండ్రి బ్రతికి ఉండగా, తను గ్రామ పెద్ద అయిన తరువాత ఏఏ కన్నె పిల్లలకు కన్నెరికం చేయాలో ముందే ఊహించుకుని కలలు గన్న శివయ్య తాను గ్రామ పెద్ద అయిన తరువాత అంత వరకూ కొనసాగిన ఆచారానికి స్వస్తి పలుకుతున్నట్లు ప్రకటించాడు ఎందుకంటే తన కూతురు, తనచెల్లి వేదవతిలా మరొక గ్రామదేవత కాకూడదని

అదే వేదవతికి కావలసింది ఆ అనాచారాన్ని అంత మొందించడానికి ఆమె తన పండంటి జీవితాన్ని పణంగాపెట్టింది

ఆ రాత్రే వేదవతి గ్రామదేవత గుడికి ఎదురుగా ఉన్న చెఱువులో కలసి పోయింది

ఆ తరువాత గ్రామస్తులకు "గ్రామదేవత అంకాళమ్మ విగ్రహం చూసినప్పుడల్లా వేదవతి తలపుకొచ్చేది ●

## ముహూర్తం వరకే...



సునిల్‌దత్ ఈమధ్య ఓ కొత్త చిత్రాన్ని ప్రారంభించారు దానిపేరు 'ఏ ఆగ్ కబ్ బుజేగి' దత్ గతంలో కూడా ఓ చిత్రాన్ని ప్రారంభించారు దానిపేరు జౌర్‌గంగా బెహతిరహే' ఆయన దానిని ప్రారంభించి (ముహూర్తం షాట్ తీసి). అంతటితోనే దానిసంగతి మరచిపోయి పాదయాత్రకు వెళ్ళిపోయారు అంతే ఆ తరువాత ఆ సినిమా నిర్మాణం సాగలేదు! అసలు ఏమయిందో కూడా తెలియదు మళ్ళీ యిప్పుడు కొత్త చిత్రం ముహూర్తం జరిపారు మళ్ళీ ఏదయినా పాదయాత్ర తగిలితే ఈ సినిమా కూడా గంగలో కలిసి పోవాల్సిందే నేమో!







# ఆ నొప్పికి స్ట్రాంగ్ చికిత్స అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికీ అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు.

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థములే మరింత శక్తివంతంగా సమ్మిళితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో. విపరీతమైన నొప్పులను, 'బాధలను త్వరితంగా వుపశమింపజేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్.

**అమృతాంజన్ స్ట్రాంగ్**

మిక్కిలి బాధాకరమైన నొప్పులకు




అమృతాంజన్ లిమిటెడ్ 

OBM 831 TG

# గుండె గొంతులో

"నాన్నా! టెలిగ్రాం వచ్చింది' అని కేకేసి వీధిలోనికి పారిపోయింది సంధ్య

దినపత్రిక చూస్తున్న ప్రభాకరం లేచి పోస్ట్‌మన్ యిచ్చిన స్లిప్ మీద సంతకం చేసి టెలిగ్రాం అందుకున్నాడు

జ్యోతి సకమ్డ్ టు బర్న్స్ స్టార్ట్ యిమ్మీడియట్లీ' అని ఉందందులో ఏభయి ఏళ్ళ ప్రభాకరం చిగురు టాకులా కంపించాడు కాసేపట్లో ఆ యిల్లంతా దుఃఖసాగరంలో మునిగి పోయింది ప్రభాకరం బార్య లక్ష్మీబాయి సంగతి యిహ చెప్పనలవి కాదు శోకదేవతలా నెత్తీ నోరూ బాదుకుంటూ విలపిస్తూనే ఉంది

త్రాష్టుడు నా కన్న తల్లిని పొట్టన పెట్టుకున్నాడు వీడి నిలువెల్లా పాతరెయ్య అంటూ అల్లుడిని శాపనార్థాలు పెడుతూ రాగాలు తీయసాగింది

డబ్బు డబ్బంటూ పీల్చి ఎప్పి చేసాడు దాన్ని మనకున్న కాస్తంతా దౌర్జన్యంగా పడేసు కున్నాడు ఇంకా దాహం తీరలేదు దుష్టుడిక రక్తం మరగిన ఎశాచి ఆ యిడియట్‌ని నరిక పోగు లెయ్యందే నేన్నిద్రపోను అంటూ ఆవేశంతో ఊగి పోయాడు ప్రబాకరం

హడావుడిగా ఓ సూట్‌కేస్‌లో కొన్ని బట్టలు అవీ పడేసుకుని భార్యతో హైదరాబాద్ బయల్దేరాడు ప్రబాకరం ప్రబాకరం పొంగి పొరలుతోన్న దుఃఖాన్ని అతి కష్టం మీద కంట్రోల్ చేసుకుంటున్నాడు ఒక ప్రక్క ఎకదారగా విలపిస్తున్న బార్యను ఒదార్చుతూ, మరో వైపుకు మొహం చాటేసుకుని తనూ కండువాతో కంటి తడి తుడుచు కుంటున్నాడు మాటిమాటికీ

ఎలా అయితేనేం చివరికి పట్నంలో అల్లుడుంటున్న కాలని చేరుకో గలిగాడు ఇంట్లోని కడుగు పెడుతూ ఆశ్చర్య పోయాడు ప్రబాకరం

ఏడుపులు మొరలతో గందర గోళంగా ఉంటుందనుకున్న యిల్లు ప్రశాంతంగా, నిశ్శబ్దంగా ఉంది

ప్రయాణం కులాసాగా సాగిందా వదినె గారూ?' అంటూ నిమ్మకు నీరెత్తినట్లు కుశల ప్రశ్నలు

## కోరుకొండ వెంకటేశ్వరరావు



వేస్తున్న వియ్యపురాలిని చూసి చిర్రెత్తు కొచ్చింది ప్రభాకరానికి.

"మా జ్యోతి ఎక్కడ?" ఒళ్ళంతా కందిస్తుండగా రౌద్రంగా అడిగాడు. మావగారిని ప్రక్క గదిలోనికి తీసు కెళ్ళాడు మోహన్.

గది మధ్యలో చాప మీద పరుండ బెట్టారు జ్యోతి మృతదేహాన్ని. రూపురేఖలు ఏమాత్రం పోల్చుకో లేనంతగా కాలిపోయి ఉంది శరీరం. ఒళ్ళంతా బొబ్బలెక్కి వికృతంగా కనిపిస్తోన్న ఆ శవాన్ని చూడగానే ఒళ్ళు జలదరించింది ప్రభాకరానికి.

సన్నగా, నాజూగ్గా మిలమిల మెరిసే తన కుమార్తె కమిలిన శరీరంపై అసహ్యకరమైన మచ్చలతో....

తన గుండెలను ఎవరో యినుప పిడికిలితో పిండేస్తున్న భావన ఒళ్ళంతా ప్రాకగా విలవిల లాడాడు ప్రభాకరం.

"అమ్మా! జ్యోతీ!! ఏ గతి పట్టిందమ్మా చివరికి నీకు. ఆఖరి చూపులైనా నోచుకోలేక పోయామమ్మా తల్లీ. ఏం పాపం చేసామనమ్మా దేవుడు మాకీ శిక్ష విధించాడు తల్లీ." శవం ప్రక్కగా కుప్పలా కూలిపోయి రోదించ సాగింది లక్ష్మీబాయి.

ప్రభాకరం కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది. చిన్న పిల్లాడి మాదిరి విలపించ సాగాడు.

"మమ్మలినందరినీ అన్యాయం చేసి వెళ్ళిపోయావా తల్లీ!" అంటూ జ్యోతి మృతదేహాన్ని ఆవేశంతో అటూ, యిటూ ఊపేస్తూంది లక్ష్మీబాయి.

ఆమె ఆ శరీరాన్నలా కదులుస్తుంటే ఒక్కసారిగా వ్యాపించిన దుర్గంధపు వాసనను భరించలేనట్టుగా మెల్లగా అక్కణ్నుంచి జారుకో బోయాడు మోహన్.

ఆడపిల్ల వాళ్ళమని యిన్నాళ్ళూ అల్లుడి ఆగడాలన్నీ సహించాడు ప్రభాకరం.

ఆ సహనానికి పరాకాష్ట కళ్ళెదురుగా కనిపిస్తోన్న దారుణ హత్యాకాండ!

అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేసిన కూతురిని అగ్నికాహుతి చేసాడు త్రాష్టుడు. పైగా గ్యాస్ లీకేజీ వల్ల చనిపోయిందని నంగి మాటలు చెబుతున్నాడు స్కౌండ్రల్!

ఒక్కసారిగా ఆవేశం కట్టలు త్రెంచుకుంది ప్రభాకరంలో...

అంతే!–

వెనుదిరిగి పోతున్న మోహన్‌ని ఒక్కడుగులో సమీపించాడు. అరక్షణంలో అతడి చేతులు మోహన్ మెడచుట్టూ బిగుసుకున్నాయ్. గిల గిల కొట్టుకున్నాడు మోహన్.

"క్షమించండి మావగారూ. ఇందులో నా తప్పేం లేదు, నన్ను నమ్మండి మావగారూ!" తన కాళ్ళు పట్టుకునేందుకై వంగే ప్రయత్నం చేస్తున్న అల్లుడిని ఏమాత్రం కదల నీయలేదు ప్రభాకరం.

"నన్ను చంపకండి మావగారూ.... ప్లీజ్" ప్రాధేయపడ సాగాడు. అది కొద్ది క్షణాలే.... కాసేపట్లో అతని ప్రాణం అనంత వాయువుల్లో కలిసి పోయింది.

ఊపిరాడక దైన్యంగా రోదిస్తూ చివరి శ్వాస వీల్చిన మోహన్ ప్రభాకరం కాళ్ళ దగ్గర కుప్పలా కూలి పోయాడు.

ఎదురుగా జ్యోతి దేహాన్ని అణువణువూ తడుముతూ ఏకధారగా విలపిస్తూనే ఉంది లక్ష్మీబాయి.

దుర్గంధపు వాసన మరోసారి గుప్పుమంది గది నిండా.

"చావరా దరిద్రుడా, చావు" అంటూ అల్లుడిని ఫుట్‌బాల్‌లా తన్నాడు ప్రభాకరం.

కసి తీరలేనట్టుగా మళ్ళా అతని దగ్గరికి వెళ్ళి కాలితో వరసగా కుమ్మసాగాడు.

"ఆడ కూతురిని పొట్టన పెట్టుకుంటావురా డర్టీ రోగ్. కుక్కల కేస్తాను నీ శవాన్ని, చావరా నా కొడకా చావు."

మనసుకు కాస్త ఉపశమనం కలిగినా యింకా ఒళ్ళంతా కంపిస్తూనే ఉంది ప్రభాకరానికి.

* * * * * * * * *

"ఏమిటి నాన్నా! చావరా చావు అంటూ ఎవరినలా తిడుతున్నావు" అంటూ కుదిపి లేపింది సంధ్య.

"పట్టపగ లేమిటా కలవరింతలు, మీరూను. బారెడు ప్రొద్దెక్కాక లేచే ఆ పాడలవాటు మాత్రం మానుకోరు. అటు చూస్తే ముహూర్తం నెల రోజులైనా లేదాయె. కళ్యాణ మండపం బుక్ చెయ్యాలి. కార్డు లచ్చేయించాలి. అన్ని పనులు వాడొక్కడే ఏం చేయగలడని? లేచి త్వరగా తెమలండి" వంటింట్లోంచి అరచింది లక్ష్మీబాయి.

వేగంగా కొట్టుకుంటున్న గుండెల మీద చెయ్యి వేసుకున్నాడు ప్రభాకరం.

ఎదురుగా కాఫీ త్రాగుదామని కూర్చున్న సంధ్యను ఒక్కంగలో సమీపించి ఆమె చేతిలోని గ్లాసందుకుని రెండు గుక్కల్లో ఆ కాఫీ తాగేసాడు ప్రభాకరం– బ్రష్ చెయ్యకుండా ఏనాడూ పచ్చి నీళ్ళయినా ముట్టని ప్రభాకరం!

బెడ్ కాఫీ తాగుతున్న ప్రభాకరాన్ని కిటికీ లోంచి చూసి ఫక్కున నవ్వింది తండ్రి కోసం కాఫీ కలుపుతున్న పెళ్ళి కూతురు జ్యోతి!

●

సితార్  రవిశంకర్

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సితార్ విద్వాంసుడూ, పద్మభూషణ్ అవార్డు గ్రహీత అయిన పండిట్ రవిశంకర్ (69)కి, సంగీత విద్వాంసురాలు సుకన్యా రాజన్ (34)తో యిటీవల హైదరాబాద్ సమీపంలో వున్న బాలాజీ మందిర్‌లో హిందూ సాంప్రదాయ పద్ధతిలో వివాహం జరిగింది. వీరి వివాహానికి ఆయన సహకార వాద్యకారులు, బంధువులు, స్నేహితులు శిష్యులూ హాజరయ్యారు.



సితార్ సార్వభౌముడిగా పేరు గాంచిన పండిట్ రవిశంకర్ తన గురువుగారైన ఉస్తాన్ అల్లా ఉద్దీన్ జాన్ సాహెబ్ కుమార్తె అన్నపూర్ణను ప్రథమ వివాహం చేసుకున్నారు. ఆమె కూడా గొప్ప గాయని.

# యుగయుగాలుగా జగజగాలను ఉర్రూతలూగించిన "ఊర్వశి"

# మన్మథుని మొలక మార్లిన్ మన్రో కథ

20వ శతాబ్దం అయిపోతోంది– బహుశా యీ శతాబ్దంలోని చాలా విషయాలు 2 వేల ఒకటో సంవత్సరానికి మరిచి పోతారు కాని "మారిలిన్ మన్రో"ని మరిచిపోతారా? మరిచిపోరు.

"నువ్వు అపర రతీదేవివి! అసలు సిసలైన మన్మథుని "గురు"వి– నీ చిరునవ్వుకన్నా సెక్సప్పీలున్న మరో అంగసౌష్టవం లేదు. నువ్వు యీ శతాబ్దానికి ఒక అద్భుతమైన జీవివి" అంటూ విమర్శకులు, అభిమానులు కూడా ఆమెను స్తుతించే వాళ్ళు!

కాని ఎవరీ అందాల అపరంజి బొమ్మ! మన్మథుని వలపుల మొలక! ఒక అనాథ బాలిక! అంతులేని వ్యథలతో బ్రతకలేక నిండు ప్రాణాలు తీసుకున్న ఒక అబల– అపురూప సౌందర్యవతి, అతి అమాయక యువతి మారిలిన్ మన్రో కథ నాటికీ నేటికీ ఒక నిత్య నూతన గాథ!

## – అసలు పేరు ఆమెది– నార్మాజీన్

పుట్టుక 1926– మరణం 1962– ఆమెతో

తల్లే తెలుసు. అయితే సి. స్టాన్లీ గిఫ్ఫోర్డ్ అనే ఫిలిం ప్రాసెసింగ్ మెటీరియల్ సేల్సుమాన్‌ని ఆమె

లాస్ ఏంజిల్స్ జెనరల్ ఆసుపత్రిలో "నార్మాజీన్" (అంటే ఆ తరువాత మారిలిన్ మన్రో) పుట్టింది.





వుందంటే చాలు కాట్లు కుక్కలా మీదపడి లాక్కొనే మారిలిన్ ఏడాది తిరిగే సరికి ఫాక్సు స్టూడియో యజమానులలో ఒకడైన జోసఫ్ ఎమ్. షెక్కాతో చేతిలో చెయ్యి దోపి– పార్టీలకి హాజరవటం మొదలెట్టింది. అదీ ఆమెలోని ఆకర్షణ!

## తిరుగులేని నటి

మారిలిన్ మన్రో చిన్న పిసరు "తొడ" ప్రదర్శించినా చాలు వెండి తెర మీద కనక వర్షం కురిసేది. అలా యిప్పి వుంచిన ఆమె, "నోరు" కన్నా సెక్సు అప్పీలు మరొకటి లేదు అని జనాలు పడి చచ్చేవాళ్ళు. చిన్న చడ్డీతో మన్రో బొమ్మ చాలు– యింకేమీ వొద్దు అనే వాళ్ళు! యివాళ అంటున్నారు!

"ఆల్ యీజ్ యీవ్" అన్న మారిలిన్ సినిమా రెండు ఆస్కార్ అవార్డు లందుకున్నది.

ఆమె "సెవెన్ యియర్స్ యిచ్"లో, చిన్న పొట్టి గౌను యిలా బుట లాగా లేచి సుళ్ళు తిరిగి గాలిలోకి

జాన్ ఎఫ్ కెన్నెడీ వున్నాడు. సంగీత విద్వాంసుడు ఫ్రెడ్డీ కార్గర్, ఆంద్రో డి ఓయినెస్ (ఫొటోగ్రాఫర్) వైవెస్ మోంటాండ్ (ఫ్రెంచి నటుడు), జేమ్స్ కార్రోల్ (నటుడు)... యిట్లా చాలా మంది వున్నారు– వీళ్లంతా ఆమె వెంటపడ్డ వాళ్లే కాని ఆమె చేసుకున్న పెళ్లిళ్ళు మూడున్నాయి! జూన్ 42 మరీ చిన్న పిల్లగా వున్నప్పుడు (16) జిమ్ డార్టీని పెళ్ళాడింది. కాని అది నిలవ లేదు. దేవ కన్యలకి పెళ్లి ఏమిటన్నారు అంతా. కాని ఆమె హుందాగా పొడుగుగా వుండే బేస్ బాల్ ప్లేయర్ జో డి మెగ్గియోని వివాహం చేసుకుంది. కాని (1954) రెండేళ్ళయినా వాళ్ళు కలిసి వుండలేదు. అయితే ఆర్థర్ మిల్లర్‌ను పెళ్లి చేసుకున్నప్పుడు– చేసుకొనక మునుపూ కూడా ఆమె అతనంటే చాలా గౌరవం కూడాచూపెట్టింది. కాని మెరుపు తీగలు ఏ వృక్షాలకైనా చుట్టుకుని పడి వుంటాయా? మార్లిన్ మన్రో అంతే!

## తండ్రి ఎవరో తెలీదు?

మిలమిలా మెరిసే బంగారు జుత్తుతో పుట్టిన యీ అమ్మాయికి తండ్రి ఎవరో తెలియదు. పెంపుడు





తన తండ్రి అనుకుంటూ వుండేది. చిన్నప్పటి నుంచి ముద్దుగానే అందంగానే పెరిగింది. ఏడాది పాపాయిగా కూడా "మారిలిన్ మన్రో" ప్రయిజు బేబీగానే వుండేది.

1925లో గ్లాడీస్ పెర్ల్ బేకర్ అనే ఒక అమ్మాయిని మొగుడు మార్టిన్ వదిలేసి ఎటో పోయాడు– అమె తన ప్రియుడుతో కాలక్షేపం చేస్తూండగా– అతను ఎటో పోయాడు కాని అప్పటికే గ్లాడీస్ గర్భవతి. ఆ ప్రియుని పేరే స్టాన్లీగిఫ్ఫోర్డ్– కాని ఆ పేరు యివ్వడానికి అతను లేడు. కాని 1926 జూన్ 1న 1935 దాకా తల్లి డబ్బులిచ్చి యీ పిల్లని ఆ యింటా ఆ యింటా పెంచింది కాని ఆటు తరువాత 1935లో నార్మాజీన్ అనాధ శరణాలయంలో చేరింది!

## జులై 16, 1946

సినిమాల్లో ఎక్స్ట్రా వేషాల కోసం వెంపరలాడే అమ్మాయిలలో మారిలిన్ మన్రో ఒకతె. 1946, జులై 16న ఎరువు తెచ్చుకున్న గౌనులో యీ అమ్మాయి ట్వెంటియత్ సెంచురీఫాక్సు స్టూడియోలో అడుగు పెట్టింది!బంగారం జుత్తు అమ్మాయికి ఏదైనా వేషం

"సినిమా తార", "ప్రేమదేవత", "మన్మథుని మొలక", "రతీదేవి" అవతారం పుస్తకాల అట్టల మీద, "అందాల సెక్సు దేవత" లాంటి బిరుదు లెన్నో మోసినా "నిజమైన ప్రేమ" మాత్రం నాకు లభించ లేదు అంటూ 36 ఏళ్ళు నిండకుండానే యీ "పాడు ప్రపంచాన్ని" వదలిపోయిన మార్లిన్ మన్రో– కట్టుకున్న లోపలి దుస్తులు, చెడ్డీ, బ్రాసియర్ వగైరాలను ఒక కాలనాళికలో పెట్టి భూస్థాపితం చేశారు! దాన్ని సరిగ్గా ఆమె శత జయంతి ఉత్సవాలనాడు అంటే 2026 జూన్ నాడు త్రవ్వి తీస్తారుట– అందాకా మనం వుంటామో వుండమోనని యీ కథ యిప్పుడే చెప్పుకుంటున్నాం.

ఎగిరి పోతూంటే సుతారంగా పట్టుకుని యిచ్చిన ఫోజను యిప్పటికీ సెక్సు తారలు కావాలనుకున్న వాళ్ళు ప్రపంచ వ్యాప్తంగా ప్రాక్టీసు చేస్తున్నారు! (ఉదాహరణకి అనూరాధ యిటీవల వొక చిత్రంలో యిలా తంటాలు పడ్డది)

మార్లిన్ మన్రో ఉత్త "రంభ" మాత్రం కాదు. 1947కీ 1961కి మధ్య ఆమె నటించిన చిత్రాలన్నీ బ్రహ్మాండమైన చిత్రాలు.

ఆ పేర్లే చాలు. ఉదాహరణకి "ఏజ్ యంగ్ యాజ్ యూ ఫీల్" (1951) లవ్ నెస్ట్; లెట్స్ మేకిట్ లీగల్; వు యార్ నాట్ మ్యారీడ్ (1982) నయాగరా (1953) జెంటిల్‌మన్ ప్రిఫర్ బ్లాండ్స్; హౌ టు మారీ యే మిలియొనియర్; దేర్స్ నో బిజినెస్ లైక్ షో బిజినెస్ (1954) బస్‌స్టాప్; లెట్ అజ్ మేక్ లవ్; సమ్ లైక్ యిట్ హాట్; సెవెన్ యియర్స్ యిచ్; ప్రిన్స్ అండ్ ది షోగాళ్, యిలా ఏ సినిమా కాసినీ మానే!

అయితే మార్లిన్ మన్రో హృదయాన్ని చూసిన వారు లేరంటుం దామె. రెండు సార్లు చావటానికి విఫల ప్రయత్నం చేసింది. మూడోసారి ఆమె ఆత్మహత్య చేసుకుని ప్రశాంత నిద్ర పోయింది! ☆☆☆




అయాకత్‌షా కూర్పు నాయని మహేశ్వరరావు సమర్పణ పై నాగేశ్వర రెడ్డి

## పి ఎల్. నారాయణ దర్శకత్వంలో ముగ్గురు బాబాయి లు'

వినోదభరిత కుటుంబగాథ ఫిబ్రవరి మొదటి వారం నుంచి బాపట్ల పరిసరాలలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగిస్తాం నేను రాళ్లపల్లి వేలు ముగ్గురు బాబాయిలు నాయికా నాయకులుగా కొత్త తారలను పరిచయం చేస్తాం అన్నారు పి ఎల్ నారాయణ ఈయన స్క్రీన్‌ప్లే మాటలు దర్శకత్వంలో సి హెచ్ సూర్యనారాయణ నిర్మించే శైలూ క్రియేషన్స్ వారి పై చిత్రంలో నూతన్‌ప్రసాద్ కోట శ్రీనివాసరావు గొల్లపూడి మారుతీరావు పద్మనాభం హరిప్రసాద్ విద్యాసాగర్ పొట్టి ప్రసాద్ ముక్కురాజు టెలిఫోన్ సత్యనారాయణ మహాదేవ్ ప్రభ రమా ప్రభ శ్రీలక్ష్మి కె వి లక్ష్మి లక్ష్మిప్రియ కృష్ణవేణి కల్పనారాయ్ తతిమా నటవర్గం సూరిబాబు కథ జాలాది పాటలు జె వి రాఘవులు సంగీతం, కె గణేష్ సంయుక్త దర్శకత్వం దొండపాటి శ్రీనివాస్– జి మురళి ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు

## కె విశ్వనాథ్ దర్శకత్వంలో

ఏప్రిల్ నెలాఖరులోగాని మే నెలలో గాని ప్రారంభోత్సవం" అన్నారు డి వి ఎస్ రాజు ఈయన నిర్మించే డి వి ఎస్ ప్రొడక్షన్స్ చిత్రంలో కార్తీక్ సరసన అమల నాయిక కె విశ్వనాథ్ దర్శకుడు

## "చెట్టుకింద ప్లీడర్"

పిరికివాడైన ఓ ప్లీడర్‌ను అందరూ వంచన చేస్తుంటారు దానికి ప్రతిస్పందించిన ఓ అతివ సహచర్యంతో తెలివితేటలను లౌక్యాన్ని ఆ ప్లీడర్ ఎలా అలవర్చుకుంటాడన్నదే కథాంశం సజీవమైన హాస్యం ఉట్టిపడే చిత్రం అన్నారు వంశీ ఈయన దర్శకత్వంలో చంటి సమర్పించే సిరిసినీ చిత్రవారి పై చిత్రంలో రాజేంద్రప్రసాద్ శరత్‌బాబు విజయ చందర్ గొల్లపూడి మారుతీరావు తనికెళ్ల భరణి మల్లికార్జునరావు ఆనందమోహన్ కృష్ణభగవాన్, సి హెచ్ కృష్ణమూర్తి రావి కొండలరావు, ఊర్వశి, కిన్నెర పాత్రధారులు టెన్నిస్ జోసఫ్ కథకు తనికెళ్ల భరణి సంభాషణలకర్త వెన్నెలకంటి సీతారామ శాస్త్రి జొన్నవిత్తుల గీతాలు ఇళయరాజా సంగీతం హరి అనుమోలు ఛాయ, పేకేటి రంగా శిల్పం, వెంకట్ మద్దిరాల సహకార దర్శకత్వం, శివశంకర్ నృత్యాలు నల్లు రవి– బి. సత్యం ప్రొడక్షన్, అనిల్ మల్నాడ్ కూర్పుతో నందిగం సూర్య రవీంద్ర నిర్మాత జనవరి 21 నుంచి 31, ఫిబ్రవరి 18 నుంచి మార్చి 10 వరకు తిరుపతి పరిసరాలలో రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది, అన్నారు ప్రొడక్షన్ డిజైనర్ వేమూరి సత్యనారాయణ

## "రాజకీయ రణరంగం'

పరస్పరం విరుద్ధంగా ఉండే రాజకీయ శక్తుల రాజకీయం వల్ల యువ ప్రేమికులకు ఎలాంటి ఆటకం ఏర్పడింది వారి మధ్య ఎలాంటి సమస్యలు ఉత్పన్న మయ్యాయి చివరికి ప్రణయ సమస్య రాజకీయ సమస్యగా ఎలాంటి సంచలనం కలిగించిందనే ఇతివృత్తంతో రూపొందించ బడుతోంది," అన్నారు ఎం రాజశేఖర రెడ్డి ఈయన దర్శకత్వం వహించే సృజన ఆర్ట్స్ వారి పై చిత్రంలో శరత్, నవీన అనే నవ తారలు ప్రేమ జంటగా నటిస్తున్నారు నూతన్ ప్రసాద్ కోట శ్రీనివాసరావు కాంచన మనోరమ అనూరాధ అన్నపూర్ణ ఆలీ థమ్ గిరినాథ్ మదన్, డాక్టర్ శివప్రసాద్ పాల్గొంటున్నారు జాఫర్‌బాబు స్క్రీన్‌ప్లే తనికెళ్ళ భరణి మాటలు, సంపత్– సంగీతం కె హెచ్ రావు ఛాయ నిర్వహిస్తున్నారు జనవరి, ఫిబ్రవరి నెలల్లో షూటింగ్ పూర్తి చేసి ఉగాది కానుకగా అందించా లనుకుంటున్నాం అన్నారు నిర్మాత పై సోమశేఖర రెడ్డి నృత్యాలు ప్రకాష్– సురేఖ సాహసాలు పాపులర్ బాబూ సలహాదారుడు

## "ప్రజా తీర్పు"

సమాజంలోని సమకాలీన పరిస్థితులకు అద్దం పట్టే ఇతివృత్తం అన్నారు పోతునీడి కృష్ణ ఈయన దర్శకత్వంలో జి బి ఎస్ నాయుడు సమర్పించే వాసూ ప్రొడక్షన్స్ ప్రజాతీర్పు చిత్రంలో రాజశేఖర్ రజని చరణ్‌రాజ్ తులసి చిత్ర శుభలేఖ సుదాకర్ పి జె శర్మ హేమ సుందర్ నర్రా గరగ మల్లికార్జునరావు చిరంజీవి రాజా గోపినాయుడు చంద్రిక కల్యాణి చిలకరాద నటించారు ఎన్ కె బ్రదర్స్ మాటలు చక్రవర్తి స్వరకల్పనలో గొ౦ జాలాది పాటలు రాశారు సుదాకరరెడ్డి చాయ కృష్ణ శిల్పం శివసుబ్రహ్మణ్యం నృత్యాలు సాహుల్ సాహసాలు రాజగోపాల్ కూర్పుతో జయారెడ్డి బి సుబ్బారావు సహ నిర్మాతలు ఫ్రిబ్రవరి 18న విడుదల అన్నారు నిర్మాత బి బాస్కరరాజా

## రమేష్‌బాబుతో శ్రీ వెంకట పద్మావతి 2వ చిత్రం

డిసెంబర్ 29 నుంచి జనవరి 3 జనవరి 21 నుంచి 30 వరకు రెండు షెడ్యూల్స్ జరిపాం మూడవ షెడ్యూల్ ఫ్రిబ్రవరి 26 నుంచి మార్చి 20 వరకు అన్నారు డ శాశీ విశ్వనాథరావు ఈయన నిర్మించే శ్రీ వెంకట పద్మావతి వారి ద్వితీయ చిత్రంలో రమేష్‌బాబు రావు గోపాలరావు కోట శ్రీనివాసరావు దేవరాజ్ సుదాకర్ ప్రసాద్‌బాబు ఎ జె శర్మ కె కె శర్మ నిర్మల తార కుయిలీ పాత్రదారులు సత్యమూర్తి రచన హంసలేఖ సంగీతం బి చలం శిల్పం బరత్- రమణమూర్తి సంయుక్త దర్శకత్వం బి వి మూర్తి సహకార దర్శకత్వం. సుబ్బరాయన్ సాహసాలు రఘురాం నృత్యాలు దవళ చిన్నారావు- శారిక ప్రొడక్షన్ కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు డి అశోక్ నిర్వహణతో డి సత్యనారాయణరావు సమర్పించే ఈ చిత్రానికి ఎస్ ఎస్ రవిచంద్ర దర్శకుడు



# సినిమా

## జగపతి "సింహస్వప్నం"

జగపతిబాబు తెర ముందుకు కొత్త వాడైనా ఆంగిక వాచకాభినయాల్లో నాట్యంలో ఫైట్స్‌లో నిష్ణాతుడు అనిపించుకున్నాడు తొలి చిత్రంలోనే అందునా ద్విపాత్రలను ఇంత సామర్థ్యంతో నిర్వహించిన ఈ యువకుడికి ఉజ్వలమైన భవిష్యత్తు ఉంది అని అభినందించారు ఆశీర్వదించారు వి మధుసూదనరావు యూనిట్ లోని ప్రతి ఒక్కరూ విశేషమైన కృషి చేయడమే కాకుండా నాకిచ్చిన ప్రోత్సాహం సహకారం వల్లనే నాలో ఆత్మవిశ్వాసం మరింత పెరిగింది అంచేత ఈ చిత్ర ఘన విజయం యూనిట్ సభ్యులందరికీ దక్కుతుంది వీరికి ఏ మాత్రం పారితోషికం తీసుకోకుండా నేనో చిత్రాన్ని చేసి పెట్టడానికి నిశ్చయించాను ఇందులో తెలుగు ఫిలిం జర్నలిస్టుల సంఘానికి కూడా ఒక వాటా ఉంటుంది అన్నారు హీరో జగపతిబాబు ఇలా సభ్యులందరూ ఏకమై చిత్రాన్ని రూపొందిస్తే అనవసరమైన వ్యయ ప్రయాసలు తగ్గి మార్గ దర్శకం కాగలదు అన్నారు వి బి రాజేంద్రప్రసాద్ ఈయన భారీ ఎత్తున నిర్మించిన జగపతి ఆర్ట్ పిక్చర్స్ సింహ స్వప్నం చిత్రంలో కృష్ణంరాజు జయసుధ జగపతిబాబు శాంతిప్రియ వాణీ విశ్వనాథ్ గొల్లపూడి మారుతీ రావు రంగనాథ్ గుమ్మడి గిరిబాబు ఆహుతి ప్రసాద్ రమణమూర్తి చలపతిరావు రాజ్‌వర్మ తాతినేని రాజేశ్వరి అనిత నటించారు డి ప్రభాకర్ మాటలు ఆత్రేయ పాటలు చక్రవర్తి సంగీతం డి ప్రసాద్‌బాబు ఛాయ కుదరవల్లి శిల్పం సురేష్ కుమార్ సంయుక్త దర్శకత్వం సాంబశివరావు-సత్యం సహకార దర్శకత్వం ప్రకాష్ సురేఖ నృత్యాలు సాహుల్ సాహసాలు అక్కినేని సంజీవి కూర్పు ఉస్మాన్- వెంకటేశ్వరరావు ప్రొడక్షన్ నిర్వహించారు ఈ చిత్రంలోని ఆరు పాటలను ఎన్నిసార్లు విన్నా తనివి తీరదు

## "స్ట్రీట్ డాన్సర్"

యాక్షన్ సెంటిమెంట్ పుష్కలంగా ఉన్న చిత్రం అన్ని తరగతుల ప్రేక్షకులనూ విశేషంగా ఆకర్షించే ఇతివృత్తం అన్నారు ప్రముఖ నటుడు చక్రపాణి ఈయన నిర్మించిన స్ట్రీట్ డాన్సర్ చిత్రంలో అనూరాధ గీత డిస్కో శాంతి రామకృష్ణ వజ్రముని జై జగదీశ్ ఆదిగా గల వారు నటించారు రాజశ్రీ మాటలు పాటలు రాశారు విజయభాస్కర్ సంగీతం మురళి-రామయ్య కూర్పుతో శంకరన్ నాయర్ దర్శకుడు



# "భలే దంపతులు"లో భలే దబాయింపు

రాజా (రాజేంద్రప్రసాద్) ఉత్సాహంతో ఆఫీసర్ దగ్గరికొచ్చి ఇప్పుడు ఎక్స్‌పీరియెన్స్ కూడా వచ్చింది కదా? చాలా గొప్ప షార్ప్ అయ్యాను లెండి ఉద్యోగం ఇచ్చి చూడండి ఎంత షార్ప్ అయి రెచ్చిపోతానో మీర్తే చూస్తారు, అంటూండగా టెలిఫోన్ బెల్ మోగింది రాజా తృళ్ళిపడి ఇది తప్పకుండా ఎవరో మినిస్టర్‌గాడిదే నా ఉద్యోగం ఎగరగొట్టేస్తాడు అనుకుంటూ తానే రిసీవర్ అందుకున్నాడు హలో ఎవరు? నువ్వా నాన్నా- అనుకున్నా ఏమిటి నీ బామ్మర్దికి ఇవ్వాలా? చూడూ ఓట్లేసి గెలిపించింది ఇలాంటి వెదవ రికమెండేషన్స్ చెయ్యడానికి కాదు నాన్నా' నేనెవర్నా? ఇక్కడ జనరల్ మేనేజర్ పార్ధసారధిని పెట్టెయ్ ఫోన్' ఊఁ' అన్నాడు



"లైలా"లో సురేష్, రాశీసింగ్

అఫీసర్ బుర్ర గోక్కుంటూ ఏమిటి ఇది నీ బాబుగారి ఆఫీసులాగా ఫోన్‌లో మాట్లాడ్తావ్? పైగా నా పేరు చెప్తావ్? ఇంతకీ ఎవరు ఫోన్‌లో మాట్లాడింది?' అడిగాడు

హోమ్ మినిస్టరో' అని రాజా అనేసరికి ఆఫీసర్ తెల్లముఖం వేశాడు

ఎన్ రామలింగేశ్వరరావు సారధ్యంలో జి సత్య ప్రతాప్ బి సాయి శ్రీనివాస్ నిర్మించిన సాయిసుధా కంబైన్స్ బలే దంపతులు చిత్రానికి స్క్రీన్‌ప్లే దర్శకత్వం కోడి రామకృష్ణ సమర్పణ బి బుల్లి సుబ్బారావు తారాగణం ఎ ఎన్ ఆర్ రాజేంద్ర ప్రసాద్ గొల్లపూడి మారుతీరావు నూతన్ ప్రసాద్ కోట శ్రీనివాసరావు జయసుధ వాణీ విశ్వనాద్ రోహిణి చంద్రిక

## జి. వి. జి. గజిబిజిలు

### లోపలొకటి-పైకి మరొకటి!

కొందరు యధాలాపంగా పైకి మరోలా అనేస్తుంటారు.

మచ్చుకి-

"అరే! కాస్త సన్నబడ్డట్టున్నారే! ఇదివరకటి కన్నా బాగా యంగ్‌గా కనిపిస్తున్నారు, సార్!"

(లోపల: "సున్నపు పిడతలాంటి మొహమూ, పిప్పళ్ళ బస్తాలాంటి వొళ్ళూ వీడూనూ!")

"సంకోచించకండి. మీ సొంత ఇల్లనుకొని, కావలసిన వంటకాలు అడిగి వేయించుకొని, తృప్తిగా భోంచేయండి!"

(లోపల: "బానలాంటి పొట్ట, బకాసురుడులాంటి నోరూ వీడూనూ!")

### మహా పిసినారితనం

ఆ భార్యాభర్తల్లో ఒకరికి మించి మరొకరు పీనాసులు.

ఒక రోజు ఇల్లు వదలి వెళ్ళిన భర్త ఆదరాబాదరాగా తిరిగొచ్చి, కాలింగ్ బెల్ మ్రోగించాడు.

భార్య వచ్చి తలుపు తెరిచి ఏమిటని అడిగింది.

"గదిలో ఫాన్‌ను ఆఫ్ చేశానో లేదో అన్న సందేహం వచ్చి తిరిగొచ్చా," అన్నాడు భర్త.

"దానికి కాలింగ్ బెల్ మోగిస్తే కరెంటు ఖర్చవదూ? ఆ కిటికీ లోంచి చూస్తే పోలా? అయినా, దీని కోసం పనికట్టుకు తిరిగొస్తే మీ చెప్పులు అరిగి పోవూ?" అంది భార్య.

"ఆ సంగతి నాకు తెలుసే మొహమా!! అందుకే చెప్పులు చేతో తీసుకొచ్చా!" అంటూ రెండు చేతుల్లోని ఆ చెప్పులు చూపించాడు భర్త!

(గమనిక: పాఠకులు కూడా ఇలాంటివి పంపవచ్చు!)

## బాలకృష్ణ, కోడిరామకృష్ణల కాంబినేషన్

ఫిబ్రవరి 1 నుండి10 వరకు మొదటి షెడ్యూల్, అన్నారు ఎం ఆర్ వి ప్రసాద్ ఈయన నిర్మిస్తున్న వి బి ఆర్ట్ ప్రొడక్షన్స్ తొలిచిత్రంలో బాలకృష్ణ, రావుగోపాలరావు గిరిబాబు నూతన్‌ప్రసాద్ వేలు సుహాసిని రాజసులోచన, మమత చి కల్యాణ్ నందమూరి (హరికృష్ణ పుత్రుడు) చి విజయ పాత్రధారులు సత్యానంద్ మాటలు వేటూరి పాటలు రాజ్‌కోటి సంగీతం శరత్ ఛాయ శివసుబ్రహ్మణ్యం నృత్యాలు సాహుల్ సాహసాలు శ్రీనివాసరాజు శిల్పం, కె అమరేశ్వరరావు సంయుక్త దర్శకత్వం సత్యం- సుబ్బారావు ప్రొడక్షన్ తాతా సురేష్ కూర్పుతో కోడి రామకృష్ణ దర్శకుడు ●

# షేర్ మార్కెట్‌లో పెట్టుబడులు



—ఎన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

కొందరు పాఠకులు అడిగిన ప్రశ్నలకు వ్యక్తిగతంగా సమాధానాలు ఇవ్వలేక, ఈ వ్యాసంలో సమాధానాలు ఇచ్చేస్తున్నాను చాలామంది అడిగే ప్రశ్న ఏమంటే, మాకు ఈ షేర్ మార్కెట్ గూర్చి ఇంకా వివరంగా తెలుసుకోవాలని ఉంది వాటికి సంబంధించిన పుస్తకాలు వివరించండి అని

జవాబు బయట వారి సంగతి నాకు తెలియదు కాని, నేను పూర్తిగా పాలో అయ్యేది బొంబాయి నుంచి వచ్చే పార్చ్యూన్ ఇండియా అనే పత్రిక దీనిలో మీకు సమగ్రమైన స్టాక్ మార్కెట్‌ల వివరాలు వుంటాయి అంతేకాక వీరు ప్రతి సంవత్సరం ఒక ఆన్యువల్ నెంబర్‌ను విడుదల చేస్తారు ఇప్పటికి మూడు ఆన్యువల్ నెంబర్స్ వచ్చినాయి దీని వెల 20 రూపాయలు ఈ సంస్థకు మీరు వ్రాస్తే వారు మీకు పంపగలరు వాటిని ఒకరు చాలా కాలంగా అడుగుతున్న ప్రశ్న ఏమంటే (చార్ట్స్) గూర్చి టెక్నికల్ పొజిషన్‌ల గూర్చి వివరించ మంటున్నారు మరి ఇతర పుస్తకాలు ఏమైనా వుంటే చెప్పమంటున్నారు

జవాబు హేమంత్ దవి గారి పుస్తకాలు వున్నాయి ఇవి మీకు బొంబాయిలో దొరుకుతాయి ఇంకా వివరంగా కావాలంటే చార్లెస్‌డౌ గారి సిద్ధాంతాలు వున్న పుస్తకాలు కూడా మీకు బొంబాయిలో లభ్యమవుతాయి ఇంతేగాక మన యశస్వీ గారు వ్రాసిన పుస్తకాలు కూడా మీకు హైదరాబాదులో దొరుకుతాయి ముందు ముందు ఈ టెక్నికల్ పొజిషన్‌ను గూర్చి నా వ్యాసాలలో వివరించడం జరుగుతుంది

ప్రశ్న ప్రతి నెలా లేకుంటే పదిహేను రోజులకు ఒకసారి మీరు ఏవైనా బులెటిన్‌లు వ్రాసి మాకు అందివ్వ గలరా?

జవాబు ఇది చాలా కష్టమైన పని బులెటిన్ అన్నా, ఒక పత్రిక నడుపుతున్నంత శ్రమ పడవలసి వస్తుంది అటువంటి దుస్సాహసము చేయలేను మీకు కావాలంటే బొంబాయి నుంచి అర్థ్ఇన్వెస్ట్‌మెంట్స్ వారిది ఇటువంటి మాగజైన్‌లలో మేటిది దాన్ని చదవండి మిగతా వాటిమీద నాకు అంతఅవగాహన లేదు ఈ మధ్య హైదరాబాదు నుంచి హక్ అనే ఆయన కూడా ఒక బులెటిన్ నడుపు తున్నాను అని ఒకసారి రెండు కాపీలు పంపారు తరువాత అంతు లేదు కాబట్టి అర్థ్ వారిది మీకు ఉపయోగపడవచ్చునేమో పరిశీలించండి కాని వీటి మీద ఆధారపడి నిర్ణయాలు తీసుకోకండి ఎందుకంటే ఈ మార్కెట్టు క్షణక్షణాలలో జరిగే సంఘటనలకు ప్రతిస్పందిస్తుంది కనుక మీ తెలివి ఉపయోగించండి మీ అడ్రస్ మాకు ఇవ్వరా అని వ్రాసే వారికి ఒక శుభవార్త ఏమిటంటే ఈసారి నుంచి ప్రతి ఆర్టికల్‌లో నా యడ్రస్‌మీకు దొరుకుతుంది కాని ఒక్కటి గుర్తు పెట్టుకోండి నాతో పనులు చాలా లేటుగా అవుతుంటాయి నా వద్దనుంచి జరిగే ఈ పొరపాటును ఇప్పట్లో సరిదిద్దడానికి అవకాశం లేదు పలానా కంపెనీ మీకు డివిడెండ్ కాని (యాన్యువల్‌రిపోర్ట్) కాని పంపటం లేదు ఆ కంపెని ఉందా మునిగి పోయిందా అని వ్రాసేవారు మీ వద్ద వున్న ఆ షేర్ సర్టిఫికేట్ మీద ఆ కంపెనీ యడ్రస్ ఉంటుంది ఆ యడ్రస్‌కు వ్రాయండి ఆ రాష్ట్రంలో వున్న స్టాక్ ఎక్స్‌చేంజి వారికి కూడా కంప్లయింట్ ఇవ్వండి వారు మీకు వెంటనే సరైన సమాధానం కంపెనీ నుంచి రాబట్టి ప్రత్యుత్తరం పంపుతారు

ప్రశ్న నేను వివిధ కంపెనీల షేర్లు కొనాలీ అంటే ఎవర్ని ఎప్రోచ్ కావాలి?

జవాబు మీ దగ్గరలోవున్న స్టాక్ ఎక్స్‌చేంజ్ నెంబర్‌ని అతన్ని షేర్ బ్రోకర్ అని కూడా అంటారు

ప్రశ్న షేర్లు కొనేటపుడు ఎటువంటి ఖర్చులు ఉంటాయి?

జవాబు షేర్లు అమ్మినా కొన్నా బ్రోకరేజ్ ఉంటుంది ఇది 1.5– 3/ వరకు స్టాక్ ఎక్స్‌చేంజ్‌లను బట్టి, షేర్ బ్రోకర్లను బట్టి ఉంటుంది ఇదిగాక కొన్న షేర్లు మీ పేర ట్రాన్స్‌ఫర్ అవటానికి కంపెనికి పంపేటప్పుడు ప్రతి వంద రూపాయలకు 50 పైసలు చొప్పున షేర్ ట్రాన్స్‌ఫర్ స్టాంప్స్ అనే ప్రత్యేక స్టాంపులు భరించవలసి ఉంటుంది ఇంతకు మించి ఖర్చు లుండవు షేర్లు ఫుల్లీ పెయిడ్ అయిన తరువాత ఫుల్లీ పెయిడ్ అని చెప్పి కంపెనీ సీల్సు కోసం ఆథరైజుడ్ సిగ్నేటరీ సంతకం కోసం కంపెనీకు పంప వలసి ఉంటుంది. ఇలా పంపేటప్పుడు షేర్ ట్రాన్స్‌ఫర్ స్టాంప్స్ అవసరము లేదు.

ప్రశ్న: మనీ పే చేయగానే షేర్ సర్టిఫికట్స్ ఇస్తారా? పాత షేర్లు కొన్న సమయములో అవి ఒరిజినల్స్ అనే నమ్మకం ఏవిధంగా నిర్ధారణ చేసుకోవాలి?

జవాబు సాధారణంగా పబ్లిక్ ఇష్యూల కోసం అప్లైచేసి డబ్బు కట్టినప్పుడు ఎంతలేదన్నా 3–5 నెలలు పడుతుంది సర్టిఫికట్ రావటానికి ఢిల్లీ, మద్రాసు, హైదరాబాద్‌లలో మీరు కొన్న షేర్లు21–30 రోజుల లోపు చేరుతాయి ఒక్క సమస్య ఏ గ్రూప్ అనేవి కొంటే షుమారు 2–3 నెలలు లేట్ అవ్వటానికిఅవకాశం వుంది

పాత షేర్లు ఒరిజినల్ లేక డూప్లికేట్‌లు అన్నవి ఎలా తెలుస్తాయి అన్నారు కదూ! సాధారణంగా షేర్లు బ్రోకర్లు వారికున్న మోనోపలీ మూలంగా క్లైంట్‌కి ఇచ్చే ధరలలో చాలా మోసం చేస్తూ ఉంటారు ఇలా చేయనివారిని వ్రేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు వారిక ఈ మోసములో వచ్చే డబ్బుముందు డూప్లికట్ల బిజినెస్ దిగదుడుపే కాబట్టి దానిమీదకు ధ్యాస పోదు ఆ విషయంలో మీరు నిర్భయంగా ఉండొచ్చు ఖర్మకాలి ఇలా జరిగిన వారిని తేలికగా పట్టుకొనే ఏర్పాట్లు ఉన్నాయి భయంలేదు

ప్రశ్న షేర్లు కొన్న ఎంతకాలం తర్వాత అమ్మవచ్చు? ఎవరి ద్వారా అమ్మాలి?

జవాబు షేర్ కొన్న క్షణం నుండి ఎప్పుడైనా అమ్మవచ్చు కాని పబ్లిక్ ఇష్యూల ద్వారాకాక ప్రమోటర్స్ కోటాలను అమ్మరాదు వాటిని 3 సంవత్సరాల వరకు అమ్మ కూడదు అన్న రూలు వుంది

ప్రశ్న ఒక్కొక్క కంపెనీ షేర్లు మినిమమ్ ఎన్ని కొనవచ్చు?

జవాబు 100 రూపాయలవి అయితే 5 షేర్లు 10 రూపాయలవి అయితే 50 షేర్లు తీసుకోవాలి కాని 1987 నుండి 10 రూపాయలవి 100 షేర్లు తీసుకోవలసి వస్తోంది

ఇంకా దీనిలో చిన్న చిన్న ప్రశ్నలు కొన్ని వున్నాయి ఇలాగ ఒక్కొక్క లెటర్‌లో అనేక ప్రశ్నలు పంపుతూ, వారి వారి సెల్ఫ్ అడ్రస్ కవర్లు పంపుతున్న పాఠకులకు ప్రత్యుత్తరం ఇవ్వటానికి చాలా కష్టపడుతున్నాను అందరికీ ఉపయోగ పడతాయి అనుకున్నవి ఇలా ఆర్టికల్స్‌లో వ్రాస్తాను సెల్ఫ్ అడ్రస్ కవర్లు పంప నక్కర్లేదు

ప్రశ్న షేర్లు ఎక్కువగా అమ్ముతూ కొంటూ వుంటే లాభమా లేకుంటే నిల్వ వుంచితే మంచిదా?

జవాబు నిల్వ వుంచటం, అమ్మటం అనేవి ముఖ్యంకాదు లాభములో వుంటే అమ్మి లాభం పొందాలి అంతే ●




**డి. ఎస్. గండిగుంట**

★ మనిషి జీవితంలో దేనికి తల వంచుతాడు?

● అవసరానికి

★ మనిషిని మంచివాడని ఎప్పుడు అంటారు?

● మరణించిన తరువాత

**ఎ. ఆర్. ఆర్. హైదరాబాదు**

★ ఏది సుగుణం? ఏది కాదు?

● చెప్పడం కష్టం ఒక్కొక్కప్పుడు కొరకంచు లాంటి నీతి- సుగుణం కంటే సర్దుకు పోయే- అవలక్షణం మెరుగనిపిస్తుంటుంది చూడలేదా?!

**ఆర్. గుంటూరు**

★ వివాదాస్పదంగా మారిన అందాల పోటీలు ఎందుకు?

● వ్యాపారాభివృద్ధికే వివాదం యింకా దోహదకారి అవుతూంది

**కె. ఎస్. చిలకలూరిపేట**

★ ఇప్పటికి మీరు రాసిన నవలలు ఎన్ని?

● చాలానే రాసి ఉంటాను ఎప్పటికప్పుడు లెక్కలు పెట్టుకోడం అలవాటు కాలేదు

**బి. వి. ఆర్. ఎమ్. రాయగడ**

★ పరువునష్టం బిల్లుపైమీ అభిప్రాయం దేనికి?

● పరువున్న వారికోసం గాని మన రాజకీయ నాయకుల కలాంటి బాదం లేదు కనుక అనవసరమేననిపిస్తుంది నాకు

**ఆర్ కె. ఎ రాయగడ**

★ మన జీవితమునకు సుఖము అనేది ఎప్పుడు కల్గుతుంది అక్కయ్యా?

● నీకు నువ్వే సుఖానికిచ్చుకునే నిర్వచనాన్ని పట్టి వుంటుంది- తమ్ముడూ- సుఖం

**వి. బి. ఆర్. విజయనగరం**

★ పదిహేనేళ్ల క్రితం అడిగిన ప్రశ్నే మళ్లీ అడుగుతున్నా- అందరికీ సమాధానాలిచ్చే మీ సమస్యలకు సమాధానం ఎవరిస్తారట?

● అబ్బ' మారని మనిషి నిన్నాళ్లకి చూశాను' పదిహేనేళ్లలో కొంచెం కూడా మీ బుర్ర ఎదగలేదు'- ఇవి అభిప్రాయాల కలబోత గాని- సమస్యల పరిష్కారం కాదు

**ఎ. ఎస్. సి. హెచ్. అయిజ**

★ పురుషాధిక్యం కల వర్తమాన పరిస్థితిలో స్త్రీ మనుగడపై మీ అభిప్రాయం?

● ఇంటా బయటా కూడా దారుణంగా వుంది

★ అహంకారానికి మారు పేరు స్త్రీ అనడం ఎంతవరకు సమంజసం?

● మీకు తెలియదా- ఆ వ్యూహకి ఆధారమే లేదని?

**పి. ఎన్. ఆర్. తిరుపతి**

★ ఒలంపిక్ పోటీలలో ఆకలి పోటీలు పెడితే మనకి గోల్డ్ మెడల్ వస్తుందా?

● రాదు అక్కడిదాకా వెళ్లాక ఆకలెక్కడ?!

**విజయ. మద్రాసు**

★ తెలుగు సినిమాలు చూడని మీరు వాటిని తక్కువ చేసి మాట్లాడడం- తగదు అరవ సినిమాలు అధ్వాన్నం కాదు అన్నారు నిజం మీరలా అని వుంటే మరో వారానికి మీ జవాబులు ప్రచురించబడేవి కావు అరవలు అంత స్వాభిమానులు

● అలాగా?! ఏం తెలుగు సినిమాలలో ఈ మధ్య వచ్చిన మనమైనవేమిటవి? అరవ సినిమాలూ వున్నాయి అధ్వాన్నంవి కాని మన రేషియోకీ- వాటికీ చాలా తేడా వుంది మీరు గమనించండి

**ఇ కె. పి. ఖమ్మం**

★ రాత్రిపూట కుక్కలకు దెయ్యాలు కన్పిస్తాయట నిజమేనా?

● తెలియదు మా టైగీ నడగాలి' ●

# మంత్రిగారొస్తున్నారు!

చేటపర్తి రమాబంధురావు

'మంత్రిగారు వస్తున్నారు! మంత్రిగారు వస్తున్నారు!'

**ఊరంతా అదేమాట! పదేపదే** చెప్పుకుంటున్నారు జనం.

సత్యం మాస్టారి దొడ్డిచుట్టూ కంచెవేస్తున్న వీరన్న కూడా అదేమాట అన్నాడు.

"ఇందులో పెద్ద విడ్డూరమేముంది వీరన్నా! మంత్రులు ఊరూరా తిరుగుతూనేవుంటారు. తప్పిజారి ఈ వూరివైపోసారి ముఖం చూపిస్తున్నారేమో!" అన్నాడు సత్యం. ఊళ్ళోవాళ్ళు గొప్పగా చెప్పుకోవాల్సినంత వింతకాదని కొట్టిపారేస్తూ.

"అబ్బే, అట్టాగనమోకండి మాట్టారూ! మనూళ్ళోకి ఓ గొప్పోడంటూ ఎప్పుడేనా అడుగిడితేనా?" అంటూ పాతచరిత్ర చెప్పుకొచ్చాడు వీరన్న. "ఎప్పుడో కొన్ని శతాబ్దాలక్రితం ఎవరో మహారాజావారు వేటకివెడుతూ విశ్రాంతికోసం వెంకటాపురంలో విడిది చేసారట! అంతే, ఆ తర్వాత బ్రిటిషువాళ్ళ పరిపాలనలోను – ఇటు స్వాతంత్ర్యం వచ్చాక కూడా కలెక్టరు మాట దేవుడెరుగు – **తహశీల్దారు కూడా ఆ వూరి పొలిమేరలు తొక్కలేదు. అలాంటిది ఇప్పుడు సరాసరి మంత్రిగారే ఆ వూరికి దిగివస్తున్నారంటే అది విడ్డూరం కాదామరి!**

**"ఈ నాల్గు రోజులూ మీరూళ్ళో లేరుగా! అందుకని మీ** కన్ని సంగతులూ **తెలియవు.** మనవూరికి దగ్గర్లోనే పేపరు ఫ్యాక్టరీ పెట్టబోతున్నారట! దానికి శంకుస్థాపన చేయటానికనే మంత్రిగారు వస్తున్నారు!" అంది మాస్టారి శ్రీమతి శాంతి వంటింట్లోంచి బయటకువస్తూ.

"అంటే, ప్రెసిడెంటుగారి ఆధ్వర్యంలో నేగా?"

శాంతి నవ్వింది. "అవును. కాకపోతే, ఈ వూళ్ళో అంతంత ఘనకార్యాలు చేపట్టే వాళ్ళెవరున్నారు?"

"ఫేక్టరీ వొచ్చిందంటే వూరు రూపమే మారిపోద్ది కదండీ!" అన్నాడు వీరన్న ఎంతో సంబరపడిపోతూ.

సత్యం మాస్టారు ఆలోచనలో పడ్డాడు నిజంగా ఊరి రూపం మారిపోతుందా?

స్వతంత్రంవచ్చి నలభై సంవత్సరాలయింది. దేశంలో అనేకచోట్ల డాములు కట్టారు. ఫ్యాక్టరీలు పెట్టారు. ప్రణాళికలు చేపట్టారు. గతంలో అన్నీ దిగుమతులే! ఇప్పుడు కొద్దో గొప్పో ఎగుమతులూ అవుతున్నాయి. సామాన్యుడికి కొనుగోలు శక్తి కొరవడిందే తప్ప తిండికీ బట్టకీ లోటులేదు. రైళ్ళు, బస్సులు, విమానాలు, పోస్టాఫీసులు, టెలిఫోన్లు, రేడియోలేకాదు – వూరూరా ఇప్పుడు టి.వి.లు కూడా వచ్చేసాయి.

నిజమే! దేశం ఎంతో అభివృద్ధిచెందింది. పరిపాలకులు పట్నాల్లో వున్నారు. ఎదురుగావున్నవాళ్ళ గురించే ఎక్కువ ఆలోచనలు వస్తాయి. పట్నాల్లో వుండే ప్రజల కందుకే ఎన్నో సదుపాయాలు సమకూరుతున్నాయి. తమ ఆర్థిక స్తోమతు పెరిగిందని పట్నవాసులు సంబరపడుతూండి వుండచ్చు. కాని, దేశం అంటే పట్నం మొక్కటేనా? కాదుకదా!

దేశంలో నూటికి ఎనభైపాళ్ళు పల్లెటూళ్ళు, పట్నాల్లో వుంటున్న సదుపాయాల్లో వందో వంతయినా పల్లెటూళ్ళకి చేరుతున్నాయా? అలా చేరుతుంటే – కనీసావసర వస్తువుల కోసం వారం వారం పల్లెటూరివాళ్ళు పట్నాల్లోని సంతలకి ఎందుకు వెళ్ళవల్సి వస్తోంది? పల్లెటూళ్ళలో పరిస్థితులు బాగుంటే సన్నకారు రైతులు, కూలీలు కొంప గోడు అమ్ముకొని పట్నాలకి వలసపోవల్సిన కర్మేమిటి? పరిస్థితులు ఎంత గడ్డుగా ఉండకపోతే పుట్టిపెరిగిన వూరిని వదిలిపెట్టి పోవాలని ఎవడయినా అనుకుంటాడు. స్వతంత్రం వచ్చాక దేశంలో ఎదుగూ బొదుగూ కనిపించని పల్లెటూళ్ళకి ప్రతీకలా నిలిచింది వెంకటాపురం!

అనాదిగావున్న మట్టి రోడ్లు అలాగే వున్నాయి. ఇదివరకు నల్లమట్టి..... ఇప్పుడు ఎర్రమట్టి – అంతే తేడా! పేరుకు ఊళ్ళో కరెంటుపెట్టారు. ప్రెసిడెంటుగారి లాంటి పెద్ద కామందుల లోగిళ్ళలో మినహా సామాన్యుల ఇళ్ళల్లో ఈనాటికీ కిరసనాయిలు బుడ్లే గతి! వీధి దీపాలు వున్నాయి. ప్రెసిడెంటుగారింటి ముందున్నదీపస్తంభం తప్ప తక్కిన వేవీ వెలగవు! ఊరికి ఒక్కటే చెరువు. ఓపెడ మనుషులు మంచినీళ్ళు తాగుతుంటే – మరోపెడ పశువులు ఈతాలాడుతుంటాయి. వేసవి వస్తే ఆమాత్రం నీళ్ళకి కూడా గతిలేదు! ప్రెసిడెంటుగారి కోటలో బోరింగు పంపుంది. వాళ్ళింట్లో నీటికి

లో టులేదు!ఇక ఊళ్ళోవాళ్ళమధ్య సయోధ్య ఎలావుంది?

ఇదివరకు పాడి సమృద్ధిగావున్న ఇళ్ళల్లో పశ్వుండి బుట్టని పిలిచి ఊరికినే పల్ల పోసేది ఇప్పుడు డబ్బు లిస్తానన్నా పోయనంటోంది. ఎందుకంటే పాలబిందెలవాళ్ళు ఎక్కువ డబ్బు లిచ్చి పట్నంలోని హోటళ్ళకోసం పాలు పట్టుకుపోతున్నారు. పల్లెలో చిక్కని పాలు ఎతికిపోసిన వెంకయ్యే పట్నం పనిమీద వెళ్ళినప్పుడు హోటల్లో నీళ్ళ టీ త్రాగి కిక్కురుమనకుండా వెనక్కు వస్తున్నాడు!

కూర తోటల పక్కనుంచి పోతూంటే "ఏమిటి బావా" అని పలకరిస్తే చాలు – "చెల్లెమ్మ కియ్యి" అని పంకాయలో. దొసకాయలో ఇచ్చేవాళ్ళు. అది గతంలో సంగతి! ఇప్పుడు 'వంగతోటలో బావ కాదు' అన్న సామెతని అక్షరాలా పాటిస్తున్నారు నిగనిగలాడే దొసకాయలు పట్నం పట్టుకువెళ్ళి అమ్ముకున్న భీమన్న వాడిపోయిన పుచ్చొంకాయలు కిమ్మనకుండా కొనుక్కు తెచ్చుకుంటున్నాడు!

పల్లెటూళ్ళలో వుండే ఆప్యాయతలూ – ఇచ్చిపుచ్చుకొనే అవినాభావ సంబంధాలు అన్నీ అడుగంటిపోయాయి. పట్నాల్లో వుండే 'కమర్షియల్ మెంటాలిటీ' పల్లెటూళ్ళక్కూడ అంటువ్యాధిలా వ్యాపించిపోయింది.

ఇదే ఒక 'అభివృద్ధి' అని అనుకుంటే – వెంకటాపురం కూడా అభివృద్ధికి వచ్చిందనే చెప్పాలి! అలా అనుకొనేసరికి సత్యం మాస్టారికి నవ్వొచ్చింది.

"ఏటి మాట్టారూ నవ్వుతున్నారు. ఊరు మారదంటారా?" అన్నాడు వీరన్న.

"ఎందుకు మారదు? ఇంతవరకూ మారింది ఇంకా మారుతుంది.'

మాస్టారి మాటల్లోని వ్యంగ్యార్థాన్ని అర్థంచేసుకొనే శక్తి వీరన్నకి లేదు.

"ఫ్యాక్టరీ వచ్చిందంటే తార్రోడ్డు పడుతుంది. కరెంటు దీపాలు పెడతారు. బస్సులు పడతాయి. చదువుకున్నవాళ్ళకి దగ్గర్లో ఉద్యోగాలు దొరుకుతాయి. కూలివాళ్ళు కూడా టౌనుకి పోనక్కర్లేదు. ఫ్యాక్టరీ రావటంవల్ల నిజంగానే



ఇదీవరస... బాపు













## మంత్రిగా రొస్తున్నారు

ఊరివాళ్ళకి లాభంవుంది. కాదంటారా?" అంది శాంతి.

"నీలాగే వూళ్ళో చాలామంది కలలు కంటూండవచ్చు కాని, కలలు నిజమవుతాయా?"

"మరీ హడలకొట్టకండి" అంది శాంతి పరిహాసంగా.

"మైలు పొడుగువున్న రోడ్డుకి పది లారీల మట్టిపోసారు. ఏటేటా నీటికిబ్బంది పడుతున్నామని తెల్సికూడా మూడేళ్ళనుంచి చెఱువు బాగు చేయించలేదు. పంచాయితీ కని టి.వి. సెట్టు కొన్నారు. వాళ్ళింట్లో టి.వి. పాడయితే ఇది పట్టుకుపోయారు. ఇలా చెప్పుకుంటూపోతే ప్రెసి డెంటుగారి ఘనకార్యాలగురించి ఓ పెద్ద లిస్టు చదవచ్చు. పదేళ్ళుగా ప్రెసిడెంటుగా వున్నాడు. పన్నులు ఠంచనుగా వసూలుచేయటం తప్ప, ప్రజలకోసం ఆయన చేసిందేమిటో చెప్పు! అలాంటి మహానుభావుడి చేతుల్లోకి ఈ ఫ్యాక్టరీ వస్తోందంటే ఊరి కుపకారం జరుగుతుందని ఎలా అనుకుంటు న్నావు?"

"అంతేనంటారా బాబూ!" అన్నాడు వీరన్న దిగాలుపడిపోతూ.

"మిగతా సంగతులు అటుంచు. మనవూరి స్కూలు సంగతే తీసుకో! గోడలుకి సిమెంటు లేకపోతే పోయె. పైన తాటాకులు మార్పించి ఎన్ని సంవత్సరాలయింది? ప్రహరీగోడలు లేకపోతేపోయే – కనీసం కంచేనా వేయించారా? ఊళ్ళోవాళ్ళంతా చెత్తపట్టుకువచ్చి స్కూలుపక్కనే పెద్ద పెంటకుప్ప పెడుతుంటే తనకేం పట్టనట్టు వూరుకుంటున్నా డాయన! తన పిల్లలు పట్నంలో చదువుతున్నారు. ఊరివాళ్ళ పిల్లలు ఎలాపోతే తనకేం?అదేగా ఆయన దృష్టి!ఇలాంటి పరిపాలకులున్నప్పుడు ఊరెలా బాగుపడుతుంది?"

అందిందనుకున్న సంపద లిప్త కాలంలో చేజారిపోయినట్టు క్రుంగిపోయాడు వీరన్న. మౌనంగా కంచెపనిలో పడిపోయాడు.

"ఏమయినా ఫ్యాక్టరీ అంటూవచ్చాక ఊళ్ళో పరిస్థితులు మెరుగుపడకపోవు" అంది శాంతి.

"ప్రెసిడెంటుగారు నిన్ను ప్రత్యేకంగా పిల్చి భరోసా ఇచ్చారాయేం?" అని వేళాకోళం చేసాడు సత్యం.

ఆమె ముఖం ఎర్ర నయింది.

"అదికాదు. అసలు పల్లెటూళ్ళకి దగ్గరగా ఫ్యాక్టరీలు పెట్టటంవల్ల పల్లెలు అభివృద్ధి చెందుతాయి – ఉద్యోగావకాశాలు పెరుగుతాయి – సామాన్యుడి ఆదాయం పెరుగుతుంది. ఇదేగా ప్రభుత్వమూ, ఎకనమిస్టులూ అందరూ చెప్పేది! మీ రదేమీ జరగదని అంటారేమిటి?"

"బలేదానివే! అదేమీ జరగదని నే నెక్కడన్నాను? మన ప్రెసిండెంటుగారి లాంటి పెద్దమనుషుల చేతుల్లోకి వెడితేనే అది జరగదని అంటున్నాను! రే పాయన మంత్రిగారికి ఘనంగా స్వాగతం చెప్పేదంతా దేనికి? ఫ్యాక్టరీకి పర్మిట్ దొరికిందనేగదా! అంటే, బ్యాంకుల్లో లక్షలమీద అప్పు దొరుకుతుందన్నమాట! ఇక ఫ్యాక్టరీ కట్టుబడిలోను – రోడ్డు కంట్రాక్టులోను తనచేయి వుంటుంది. ఫ్యాక్టరీకి కలప కావాలి. అంటే చుట్టుపక్కల చిట్టడవులు కొట్టేయ టానికి లైసెన్సు దొరుకుతుంది. కొన్ని కర్రలు అడితీలకి అమ్ముకొని చాటుగా డబ్బు చేసుకోవచ్చు. రేపు ఫ్యాక్టరీలో ఉద్యోగాలు వేయించేదీ తనే!అంటే, ఆయన ముట్టిందల్లా బంగార మన్నమాట!"

శాంతి కళ్ళప్పగించి వింటోంది.

"... అంతేకాదు. ఆ తర్వాత ఒకవేళ మిస్ మేనేజ్‌మెంట్‌వల్ల ఫ్యాక్టరీ మూతపడినా ఆయనకి భయంలేదు. బ్యాంకు అప్పులన్నీ రైటాఫ్ చేయించుకోవచ్చు. మంత్రిగార్ని ఇంతదూరానికి తీసుకువచ్చి యింత హంగామా చేస్తున్నాడంటే

ముందరకాళ్ళకి ముందే బంధంవేస్తున్నా డని అర్థంకాదా!"

"అబ్బ, మీరు చాల దూరం ఆలోచిస్తారు!"

"నేనుకాదు. ప్రెసిడెంటుగారే ఎంతో దూరం ఆలోచించి ఈ ప్రణాళిక చేపట్టారు" అని గలగల నవ్వాడు సత్యం.

నవ్వకుండా ఉండలేకపోయింది శాంతి. "అసాధ్యుడు!"

"అవును. ప్రజలు అజ్ఞానంతో వున్నంతకాలం..... తమకూ కొన్ని హక్కులు వున్నాయని తెల్సుకో లేనంతకాలం.... ఇలాంటి పరిపాలకులకి ఆడింది ఆట! పాడింది పాట!సాధ్యంకానిదంటూ ఏదీలేదు!"

వాళ్ళంతా మాటల్లో వుండగానే కిష్టయ్య మాణిక్యాన్ని వెంటబెట్టుకొని వచ్చాడు. "మంత్రిగారొచ్చేనాడు అంతా కొత్తబట్టలేసుకొని రావాలని హెడ్మాస్టారు చెప్పారండీ! అమ్మతో చెపితే నమ్మటంలేదండీ!" అన్నాడు.

తండ్రి ఎదురుగా తల్లి నమ్మటంలేదు – అని అంటున్నాడంటే – 'నాన్నా' నువ్వైనా నమ్ము అని అంటున్నట్టేకదా! కిష్టయ్య తెలివితేటలకి ఆశ్చర్యమూ కలిగింది, వీరన్న అమాయకంగా చూస్తూంటే నవ్వూ వచ్చింది – సత్యం మాస్టారికి.

"పెద్దపండక్కి కుట్టించాడు బాబూ! అత్తమానం కొత్తబట్టలు కావాలంటే ఆడుమాత్రం ఏడనించి తెత్తాడు?" అంది మాణిక్యం.

"నీ కొడుక్కి నేను కుట్టిస్తాలేవే మాణిక్యం!" అంది శాంతి.

భార్య అలా అన్నందుకు సత్యం మాస్టారికి ఎంతో సంతోషమయింది. "మంచిమాటన్నావు!"

"అదేంటిబాబూ! మీరు కుట్టించటమేంటి?" అంది మాణిక్యం సిగ్గుపడుతూ.

"మీ ఆయన కంపకొట్టుకొచ్చి దొడ్డిచుట్టూ కంచె కడుతున్నాడు. డబ్బు పుచ్చుకోమంటే పుచ్చుకోడు. నీ మొగుడింత చేయగాలేంది మేమీ మాత్రం చేయకూడదా?" అంది శాంతి.

ప్రెసిడెంటుగారి తాత దగ్గర వీరన్న తండ్రి వందరూపాయిలు అప్పు పుచ్చుకున్నాడు. అది నలభై సంవత్సరాల క్రితంమాట! ఆ అప్పు తీర్చలేక ప్రెసిడెంటుగారి తాతగారికి ప్రెసిడెంటుగారి తండ్రిగారికి చాకిరీ చేసి ఆ ఋణ భారం అలా వుండగానే చచ్చిపోయాడు. వడ్డీతో అదిప్పుడు వేలమీదికి చేరుకుందిట! అది తీర్చలేక ప్రెసిడెంటుగారి కొట్టంలో వెట్టిచాకిరీ చేస్తున్నాడు వీరన్న. ఈ సంగతి తెల్సినప్పుడు సత్యం మాస్టారి మనస్సు చివుక్కుమంది! ఇలాగే చాకిరీ చేసుకుంటూపోతే ప్రెసిడెంటుగారి కొడుక్కి కిష్టయ్య – ప్రెసిడెంటుగారి మనవడికి కిష్టయ్య కొడుకు.... ఇలా తరతరాలుగా వెట్టిచాకిరీ చేసుకుంటూ పోవల్సిందే కాని ఆ అప్పు తీరటం అంటూ వుండదు. ఇంతకాలంగా వీరన్న తండ్రి, వీరన్న చేసిన చాకిరీకి న్యాయంగా ఆ అప్పు ఎప్పుడో తీరిపోయివుంటుందని సత్యం మాస్టారు చెప్పేవరకూ తోచనేలేదు అమాయకుడు వీరన్నకి. ఇప్పుడు తెల్సినా ఆ మాట ప్రెసిడెంటుగారితో అనే ధైర్యమూలేదు.

పదేళ్ళయినా నిండని కిష్టయ్య తండ్రితోపాటే కూలిపనికి వెళ్ళటం ప్రారంభించాడు. అంటే, ఆ పసివాడికి తెలియకుండానే ప్రెసిడెంటుగారి 'జమిందారీ'లో ఊడిగం మొదలయి పోయిందన్నమాట! సత్యం మాస్టారు మూడేళ్ళక్రితం వెంకటాపురం ఉద్యోగం మీద వచ్చినప్పుడు కిష్టయ్య గురించి తెల్సుకున్న సంగతి అది! 'వెట్టిచాకిరీ' నుంచి వీరన్నకి విముక్తి కలిగించ లేకపోయినా – కనీసం, కిష్టయ్య భవిష్యత్తు నయినా తీర్చిదిద్దగలిగితే ఈ ఘోరానికి ఒక అంతం అంటూ వుంటుందేమో ననుకున్నాడు. అందుకే మాణిక్యాన్ని, వీరన్నని కూర్చోపెట్టి వాళ్ళే ఊబిలో కూరుకుపోయారో చెప్పి.... కిష్టయ్యచేత కూలిపని మాన్పించి బళ్ళో చేర్పించాడు.

వీరన్న కొడుకుని బళ్ళో వేసాడని విని 'ఊళ్ళేలతాడా! ఉద్యోగం చేస్తాడా!' అని ప్రెసిడెంటుగారితో సహా చాలమంది గేలిచేసారు. ఎవరిమాటలు ఎంత నొప్పించినా సత్యం మాస్టారి మాట వేదమనుకొని కొడుకుని విధి తప్పకుండా బడికి పంపించటం మొదలుపెట్టాడు



## అమితాబ్ అంతే సంగతులా?

అమితాబ్ బచ్చన్ వంటి ప్రముఖ నటులతో తీసిన చిత్రాలు అనుకున్నంతగా విజయం సాధించక పోవటంతో హిందీ చిత్ర పరిశ్రమ ఆందోళనకు గురైంది. బచ్చన్, మిథున్ చక్రవర్తి వంటి అగ్ర నటులతో 3 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించిన "గంగా– జమున– సరస్వతి" చిత్రం నిర్మాతల ఆశా సౌధాలను మొదటి రోజునే కుప్పకూల్చి వేయటంతో అగ్రనటుల వల్ల చిత్రం విజయవంతం కాగలదన్న నిర్మాతల అభిప్రాయం వమ్ము అయింది. కాని ఫిబ్రవరిలో విడుదలయ్యే 'తూఫాన్' చిత్రంపై యింకా ఏ మూలనో నిర్మాతల ఆశలు చిగురిస్తున్నప్పటికీ పరిశ్రమలో అలముకున్న చీకట్లు తొలగిపోలేదు. మరి నిర్మాతల ఆశలు ఏ మేరకు ఫలిస్తాయో! అమితాబ్ సాబ్ ఏమంటారో?–

వీరన్న.

ఆలస్యంగా బడిలో వేయించినందువల్ల అంతా కష్టయ్యని వెళాకోళం చేసేవారు. అందుకని తమ యింటిదగ్గర కూర్చోపెట్టి చదువుచెప్పాడు సత్యం కిష్టయ్య చురుకైన కుర్రాడు. ఈ మూడేళ్ళలో పట్టుదలగా చదివాడు తత్ఫలితంగా నాల్గు క్లాసులు దాటవేయించగలిగాడు సత్యం

మాణిక్యానికి, శాంతి, సత్యం మాస్టారు – దేవత, దేవుడు క్రిందలెక్క! తమ దాస్య విముక్తి కోసమే వాళ్ళసలా వూరు వచ్చారని మాణిక్యం అనుకుంటూంటుంది మాటల్లో కృతజ్ఞత చెప్పలేక పోయినా – పిలవకుండానే వచ్చి శాంతి కాపనీ ఈపనీ చేసిపెట్టి పోతూంటుంది!

ఆమె తన కొడుక్కి బట్టలు కుట్టిస్తానంటే బిడియపడిపోయింది.

"కుర్రగోడికి ఊర్కినే సదువు సెపుతున్నారు. మేమెంత సేసినా మాట్రుగారి ఋణం తీరుద్దామ్మా!" ఎన్నో మాటల్లో చెప్పాలనుకుంది మాణిక్యం. కాని, అది చెప్పలేక పోయినా దానికళ్ళల్లో తళుక్కుమన్న తడిని చూసి అర్థంచేసుకున్న ఆ దంపతుల హృదయాలు ఆర్ద్రతచెందాయి

వెన్నెల కురుస్తున్నచోటికి నల్లమబ్బులా వచ్చాడు ప్రెసిడెంటుగారి పాలేరు – 'ఒర్రి ఊరంతా ఎతుకుతున్న – ఈడున్నవా?" అన్నాడు.

'దేనికి?" అన్నాడు వీరన్న.

"అయ్యగారు నిన్ను లాక్కురమ్మన్నారు" ప్రెసిండెంటుగారి అసలు సిసలైన నౌకరు వా రేమన్నారో నదురుబెదురులేకుండా అప్పచెప్పగల ధీమంతుడు.

"పనోలవున్నా కనపడ్డంలే?" అన్నాడు వీరన్న చిరాగ్గా.

"ఓ ర్రియవ్వ! మంతిగా రొత్తున్నారు కదా! పందిళ్ళెయ్యాల, గాడి పొయ్యిలు తవ్వాల, కోళ్ళని కొయాల, ఆడ బోల్డన్ని. పనెట్టుకొని నువ్వీడ కూకుంటే ఎట్టాగురా!'

వాడలా మాట్లాడ్డం దుర్భరంగా వున్నందుకుకాదు – వీరన్నని ఇబ్బందిపెట్టటం యిష్టంలేకనే "పోనీ, నువ్వెళ్ళు వీరన్నా! తక్కినపని తర్వాత చేయచ్చులే' ఇంతలో




మునిగిపోయిందేముందీ?' అన్నాడు సత్యం మాస్టారు.

★ ★ ★

మర్నాడు బడికివెళ్ళాక 'రండి రండి. మీకోసమే చూస్తున్నా!" అన్నాడు హెడ్మాస్టారు నవ్వుతూ పలకరిస్తూ.

"చెప్పండి" అన్నాడు సత్యం.

మంత్రిగారు వచ్చినప్పుడు ప్రెసిడెంటుగారో ఉపన్యాసం ఇవ్వాలిట! ఎవరిచేతేనా రాయించిపెట్టి యివ్వమని అడిగారట! అందుకు మీరే సమర్థులు!" అన్నాడు హెడ్మాస్టరు.

'అబ్బే, నా కేమొచ్చండి "

"అహఁ! అలాగనకండి ప్రెసిడెంటుగారు మరీమరీ అడిగితే మీ పేరే చెప్పాను."

"మీ రేపని చెప్పినా నే నెప్పుడూ కాదనలేదు. కాని అపాత్రదానం చేయటం ఇష్టంలేక. ."

"చూడండి సత్యంగారూ! ఇష్టం లేకపోయినా కొన్నికొన్ని పనులు మనకు చేయకతప్పదు ఆయన ప్రెసిడెంటుగారు!..." అని అర్థోక్తిలో ఆగిపోయాడు.

హెడ్మాస్టారు సాధుస్వభావుడు. ఆయన్నిక ఇబ్బందిపెట్టలేక ఆపూటే ఉపన్యాసం వ్రాసియిచ్చాడు సత్యం.

ఆ సాయింత్రం ప్రెసిడెంటుగా రింటి నుంచి తిరిగి వచ్చిన హెడ్మాస్టార్ని చూసి" ఎమిటలా వున్నారు? ఉపన్యాసం నచ్చలేదటా ఆయనకి?' అన్నాడు సత్యం.

"అదికాదు. ఉపన్యాసానికేం? నిక్షేపంలా వుంది. శభాష్ – అని మెచ్చుకున్నాడు. కాని, మన కో పెద్ద బెడదవచ్చిపడింది."

"ఏమిటి?'

"మంత్రిగారి కార్లూ అవీ మన స్కూలుపక్కనించేగా వెళ్ళేది. అందుకని స్కూలంతా శుభ్రం చేయించాలిట!అంటు ఆ పెంటకుప్పలు కూడా ఎత్తించి వేయాలిట!"

"ఎత్తించవల్సింది మనమా? ఆయనా?"అన్నాడు సత్యం కోపంగా



"పంచాయితీ దగ్గర డబ్బులేదుట!మనమే ఏదో టి చేసి....."

"అంటే, మన జీతం డబ్బులుపెట్టి పెంటకుప్పలు ఎత్తించమంటారా?'

"అహ! అలాగనికాదు. స్కూల్లో పిల్లలు అందరూ తలో చేయివేస్తే....."

సత్యానికి మనస్సు చివుక్కుమంది. "పిల్లలచేతా? మీ కేలా మనసొప్పింది మాస్టారూ?"

"కరవమంటే కప్పుక్కోపం. విడవమంటే పాముక్కోపం నేనేం చేయను చెప్పండి? అన్నాడు హెడ్మాస్టారు.

"అవున్లెండి. ఆయన దృష్టిలో వూళ్ళోవాళ్ళంతా పనివాళ్ళు. వాళ్ళ పిల్లలచేత పనులు చేయించ మనటంలో ఆయనకు అన్యాయమని ఎలా అనిపిస్తుంది!" అన్నాడు సత్యం జేవురించిన ముఖంతో.

"ఈ పెంటకుప్ప లిలాగేవుంటే రేపు వూళ్ళోకివచ్చే అధికారులు నన్నే తప్పుపడతారు ఎవరికి తప్పినా నాకు తప్పదుగా!" అన్నాడు హెడ్మాస్టారు ఉస్సురుమంటూ.

మర్నాటినుంచి పిల్లలు పెంటకుప్పలు తవ్వేపనిలోకి దిగవల్సివచ్చింది ఆ సంగతి తెల్సి కొందరు తల్లి తండ్రులు హెడ్మాస్టారిమీదకి దండయాత్రకి వచ్చారు "మా పిల్లల్ని చదుకోటానికి పంపించామనుకున్నారా? పెంటకుప్పలు తవ్వించటానికి పంపించా మనుకున్నారా?" అంటూ

సత్యం మాస్టారికి కోపం నషాళానికి కెక్కింది. "మన పిల్లలు తిరిగేచోటు – ఇక్కడ పెంట పారేయటం తప్పు అని మీలో ఎవ్వరికీ అనిపించలేదుకాని – ఇప్పుడా పెంట తీయించి వేయటం మీకు తప్పనిపిస్తోందా?"

"మేం పారేసామా? మేం పారేస్తుంటే మీరు చూసారా?" అంటూ వ్యక్తిగతంగా సత్యం మాస్టారిమీద విరుచుకుపడ్డారు వాళ్ళు.

మూర్ఖంగా వాదించేవాళ్ళకి సామాజిక బాధ్యతగురించి ఉపన్యాసాలిచ్చి ప్రయోజనంలేదు. అది సమయమూ కాదు. ఈ తగవులాటలో ముందు పని ఆగిపోతుంది. ఆ భయంతోనే "మన యిల్లు మనం ఊడ్చుకోమా? మన యిల్లు పాడయితే బాగుచేసుకోమా?పిల్లలు సంతోషంగానే చేస్తున్నారు. కాని.. . యిబ్బందిపెట్టి నే నెవరిచేతా చేయించటంలేదండీ!" అని ఎలాగో నచ్చచెప్పి వాళ్ళని పంపించివేసాడు హెడ్మాస్టారు.

* * *

ప్రస్తుతం స్కూల్లో పెంటకుప్పలు తీసేయటం తప్ప చదువు సాగటంలేదని తెల్సిన తల్లిదండ్రులు గడుసుగా తమ పిల్లల్ని స్కూలుకి పంపించటం మాన్పించేసారు. దాంతో పనికుంటుపడపోయింది. మంత్రిగారొచ్చే రోజు దగ్గరపడుతోంది. హెడ్మాస్టారికి కంగారెక్కువయి పోయింది బ్రతిమాలో బామాలో వస్తున్న పిల్లలచేతే ఆపని కొనసాగిస్తున్నా డాయన. వాళ్ళలో చాల మంది పేదవాళ్ళ పిల్లలు – కూలివాళ్ళ పిల్లలు!

వాళ్ళలో కిష్టయ్య ఒకడు. అందరికన్న ముందుంటాడు. ఆ ఉత్సాహంలో పాపం వాడు మాసుకోలేదు – గోతిలోకి దిగి గునపంతో తవ్వుతుంటే కసుక్కున అరికాల్లో దిగబడిపోయింది. ఏదో ముల్లనుకొని దాన్ని పట్టుకొని గబుక్కున లాగిపారేసాడు... రక్తం బొటబొట కారింది.

"అమ్మో! రక్తం....' అన్నాడో కుర్రాడు.

మరెవడో వెళ్ళి సత్యం మాస్టారికి చెప్పాడు. అతను కంగారుగా వచ్చి చూసాడు. కిష్టయ్యా చెయ్యి అడ్డంతీసాడు. రక్తం కట్టుపడింది కాని గాయం లోతుగావుంది. పాత గుడ్డ పట్టుకువచ్చి కట్టుకడుతూ ఏం గుచ్చుకుందిరా?" అని అడిగాడు సత్యం

ముల్లని చెప్పాడు కిష్టయ్యా. ముల్లనే అనుకున్నాడు సత్యం అలా సరిపెట్టుకోవటమే ఒక పెద్ద ప్రమాదానికి దారితీస్తుందని అతనికప్పుడు అనిపించలేదు'

మర్నాడు కాలినెప్పితోనే పనిలోకి వచ్చాడు కిష్టయ్య.. . నెప్పి మోపుచేయటంవల్ల కుంటుతునాడనే సరిపెట్టుకున్నాడు సత్యం.

మాణిక్యం – వీరన్న నిత్యం కూలిపని చేసుకొని బతికేవాళ్ళు పనిచేసుకొనేవాళ్ళకి వేతులు కాళ్ళు గీరుకు పోవటం – తెగటం – రక్తం కారటం – ఇదేం కొత్తకాదు కిష్టయ్యకి దెబ్బలు తగలటమూ వింతకాదు అందుకేయిదికూడా మామూలు దెబ్బేనని వాళ్ళూ సరిపెట్టుకుపోయారు



## సంజయ్ – శ్రీదేవిల పందెం!

హిమాలయన్ కార్ రాలీ వంటి పందాల గురించి విని ఉన్నారు గాని, తెరపై కొత్తరకం ఎడారి పందాన్ని భారతీయులు త్వరలో చూడ బోతున్నారు. ఖుదాగవా చిత్రం కోసం దర్శకుడు ముకుల్ ఆనంద్ బెన్‌హర్‌లో లాంటి పందాన్ని చిత్రించ నున్నారట. ఇటువంటి పందాలు ఇదివరకు జరగలేదని కాదు గాని, ఇప్పుడు తలపెట్టిన పందెం చాలా పెద్ద ఎత్తున జరగ బోతోంది. రాజస్థాన్‌లో ప్రారంభమై ఈ పందెం చండీఘర్, నైనిటాల్, కులు, మనాలిల ద్వారా చివరికి ఢిల్లీ చేరుతుంది ఈ రాలీలో సంజయ్‌దత్, శ్రీదేవి పాల్గొంటారు ఎవరు గెలుస్తా రంటారు? బహుశా ఇద్దరూ ఒకేసారి కలిసే ఢిల్లీ చేరతారేమో?!

# మంత్రిగారొస్తున్నారు

నాలుగో నాడు తెల్లవారేసరికి పిల్లాడు మూలుగుతున్నాడేమిటని ఒళ్ళుపట్టుకొని చూసింది మాణిక్యం. కిష్టయ్యకి ఒళ్ళు సలసల కాలిపోతోంది. పాదంచూస్తే వాచిపోయివుంది!

మొగుడికి చెపుదామంటే – వీరన్న రెండు రోజులుగా యింటికే రావటంలేదు. ప్రెసిడెంటుగారి దివాణంలోనే రెక్కలు ముక్కలు చేసుకుంటున్నాడు. మంత్రిగారు వచ్చేదాకా అక్కడే పడుండమని ప్రెసిడెంటుగారు ఆర్డర్లు జారీ చేసాడు!

మాణిక్యాని కేంచేయాలో పాలుపోలేదు కుర్రాడ్ని ఎత్తుకొని డాక్టరుదగ్గరికి వెళ్ళేబలం దానికిలేదు. ఊళ్ళో వున్నది ఒక్కడే డాక్టరు. అదికూడా ఇదివరకు పట్నంలో కాంపౌండరుగా పనిచేసిన అనుభవంతో లాక్కువస్తున్నాడు ఆమాత్రం చిట్కా వైద్యంతోనే ఊరివాళ్ళకో ఆపద్బాంధవుడయిపోయాడు.

పిల్లవాడి పరిస్థితి గుర్తించి చెప్పింది మాణిక్యం. ఆయన తక్కిన పేషెంట్లు నందర్నీ చూసి తీరికచేసుకొని ఆమె గుడిసెకి రావటానికి రెండుగంటలుపట్టింది. వచ్చిచూసి జరిగిందేమిటో అడిగాడు. మాణిక్యం చెప్పింది. 'ముల్లు గుచ్చు కున్నంత మాత్రాన ఇంత జ్వరం రాదు' అన్న ఆలోచన ఆ డాక్టరుకి రాలేదు. అతని అనుభవం అంతంతమాత్రమే! అందుకే జ్వరానికి, కాలి దెబ్బకి మందిచ్చాడు.

ఆ సాయింత్రం చీకటిపడ్డాక ఇంటికి వచ్చాడు సత్యం మాస్టారు.

"కిష్టయ్యా బట్టలు కుట్టేసానండీ" అంది శాంతి తెచ్చి చూపిస్తూ

మెచ్చుకోలుగా భార్యవైపు చూసి "ఇచ్చినమాట నిలబెట్టుకున్నావు మంత్రిగారొచ్చేది రేపే! ఆవేళప్పుడు కొత్తబట్టలు కట్టుకోవాలన్న వాడి కోరిక తీరుతుంది" అన్నాడు.

"అయితే హెడ్మాస్టారు అందర్నీ కొత్తబట్టలు కట్టుకోమని చెప్పలేదా?"

"బలేదానివే! ఆయన చెప్పి నంత మాత్రాన అందరూ కొత్తవి కట్టుకొని రాగలరా? ఆమాటంటే కనీసం శుభ్రమయిన బట్టలు వేసుకువస్తారని!"

"ఓర్నీ! కిష్టయ్య ఎంతపనిచేసాడు?" అని నవ్వింది శాంతి

ఆమె చంటిపిల్లకి గోరుముద్దలు పెడుతోంది. బయిట వాలుకుర్చీలో పడుకుని భార్యతో కబుర్లు చెపుతున్నాడు సత్యం.

అంతలో మాణిక్యం పరుగుపరుగున వచ్చింది "కొంప మునిగి పోనాది బాబుగోరో!' అని ఘొల్లుమంది.

'ఏమయింది మాణిక్యం?" అని కంగారుగా అడిగాడు సత్యం.

కిష్టయ్య స్పృహలో లేడు. డాక్టరిగారి మందు పట్టివ్వలేదు. మళ్ళీవచ్చి చూసి ఇక తనవల్లకాదు – పట్నంలో పెద్దాసుపత్రికి వెంటనే తీసుకు పొమ్మన్నాట్ట! మొగుడితో చెపుదామని ప్రెసిడెంటుగారి దివాణానికి వెళ్ళింది మాణిక్యం.' మర్నాడే మంత్రిగారొచ్చేది. అక్కడ జనమంతా హడావిడిగా వున్నారు. వీరన్న ఎక్కడున్నాడో ఎవరూ చెప్పటంలేదు.. .. గత్యంతరంలేక మాస్టారింటికి పరిగెత్తుకువచ్చింది.

రెండ్రోజుల్నించి కిష్టయ్య స్కూలుకి రాకపోతే కాలి నెప్పిగావుంది రాలేకపోయాడని అనుకున్నాడేకాని పరిస్థితి యింత విషమించి వుంటుందని ఊహించలేకపోయాడు సత్యం. తనేదో తప్పుచేసినవాడిలా భావించాడు. గబగబ బట్టలేసుకుని యింట్లోవున్న డబ్బంతా తీసుకొని మాణిక్యంవెంట పరుగుపెట్టాడు!

వాళ్ళు ఇంటికి చేరేసరికి వీరన్నవచ్చివున్నాడు. పక్కింటి గవరయ్య వీరన్న ఎక్కడున్నదీ తెల్సుకొని కబురుచెప్పి తీసుకువచ్చాడు.

కిష్టయ్యని కొన్ని క్షణాలపాటు పరీక్షగా



## ఉషః సంధ్యల మధ్య

ఉషః సంధ్యల మధ్య జీవన గమనాన్ని లిఖిస్తూ
భావసంకేతాల్ని అనునయంగా పరుస్తూ
అనుభవ ప్రతీకల్ని శబ్దసాలభంజికల్లా శిల్పిస్తూ
కీర్తిస్తంభాల వెనుక రహస్య మృత్యుభయాన్ని స్పృశిస్తూ
అమానుషాన్ని, అసంబద్ధ యుద్ధఘోషల్ని విన్పిస్తూ
చిత్రంగా, విచిత్రంగా దరిపై మెల్లగా వ్యాపిస్తుంది
అపమృత్యుభయాల అసంకల్ప ప్రతీకార చర్యల్ని స్పందిస్తూ
జయాపజయాల వెనుక ప్రసన్నావృత దినచర్యల్ని చిత్రిస్తూ
నియంతల శాసనాన్ని, నిర్బంధిత స్వేచ్ఛాశ్వాసాన్ని లిఖిస్తూ
అక్షరాల అమృత గీతాన్ని అస్పరాస్తత్వ రూపాన్ని వర్షిస్తూ
విశ్వాంతర్గత చైతన్యాన్ని వింతస్తబ్ధ సంధ్యా గమనాన్ని సూచిస్తూ
ప్రత్యక్షంగా శోభించి పరపైపరుసు మనల్ని స్పృశిస్తుంది

–చెన్నకేశవ

# ఆరోగ్యానికి సప్త గుళికలు

○○○○○○○

డాక్టర్ బి.జి.వి. నరసింహారావు

## ఆరవ గుళిక

## విశ్రాంతి

మనిషికి తగినంత విశ్రాంతి ఉన్ననాడు మానసిక అలసట అంతగా కనిపించదు మానసిక అలసట ఎప్పుడైతే ఉంటుందో అప్పుడు అస్థిరత్వం, ప్రతీ విషయానికి అనుమానం- ఫలితంగా భయాందోళన కలుగుతుంది వ్యాధి నిరోధక శక్తి క్షీణిస్తుంది మానసిక ఆందోళన ఎప్పుడైతే ఉందో కొన్ని రకాల వ్యాధులు దగ్గరవుతాయి ముఖ్యంగా ఉబ్బసం, ఆర్థ్రైటిస్, మయస్తీనియా గ్రేవిస్, కేన్సరులకు మానసిక ఆందోళనకు దగ్గర సంబంధముంది

సమయం దొరికినప్పుడల్లా మెత్తటి పాన్పుపై పడుకోవటం కన్నా కటిక నేలపై సాష్టాంగ పడినట్లు పడుకొని కాళ్ళు, చేతులు పూర్తిగా సాగదీసి అరగంట సేపు ఉండగలిగితే హాయిగా ఉంటుంది



క్రింద పడుకోవటం ఇబ్బందిగా ఉందనుకుంటే వాలు కుర్చీలో కూర్చొని కాళ్ళు చేతులు పూర్తిగా చాచి తలక్రింద తల గడను పెట్టుకొని తలను అటూ యిటూ తిప్పక కళ్ళు మూసుకుంటే ఎంతో విశ్రాంతి లభిస్తుంది

కళ్ళు మూసుకొని లయబద్ధంగా ఊపిరి పీలుస్తూ విడుస్తుంటే మనసుకి హాయిగా ఉండి మనసు తేలిక అవుతుంది ఏదో సమయం రోజూ యిలా ఆచరించటం మంచిది

అలసి పోయిన తరువాత విశ్రాంతి తీసుకోవటం కన్నా పూర్తిగా అలస పోక ముందే విశ్రాంతి తీసుకోవటం మంచిది

(వచ్చేవారం ఏడవ గుళిక)

చూసాడు సత్యం. పిల్లవాడి పరిస్థితి ఏమాత్రం బాగాలేదని డాక్టరు చెప్పకుండానే అర్థమైపోతోంది.

"వెంటనే ఏదయినా బండి తీసుకురా! పట్నం తీసుకుపోదాం" అన్నాడు.

నాల్గయిదు రోజులుగా తిండి సరిగా లేదు. శ్రమ చేసి చేసి అలిసి పోయి వున్నాడు. కొడుకు కలావుండటం చూసి మరింత క్రుంగి పోయాడు. "బండి ఏదనుంచి తేగల్ను మాట్బారూ! నా కాడ పది పైసలు కూడ లేవు." అన్నాడు వీరన్న జీరగొంతుతో.

"నా దగ్గరుంది. డబ్బు కోసం చూస్కోకు. పిల్లాడ్ని మనం రక్షించు కోవాలి. వెళ్ళు వెళ్ళు." అన్నాడు సత్యం తొందర పెడుతూ.

నానాఅవస్థలూపడి ఓ గంటకి బండిని తీసుకు వచ్చాడు వీరన్న. కిష్టయ్యని తీసుకొని వాళ్ళు పట్నం చేరటానికి రెండున్నర గంటలు పట్టింది.

వాళ్ళని ఆసుపత్రిలో ఎమర్జెన్సీ వార్డుకి తీసుకు వెళ్ళాడు సత్యం.

".... అర్థ రాత్రేంటయ్యా! పొద్దున్నే రండి." అన్నాడు గుమ్మంలో కూర్చుని కునికి పాట్లు పడుతున్న వార్డుబోయ్. వచ్చిన వాళ్ళు పల్లెటూరి వాళ్ళని చులకన' కసిరితే వాళ్ళే పోతారని నిర్లక్ష్య భావన.

సత్యం అర్థం చేసుకున్నాడు. కోప్పడటానికది సమయం కాదు ఆవేశాన్ని తనలోనే అణచుకుంటూ పిల్లవాడి పరిస్థితి ప్రమాదంగా వుందని చెప్పి డాక్టరు ఎక్కడున్నాడో చెప్పమని బ్రతిమాలాడు సత్యం.

ఏకళనున్నాడో వాడు చెప్పాడు. డాక్టర్ని నిద్రలేపి కిష్టయ్యని ఎగ్జామినేషన్ టేబిల్ మీదకి చేర్చేసరికి గంట పట్టింది. డాక్టరు పరీక్ష చేయటానికి మరో అరగంట!!

"కాల్చించి తీసి పారేసింది ముల్లా? మేకా?" అని అడిగాడు డాక్టరు నర్సు అందించిన సిరంజితో కిష్టయ్యకి ఇంజక్షన్ చేస్తూ.

సత్యం ఉలిక్కి పడ్డాడు... "పిల్లాడు ముల్లనే చెప్పాడండి. కాని...."

"ముల్లుకాదు. ముల్లయితే ఇలా యెప్పటికీ కాదు. మేకే అయి వుంటుంది. అది తుప్పు పట్టిన మేకే అయివుంటుంది. టిటనస్ ఫార్మ్ అయింది. టూ లేట్. .. చాలా ఆలస్యం చేసారు...."

డాక్టరి ఒక్కొక్క మాట ఒక్కో ముల్లులా అతనికి గుచ్చుకుంటున్నట్టయింది. కిష్టయ్య రక్తం కారిన పాదానికి కట్టు కట్టినప్పుడే తనకీ మాత్రం తోచలేదే. అని గిల గిల లాడిపోయాడతను. మాణిక్యం వీరన్నలను ఓదార్చే పరిస్థితిలో లేడు. తనను తానే నిలదొక్కుకోలేక పోతున్నాడు.

"పల్లెటూళ్ళ నుంచి వచ్చే కేసులన్నీ అంతే- పూర్తిగా ప్రాణాల మీదకి వచ్చాక వస్తారు. మా ప్రాణాలు తీస్తారు..... డాక్టరు మాటలు సూలాల్లా గుచ్చు కుంటున్నాయి. ఆ మాటలు అనవల్సిన సమయం కాదని ఆ డాక్టరు ఎక్కడా సందేహిస్తున్నట్లు లేదు. నిత్యం జరుగుతున్న దాన్ని నిర్మొహమాటంగా చెప్పుతున్నట్టుంది....

తెల్లవారింది.

మాణిక్యం ఆశలకి తెల్లవారింది.

వీరన్న కోరికలకి తెల్లవారింది.

కిష్టయ్య ఇప్పుడు జ్వర తీవ్రతతో రొప్పటం లేదు.

పాఠకులకో సవాల్!

# 7 టిట్ ఫర్ టాట్!

## మూడు ముళ్ళు, నాలుగక్షింతలూ... యింతేగా పెళ్ళంటే?

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలేగాని బాధించకూడదు. రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్టవచ్చినట్లుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం ప్రచురించిన రెంటికి రు 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది'- ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. సంచిక విడుదలైన వారంలోగా పంపాలి.మర్చిపోకండి —సం.

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం బహుమతులు పొందిన రెండూకాక- మరికొన్ని యిక్కడ వేశాము తతిమ్మా వారి 'వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేకపోయాం లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహం పడక మళ్ళీ ప్రయత్నించండి'

## "సైకిల్ అమ్మేసి మద్రాసొచ్చి సినిమాల్లో చేరా....".

★ రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

"చేరితే చేరావు, కానీ, కొన్న పాపానికి ఇక్కడ నీ డొక్కు సైకిల్ తొక్కలేక నే ఛస్తున్నా!"

- టి రాంప్రసాద్ (ప్రొద్దుటూరు)

★ రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

"పోతే పోయావు కాని అటుపై రాజకీయాల్లో చేరకు మహాప్రభో ...."

- జి రమేష్‌బాబు (పత్తిపాడు)

### మరికొన్ని వాగ్బాణాలు

"అందుకే సైకిల్ గుర్తంటేనే నీకంత యిష్టం" - ఎ మురళి (వరంగల్)

"ఇంకెందుకు ఆలస్యం' ఓ మంచి ముహూర్తం చూసుకుని కొత్త పార్టీ స్థాపించి రాజకీయాల్లో చెరు '. - ఎం స్వయంప్రభ (రాజమండ్రి)

"ఆ సైకిల్"తో నే హైదరాబాద్ వచ్చి అధికారంలోకవచ్చా - ఎ వి ఎల్ ప్రసాద్ (భీమవరం)

### లక్కీ పేర్లు

ఎన్ రమేష్‌బాబు (హైదరాబాద్), బెంజిమెన్ (రాజమండ్రి), చుక్కపల్లి తనూజ (కంచర్లపాలెం), కె శ్రీనివాసకుమార్ (కాకినాడ), జి వి రాఘవేంద్రరావు (మచిలీపట్నం), ఎం విజయభాస్కరరెడ్డి (రామవరం) జి సత్యనారాయణమూర్తి (పెదపాడు), బి వి మోహనరావు (కందుకూరు) జి శ్రీనివాసరావు (శ్రీకాకుళం) కె సన్ని (అనకాపల్లి)

## మంత్రిగారొస్తున్నారు

కిష్టయ్యకిప్పుడు జ్వరం లేదు.

కిష్టయ్య ఒళ్ళు చల్లగా మంచులా వుంది.

"...ఇంక మీరు తీసుకు పోవచ్చు" అన్నాడు డాక్టరు నిర్లిప్తంగా.

★ ★ ★ ★ ★ ★ ★

శ్మశానంలో

కొడుకు శవాన్ని కావలించుకొని హృదయ విదారకంగా ఏడుస్తోంది మాణిక్యం

పిడుగు పాటుకు కొయ్యబారి పోయిన వాడిలా వున్నాడు వీరన్న.

గవరయ్య గొయ్యిని తవ్వుతుంటే అక్కడే నిలబడి వివూఢునిలా చూస్తున్నాడు సత్యం మాస్టారు

తండ్రితో పాటు కూలిపని చేసుకుంటున్న కుర్రాడ్ని తీసుకు వెళ్ళి బళ్ళో చేర్పించాడు తను ఆ బళ్ళో చేరివుండక పోతే ఆ పెంట కుప్ప మీద అడుగు పెట్టేవాడు కాదు ఆ మేకు ప్రాణం తీసేది కాదు. దాస్యం నుంచి నీకు విముక్తి కలిగిద్దామనుకున్నానే కాని . నీకీ లోకం నుంచే విముక్తి అయిపోయిందిరా కిష్టయ్యా!" అని లోలోపల దుఃఖ భారంతో కుళ్ళి పోతున్నాడు సత్యం.

మైక్‌లోంచి ప్రెసిడెంటు గారి గొంతు ఊరి పొలిమేరల దాకా వినిపిస్తోంది. మంత్రిగారికి ఘన స్వాగతం చెపుతున్నాడాయిన. సత్యం మాస్టారు రాసిచ్చిన ఉపన్యాసం అది'

" మనం ఎంతో పుణ్యం చేసుకున్నాం కనుకనే మన వూరికి మంత్రిగారి దర్శన భాగ్యం దొరికింది ఈ రోజు. మన వూరి చరిత్రలోనే కనీ వినీ ఎరుగని రోజు నిజంగా ఇది మనకు పండుగ రోజు...."

సత్యం మాస్టారి గుండెల్ని తూట్లు తూట్లుగా పొడుస్తున్నాయా మాటలు తన చేత్తో తను రాసిచ్చిన మాటలు'

అతని కళ్ళనుంచి రక్తాశ్రువులు కారుతున్నాయి

వెంకటాపురం పొలిమేరలు మూగగా రోదిస్తున్నాయి' ●

# నెస్టమ్® బేబీ సిరియల్ – రైస్

## మీ పాపాయి యొక్క ఆదర్శప్రాయమైన తొలి ఘన ఆహారం

### వాడి చూడండి!

నెస్టమ్ బేబీ సిరియల్ని పాలలో కలిపినప్పుడు అది అన్నానికి గల తేలిగ్గా జీర్ణమయ్యే గుణం, పరిపూర్ణ పోషకాహారవు మంచితనం అందజేస్తుంది 4 నెలలు వయసు వచ్చాకా పాపాయి ఆహారంలో మీరు ఘన పదార్ధాలు ప్రవేశ పెట్టేటప్పుడు, నెస్టమ్తో ప్రారంభించండి బియ్యంతో తయారు చేయబడిన నెస్టమ్, తేలిగ్గా జీర్ణయం అయ్యేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది అంతేకాదు, నెస్టమ్, ఇనుము విటమిన్లతో మరింత బల వర్ధకం చేయబడింది



నెస్టమ్ని తయారు చేయడం ఎంతో సులువు దీనిని ముందుగా కాచిన వెచ్చటి పాలల్లో కలపండి అంతే పాపాయికి తినిపించేందుకు ఆహారం తయారు!

నెస్టమ్ పాలు లేకుండా అందుబాటులో ఉన్న ఒకే ఒక సిరియల్ మీరు మీ పాపాయి ఆహారంలో వివిధ రుచులు తెచ్చేందుకు ముందుగా ఉడికించి యింట్లోనే తయారు చేసిన మెత్తటి గుజ్జుగా చేసిన కూర ముక్కలు, పప్పు పండ్లు నెస్టమ్లో కలపండి

**కేవలం రూ 9/-* కే డబ్బాలో 200 గ్రా. సంచీ**




* స్థానిక పన్నులతో సహా

**ఉచితం!**
నెస్టమ్ రెసిపి బుక్ లెట్.
ఈ చిరునామాకు వ్రాయండి
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం 6016
న్యూ ఢిల్లీ 110 008

Nestlé

ప్రస్తుతం ఒక్క ఆంధ్ర ప్రదేశ్ లోనే దొరుకుతోంది

R K SWAMY FSL 5127 TEL



(గత సంచిక తరువాయి)

మర్నాడు తెల్లవారక ముందే చిన్న సూట్‌కేస్ పట్టుకుని గదిలోకివచ్చింది శృతి మైనా ఇంకా నిద్రపోతోంది

'అమూల్యా, నేను వూరికి వెళ్తున్నాను" అంది

ఇంత అకస్మాత్తుగా ఏ వూరికి?

'మా వూరికే మా వారు, పిల్లలు వుంటారు

పరవాలేదు మేము చూసుకుంటాములే అన్నాను

గట్టిగా నవ్వి అంది 'అదే నేను చెప్పబోయేది మీరెవరూ వాళ్లను చూసుకోకండి చూసే వాళ్లెవరూ వుండకూడదనే నే నిప్పుడు బయల్దేరింది

శృతి 'నేరము–శిక్ష అన్న ప్రిన్సిపుల్ గుర్తు వచ్చింది

'వాళ్ళు చేసిన నేర మేమిటో ? అన్నాను నవ్వుతూ

నవ్వకు తెల్లవారు ఝామున లేచి ఎక్సర్‌సైజ్ చెయ్యడం మానేశారు వార్నింగ్ ఇస్తూనే వున్నాను విన్లేదు అంది కినుకగా

చలికి లేవబుద్ధి కావటం లేదేమో పాపం'

చలి అని అన్నం తినటం లేదా? నిద్రపోవటం లేదా? వాని కంటే ముఖ్యం వ్యాయామం జబ్బు చేస్తే తప్ప మానకూడదని ఎప్పుడో చెప్పాను

నేనేదో అనబోయాను

నీవింకేమీ చెప్పకు సరే నేను వెళ్తున్నాను వాళ్ల నేమీ పలకరించకండి నీళ్ళు కూడా ఇవ్వకండి వస్తాను' అంది

తనతో పాటు నేను కూడా గేటు దాకా వెళ్లాను

మళ్ళీ ఎప్పుడు వస్తావు శృతీ?

నిట్టూర్చింది శృతి

ఆయనకూ, పిల్లలకూ దూరంగా వుండటం నాకూ పనిష్మెంటే చేయని నేరానికి నేనెందుకు శిక్ష అనుబవించాలి? నీకూ తెలుసనుకుంటాను వంద మంది నేరస్తులు శిక్ష నుండి తప్పించుకున్నా పరవాలేదు గానీ ఒక్క నిర్దోషి శిక్ష అనుభవించకూడదనీ అందువల్ల వీలైనంత త్వరలో వస్తాను అంది మళ్ళీ వచ్చే నవ్వు నాపుకుంటూ

'బాగుంది అన్నాను నేనూ నవ్వుతూ

వెళ్లొస్తాను మైనా ఆరోగ్యం జాగ్రత్త" అంటూ ముందుకు సాగిపోయింది

వెనుదిరిగిన నేను అప్రయత్నంగా శృతి వాళ్ల ఇంటి కేసి చూశాను కిటికీ అవతల నిలబడి నీరసంగా, దిగులుగా శృతి వెళ్లిన వైపే చూస్తూ వున్న చిరంజీవి గారు కనిపించారు

ఆ ఇంట్లో చల్లని దీపంలా వెలుగుతూ వుంటుంది శృతి భర్తను, పిల్లల్ని పువ్వుల్లా చూసుకుంటుంది ఇంటిని ఆలయంలా వుంచుతుంది అలా సుఖాన్నీ, సంతోషాన్నీ మప్పి పెట్టి ఒక్క సారిగా ఇలా వెళ్లిపోతే ఆ భర్తకు ఎంత బేజారు!

ఆ ఇంట్లోని అనాధ పక్షులను గురించి జాలిపడూ మా గదికి వచ్చాను

శృతి మాటల్ని లెక్కపెట్టలేదు నేను శృతి వచ్చే దాకా పిల్లలకు మా గదిలోనే భోజనం పెట్టతం, చిరంజీవి గారికి క్యారియర్ పంపడం మానలేదు, ఈ నేరానికి శృతి శిక్ష విధిస్తుందని తెలిసినా

గదిలోకి రాగానే కళ్ళు తెరుచుకుని వున్న మైనా అంది ఈ రోజు సాయంకాలం త్వరగా రా లైబ్రరిని పట్టుకు వేళ్లాడకు ఒక చోటికి వెళ్లాలి'.

సరేగానీ, శృతి వూరికి వెళ్లింది తెలుసా? అన్నాను

వాళ్ల పతి దేవుడికి పనిష్మెంట్‌గానా" అంది

ఆశ్చర్యంగా అడిగాను 'నీ కెలా తెలుసు?'

'శృతికి తన ఇల్లన్నా, భర్తా పిల్లలన్నా ప్రాణం సామాన్యంగా ఎక్కడికీ ఒక్కత్తీ వెళ్లదు అలా వెళ్లిందంటే ఇలాంటిదే ఏదో వుంటుంది "

చాలా చిత్రమైన మనిషి' అన్నాను

* * * *

మైనా చర్యలు నా కెంత చికాకు కలిగించినా తనలోని ఒక విధమైన అమాయకత్వమూ, విచ్చల విడి తనంలో కూడా బయటపడే నిజాయితీ తన నెంత దూరంగా వుంచాలనుకున్నా సాధ్యపడ నివ్వడం లేదు అందుకే ఆ సాయంకాలం ఎక్కడికో బయలుదేరమనగానే తయారైపోయాను అక్కడికి వెళ్లాక గానీ అదొక అనాధ శరణాలయమని అర్థం కాలేదు

ఎవరి కోసమో లోపలకు కబురు పెట్టింది తర్వాత ఇద్దరం వెళ్లి ఆవరణలో వున్న ఓ చెట్టు క్రింద నిలబడ్డాము

' ఇక్కడికి తీసుకు వచ్చావేం? అన్నాను ఆశ్చర్యంగా

రాక్షసుడి ప్రాణం చెట్టు మీది చిలుకలో వున్నట్లు నా ప్రాణం ఇక్కడుంది అంది తమాషాగా కళ్ళు తిప్పుతూ

ఇన్నాళ్ళూ నాకు తెలియదే!

'ఏం? తెలిస్తే, వచ్చి దాన్ని నలిపేసి వుండేదానివా?' అంది

చప్పున మైనా చేయి పట్టుకున్నాను

మైనా, ఎందుకు నన్ను అపార్థం చేసుకుంటావు? నీ ప్రాణం నలిపేసేంత కఠినురాలిలా కనిపిస్తానా నేను?

'ఊహూ నా ప్రవర్తనే నీలో ఆ కాఠిన్యాన్ని పెంచుతోందని' అంది

అంటే నీ ప్రవర్తనలోని విశేషాన్ని నీవు గుర్తించినట్లే కదా? అన్నాను ఓర కంట చూస్తూ

గుర్తించాను అయితే నీ కోణం లోంచి అంది మైనా వచ్చే నవ్వు నాపుకుంటూ

నేను కోపంగా చూశాను

అమూల్యా డియర్! కడుపు నిండిన వాడు, 'ఆకలి ఆకలి' అని అరవడం ఎంత అసభ్యమో, అసహ్యకరమో ఉపన్యాసం ఇవ్వడంలో ఏమీ ఆశ్చర్యం లేదు అంది మైనా

'నీవు చూపిన ఉపమానం అతకడం లేదు మైనా నీ ప్రవర్తన మార్చుకోవడం నీ చేతుల్లోనే వుంది కావాలని మురికిని కావలించుకుంటూ అసహాయుడైన ఆకలిగొన్న వాడితో పోల్చుకుని నిన్ను నీవు మభ్య పెట్టుకోవడం దేనికి?

'ఈ రోజు సడన్‌గా నేను నా ప్రవర్తన మార్చుకున్నంత మాత్రాన పతివ్రతనై పోతానా? నలుగురూ నన్ను మంచిదానిగా గుర్తిస్తారా? నెవర్ అంది నిర్లక్ష్యంగా

నీవు తప్పు దారిలో ఆలోచిస్తున్నావు మైనా తప్పు చేయని వాడి కంటే తను చేస్తున్నది తప్పు అని గుర్తించిన క్షణం నుండీ తన తప్పు దిద్దుకునే ప్రయత్నం చేసేవాడు గొప్పవాడు దొంగతనం చేయని గాంధీజీ మనకు సామాన్యుడుగా కనిపించేవాడేమో కానీ దొంగతనం చేసి, ఆ తర్వాత పశ్చాత్తాప పడి, తన తప్పు ఒప్పుకుని జీవితంలో మరెన్నడూ దొంగతనం చేయని గాంధీజీ మనకు

జరిగిన కథ– 6: అమూల్యకు బెనర్జీ నుంచి ప్రేమలేఖ వస్తుంది. సెలవులకు ఇంటికి వచ్చిన అమూల్యతో కుసుమ భర్త మోహన్ విచిత్రంగా ప్రవర్తిస్తాడు ఎడి గదిలో చేరిన అమూల్యకు శృతి పరిచయమవుతుంది. మైనా మళ్ళీ అమూల్య గదిలో వచ్చి చేరింది.



ఆరాధ్యుడైనాడు

అమూ, నీవు టీచింగ్ జాబ్‌లో బాగా రాణిస్తావు అంది మైనా మెచ్చుకోలుగా కళ్ళెగరేస్తూ

నాకు ఒళ్ళు మండిపోయింది కోపంగా ఏదో అనబోయాను గానీ ఇంతలో మా దగ్గరకు ఓ చిన్న అమ్మాయి పరిగెత్తు కొచ్చింది

ఆ అమ్మాయిని చూడగానే మైనా ముఖంలోని కొంటితనం పట్టలా ఎగిరిపోయింది ఎంతో సాత్వికంగా, ఆర్తిగా చూస్తూ చేతులు చాచింది చాచిన చేతుల్లోకి వాలిపోయి మైనా మెడను గట్టిగా కావులించుకుంది ఆ పాప అక్కా అంటూ

ఆ పాపకు మూడేళ్ళుంటాయేమో! తెల్లగా, బొద్దుగా, మెత్తగా ముట్టుకుంటే మాసిపోయే తెల్ల పాలరాయిలా వుంది

మైనా తను తెచ్చిన చాక్‌లెట్ బార్, బొమ్మలు ఆ అమ్మాయి కిచ్చింది ఆ పిల్ల బుగ్గలు తడిసిపోయేలా ముద్దులు పెట్టుకుంది భుజం మీద ఎక్కించుకుని చెట్టు చుట్టూ రౌండ్లు కొట్టింది తను 'మైనా' అన్న సంగతీ, పక్కన నేనున్నాననే సంగతీ మరచిపోయిన దానిలా ప్రవర్తించింది మైనా ఆ కాసేపూ ఆ అమ్మాయి కూడా కిలకిల నవ్వుతూ, సంతోషంతో కేకలు పెడుతూ మైనా ముద్దును ఎంకరేజ్ చేసింది వాళ్ళను డిస్టర్బ్ చేయటం ఇష్టం లేని దానిలా మౌనంగా చూస్తూ నిలబడ్డాను

బాగా చదువుకుంటున్నావా?

రోజూ స్నానం చేస్తున్నావా? లాంటి మైనా ప్రశ్నలకు ఆ అమ్మాయి అచ్చం మైనా లాగే కళ్ళెగరేస్తూ ఓ, ఆ అంటూ సమాధానాలిచ్చింది

మైనా నన్ను చూపుతూ ఈమె ఎవర్లో తెలుసా? ఆంటీ అంది

నమస్తే ఆంటీ అంటూ చిట్టి చేతుల్ని జోడించింది నాకెంతో ముచ్చటేసింది !

నీ పేరేంటి పాపా? అన్నాను దగ్గరకు తీసుకుని

సుచరిత అంది మైనా చప్పున ఎందుకో మైనా గొంతు వణికినట్లుగా అనిపించింది'

చదువుకుంటున్నావా?" అని అడిగాను

ఔను ఎ బి సి డి లు' అంది

హాయిగా నవ్వాను

మైనా చెప్పిన మీదట ఒకటి రెండు రైమ్స్ ముద్దు ముద్దుగా చెప్పింది సుచరిత ఆ తర్వాత ఆయా లాంటి ఓ స్త్రీ వచ్చి సుచరితను తీసికెళ్ళింది

మైనా మేనేజర్ గదిలోకి వెళ్ళి ఏదో మాట్లాడి వచ్చింది

ఇంటికి వస్తూండగా మైనా అంది 'అమ్మా, నాన్నా అని పిలిపించుకోవడం మొరటని మమ్మీ, డాడీ అని పిలిపించుకునే వారు అదీ మొరటయింది లేటెస్ట్ పాషన్ ఏమిటంటే 'అక్కా అని పిలిపించుకోవడం "

నాకు వెంటనే అర్థం కాలేదు అయోమయంగా చూశాను మైనా కేసి

అర్థం కాలేదా అమూ డార్లింగ్? ఆ పూర్ లిటిల్ డాల్ ఎవరనుకున్నావు? మదీయ పుత్రికా రత్నం' అంది కన్ను గీటుతూ

చలి జ్వరం వచ్చినట్లుగా వణికిపోయాను నేను

'కుంతిలా సూర్యుని వరాన కనలేదోయ్. అచ్చంగా మగాడి సంపర్కం వల్ల తొమ్మిది నెలలూ మోసి మరీ కన్నాను

మైనా నీకు నీకు పెళ్ళయిందా?" భయం భయంగా అడిగాను

పక్కున నవ్వింది మైనా

బోగం రంగసానీ, బోగం రంగసానీ, నీ మొగుడెవరు? అని అడిగినట్లుంది' అని మళ్ళీ నవ్వసాగింది తెరలు తెరలుగా

★ ★ ★ ★ ★

సెకండ్ టర్మ్ పరీక్షలు పూర్తయి నేను వూరికి వచ్చేసరికి పిడుగులాంటి వార్త తెలిసింది

రామం మామయ్య త్రాచుపాము కరిచి చనిపోయారట'

అప్పటికే నారం రోజు లయింది నా పరీక్షలకు ఆటంకమ[illegible] తెలుపలేదట'

ఏ[illegible] మృత్యువు' అసలు మనిషి ఎందుకు

పుడ్తాడు" అతి విచిత్రంగా పుట్టిన మనిషి మేధను, మనసును పెంచుకుంటాడు ఎన్నో చేస్తాడు ఎన్నో చెయ్యాలనుకుంటాడు ఎప్పుడో అనుకోకుండా దాటిపోతాడు అంటే అతని పుట్టుకకు ఒక అర్థం లేదా? 'ఈ మనిషి జీవితం ఈ పనికి' అని నిర్దేశించబడదా? ఎన్నో నేర్చిన మనిషి, ఎన్నెన్నో చేయగలిగిన మనిషి ఏమీ చేయకుండానే మృత్యువు వాత బడితే ఇక ఈ పుట్టుకకు, ఈ మనుగడకు, మనిషి చేసే అన్వేషణకు అర్థమేముంది?

దయను, కరుణను మనిషి మనసులో పొదిగిన దేవుడే కరడు గట్టిన కాఠిన్యంతో ప్రేమ బంధంలో చిక్కడిపోయిన రెండు ప్రేమ పక్షులలో ఒక దానిని పెకలించి లాగి వేస్తే దైవత్వానికీ, రాక్షసత్వానికీ ఏం తేడా వుంది?

రామం మామయ్య ప్రేమ పిపాస, జానకి అత్తయ్య ఆరాదన, మామయ్య గాంభీర్యం, అత్తయ్య సౌందర్యం, వారిరువురి అన్యోన్య దాంపత్యం – ఒక్కొక్కటీ గుర్తు వస్తూ గుండెను పిడిచేస్తున్నాయి, పిండి చేస్తున్నాయి

అమ్మ చెప్పిన విషయం నన్నింకా కృంగదీసింది. అత్తయ్యకు సౌభాగ్య చిహ్నాలతోపాటు జుట్టు కూడా తీస్తారట! ఇదెంత ఘోరం! నెమలి పింఛం లాంటి తుమ్మెదల గుంపులాంటి అత్తయ్య తలకట్టు

నాన్నగారితో గట్టిగా వాదించాను

'ఈ దేశంలో ఎన్నో దురాచారాలూ, మౌఢ్యాలూ అంతరించి పోతున్నాయి దేన్నీ పెద్ద తప్పుగా తీసుకోవటం లేదు ఇప్పుడెవరూ కావాలంటే అత్తయ్యకు కుంకుమ, గాజులు తీసి వేయండి జుట్టు మాత్రం వుంచండి నాన్నా'

"లేదు అమూల్యా కోడలు తల[illegible] తన కొడుకు-తలకు కొరివి పెట్టిందని అసలే వాళ్ల అత్తగారు ధుమదుమలాడి పోతున్నారు పైగా మహా ఆచార పరురాలు ఈ విషయం మనం సూచనగా కూడా అనడానికి వీల్లేదు'

ఎందుకు లేదు అత్తయ్య మీద వాళ్లకేనా అధికారం? కని పెంచిన పుట్టింటివారికి ఆమాత్రం హక్కు, అదికారం లేవా?

"పెళ్లి చేసే వరకేనమ్మా అవన్నీ".

లేదు నాన్నా ఏది ఏమైనా ఇలా జరగడానికి వీల్లేదు కావాలంటే నేను వాళ్ల అత్తగారితో మాట్లాడతాను' అన్నాను తీవ్రంగా

నాన్నగారు నిర్వేదంగా నవ్వారు

అమూల్యా! ఏదైనా సంఘ వ్యతిరేకమైన పనులు – అవి మంచివే అయినా– చేయాలనుకున్నప్పుడు ఆ పన్లేవో ఇతరులు చేయాలనుకోవడం కంటే మన నుంచే ప్రారంభిస్తే బావుంటుంది జానకి మన ఆడపడుచు మాత్రమే దాని సంసారం, దాని గోత్రం, దాని పరువు ప్రతిష్టలు, ఆచార వ్యవహారాలు అన్నీ దాని అత్తగారింటికి సంబంధించినవి జానకి విషయంలో జోక్యం చేసుకునే అధికారం మనకు లేదు ఏదైనా విప్లవ ధోరణి నవలంబిస్తే దాని మీది మంచీ చెడూ ఫలితాలు మనకే సంబంధించి వుండాలి మన ప్రయోగాలకు ఇతరుల్ని బలి చేయగూడదు' అంటూ లేచి వెళ్లారు మరి నాకు అవకాశం లేదన్నట్టుగా

ఆ తర్వాత నాలుగైదు రోజుల్లో జానకి అత్తయ్య వస్తుందని తెల్సినా ఆమె ముఖం చూసే ధైర్యం లేక తిరిగి హైదరాబాదుకు వచ్చేశాను.

* * * * *

నేను వచ్చేసరికి శృతి వాళ్లు ఇంటికి తాళం పెట్టి ఎటో జాలీ ట్రిప్ వెళ్లిపోయారు మైనా ఒక్కతే వుంది మామయ్య చనిపోయినందుకు తనెంతో సానుభూతి చూయించింది నాకు విసుగ్గా అనిపించింది మైనా ప్రవర్తనపట్ల, వ్యక్తిత్వం పట్ల నాకు సదభిప్రాయంలేదు సుచరిత ఎవరో తెలిశాక మైనా అంటే మరీ చిరాకు కలుగుతోంది

మామూలుగా కాలేజీకి వెళ్లి వస్తున్నాము నాలుగు రోజులు కూడా గడవలేదు ఆరోజు గదికి వచ్చేసరికి తలలో విపరీతమైన పోటు ప్రారంభమైంది కాళ్లు చేతులు గొడ్డళ్లతో కొట్టినట్టుగా నొప్పులు పుస్తకాలు బల్లపై పడేసి మంచం మీద వాలిపోయాను

ఎప్పటికో మెలకువ వచ్చింది కళ్లు తెరవడానికి ప్రయత్నిస్తే సూదులు గుచ్చినట్టుగా అయింది

ఉండు అని మైనా అనటం వినిపించింది

లైటార్పి బెడ్‌లాంప్ వెలిగించింది మైనా నేను నెమ్మదిగా కళ్లు తెరిచాను కళ్లు భగ్గున మండుతున్నాయి

బెడ్‌లాంప్ మసగ వెలుగులో నాకేసి ఆదుర్దాగా చూస్తూ వున్న మైనా కనిపించింది కళ్లు పూర్తిగా తెరిచాను

కొంచెం కూర్చుంటావా అమూ? టాబ్లెట్ వేసుకుని కాఫీ తాగొచ్చు అంది

టాబ్లెట్ ఎందుకూ? అన్నాను

బాగుంది! నీకు ఒళ్లు కొంప అంటుకునేంత టెంపరేచర్ వుంది ఇప్పుడు అంది మైనా

'టాబ్లెట్ వుందా?' అడిగాను

"ఇది మరీ బాగుంది! డాక్టర్ కూడా వచ్చి వెళ్లాడు అంది

ఎందుకంత హడావుడి చేశావ్! అన్నాను విసుగ్గా

చేయడానికేమీ పనిలేక అంది కోపంగా

మైనా ముఖం చూస్తే నవ్వు వచ్చింది

సరే, కానివ్వు అన్నాను

కానీ నిజంగానే మైనా హడావుడికి అర్థం వుందనిపించింది లేవడానికి నేను చేసిన ప్రయత్నం ఫలించలేదు!

మైనా సాయం చేసి కూర్చోబెట్టింది టాబ్లెట్ వేసుకుని కొద్దిగా కాఫీ తాగాను ఐదు నిముషాలు కూడా గడవలేదు వాంతి అయింది లేచి బాత్‌రూం దాకా వెళ్లాలని నేను చేసిన ప్రయత్నం వృధా అయింది మంచం పక్కనే ఖరాబు చేశాను

మైనా ఖంగారు పడిపోయింది

నేను అలసటగా వెనక్కు వాలిపోయాను

మైనా బేసిన్ తెచ్చి నా చేత నోరు కడిగించింది లవంగం, ఏలకు ఇచ్చింది వేసుకొమ్మని నేను నీరసంగా కళ్లు తెరుచుకొని చూస్తుండగానే నేను చేసిన గలీజు అంతా శుభ్రం చేసింది

మైనా ముఖంలో అసహ్యం లేదు అసహనం లేదు నా గురించిన ఆత్మీయత వుంది ఆదుర్దా వుంది, మంచం పట్టిన బిడ్డ ఎడల తల్లిలా

మైనా!' అన్నాను ఆర్ద్రంగా

"మాట్లాడకు పడుకో" అంది బుజ్జగింపుగా



# అమృతాంజన్ గ్రైప్ వాటర్

AMRUTANJAN
LTD's
Gripe Water

For Infants and children

Recommended for alimentary disorders such as indigestion Acidity Gripe Flatulence Vomiting and also other digestive Complaints during teething It facilitates digestion promotes sleep and keeps children healthy and Cheerful

| FORMULA | Each 5 ml contains |
| --- | --- |
| Sodium Bicarbonate I P | 0 043 g |
| Dill Oil B P C | 0 00475 ml |
| Chloroform Water I P | 1 7125 ml |
| Alcohol I P | 0 1475 ml |
| Distilled water & Syrup base to make up 5 ml | |
| Alcohol content | 2 8 %v/v |

Net Content 135 ml

DOSAGE For infants under 6 months 2 5 ml (half a teaspoonful) twice a day under 2 years 5 ml (one teaspoonful) twice a day over two years 10ml (two teaspoonfuls) twice a day

Manufactured by AMRUTANJAN LTD
42-45 Luz Church Road Madras 600 004
MADE IN INDIA

Mfg Lic No 16 56

Dt of Mfr
Batch No.

పాప ఆరోగ్యానికి,
సంతోషానికి దివ్యామృతం

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు,
విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి.
ఆకలి, జీర్ణశక్తి బాగా వుంటాయి పాపాయి
ఆరోగ్యం బాగుపడుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్
42-45, లజ్ చర్చ్ రోడ్డు,
మద్రాసు 600 004

**Amrutanjan Limited**

753 TG

మైనా ముఖంలోని మాతృత్వపు అమృత భావాన్ని చూస్తూంటే నేను అమూల్యను కాదేమో! నేను సుచరితనేమో అనిపించింది

ఓ రాత్రి వేళ అడిగాను మైనా నా పేరు సుచరితా?

గుండెలు బాదుకుంది మైనా తన కళ్లలో నీళ్లు తిరిగాయి

అమూ! అమూల్యా! అంది ఆక్రోశించినట్లుగా

పిచ్చిది! నాకు మతి భ్రమించిందని తను భ్రమ పడుతోంది కానీ వివరంగా చెప్పే శక్తి నాకు లేదు అలాగే కళ్లు మూసుకున్నాను

మళ్లీ ఎప్పుడో మేలుకున్నాను

ఎదురుగా టేబిల్ మీది టైంపీస్ ఐదు గంటలు చూపుతోంది ఎర్ర బడిన కళ్లతో, తెల్లగా పాలిపోయిన ముఖంతో ఇంకా నా పక్కన కూర్చునే వుంది మైనా!

వారం రోజులకు గానీ కొంచెం కోలుకోలేక పోయాను ఈ వారం రోజులూ మైనా శెలవు పెట్టింది

సిగ్గుతో, పశ్చాత్తాపంతో చితికిపోయాను నేను 'మగవారి' విషయంలో మైనా ఎందుకలా ప్రవర్తిస్తుందో తెలీదు కానీ మైనాలో వానపాటు లాంటి సాదుత్వం వుంది వెన్నలాంటి మృదుత్వం వుంది తల్లిలాంటి ప్రేమ, కరుణ వున్నాయి మూర్తీభవించిన స్త్రీని, స్త్రీకి ఆభరణమైన మాతృ తత్వాన్నీ చూశాను మైనాలో

మైనా అంటే నాకు అసహ్యం విరాగం చిన్నచూపు తనకు జ్వరం వచ్చినప్పుడు పెద్దగా ఫీలవకుండా నా మానాన నేను కాలేజీకి వెళ్ళిపోయాను శృతి చేసినపాటి సేవ కూడా నేను మైనాకు చేయలేక పోయాను పైగా మైనా ఋగ్మలు చూసి చీదరించుకుని లేచి పోయాను

మరి మైనా!

స్నేహితురాలిలా ఆప్యాయంగా, కన్న తల్లిలా వాత్సల్యంగా, నర్సులా శ్రద్ధగా, సిస్టర్‌లా సేవ చేసింది

నాలో వున్న 'ఉన్నతురాలిని అనే భావాన్ని – కాదు కాదు– అహంభావాన్ని మైనా సహజ సుకుమార స్వభావం నిర్మూలించింది మైనా కంటే నేనేవిధంగా ఉన్నతురాలిని! తనలోని ఔన్నత్యంతోనే మైనా నాలోని ఆ అహాన్ని, తన ఎడల నాలోని చిన్న చూపును సహిస్తోంది క్షమిస్తోంది

నా జ్వరపు వేడి మైనాకు కొంత శ్రమ కలిగించినా నాలోని మాలిన్యాన్ని కొంత వరకు దహించి వేసింది

*   *   *   *   *

నాకు బాగా జ్వరం తగ్గాక ఓ రోజు ఎప్పుడూ చెప్పని విషయం, ఆ పాండు రాజు నిన్ను ప్రేమిస్తున్నట్లు నాకు అనుమానంగా వుంది అంది మైనా నవ్వుతూ

నేను వులిక్కి పడ్డాను

'ఏ పాండు రాజు!' అన్నాను ఆశ్చర్యంగా

ట్యూబ్ లైట్ వెలిగిందిరా బాబూ! అని విసుక్కుంది మైనా

చెప్పకపోతే ఎలా తెలుస్తుంది? అన్నాను

కొన్ని విషయాలు చెప్పకుండానే గ్రహించాలి అరటి పండులా ఒలిచి చెప్తే దాని అందం పోతుంది అంది

నిజమే సుమా! అని కాలేజిలో పాండురాజు పేరు గల వాళ్ళ కోసం ఆలోచించాను

ఎంత ఆలోచించినా ఆ పేరుగల వాళ్లు నాకు కనిపించలేదు

ఇనిషియల్ ఏమిటన్నావ్? అని అడిగాను

నయం కురు వంశమా? పాండు వంశమా? అని అడగలేదు అంటూ కిసుక్కున నవ్వింది మైనా

నాకూ నవ్వు వచ్చింది

సరే నా బుర్ర అనే బల్బు మాడిపోయిందని ఒప్పుకుంటున్నాను గాని ఆ పాండు రాజెవరో నువే చెప్పు అన్నాను

నవ్వుతున్నావు ఆ పాండు రాజెవరో నిన్ను ప్రేమిస్తున్నాడంటే నీకు కోపం రావటం లేదా? అంది మైనా

కోపమెందుకు? ప్రేమించటం మనిషి జన్మ హక్కు కాదనడానికి నేనెవర్ని? తిరిగి నా ప్రేమ నర్పించనంత వరకూ అతని ప్రేమా, అతనూ మూడు పువ్వులూ, పన్నెండు కాయలుగా వర్ధిల్లినా నాకేం బాధ! అన్నాను

మరి ఇదివరకు నీకు వచ్చిన ప్రేమ లేఖల్ని ఎవరివి వాళ్ళకు తిప్పి పంపావు అది కోపం కాదా?

ఊహూ ఫలించని ఆశల్ని పెంచుకో నివ్వకూడదు కనీసం ఫలించవనే విషయాన్ని వాళ్ళకు తెలియ జెప్పటం మన బాధ్యత వాళ్ల ప్రేమ నా వరకూ రానంత వరకూ నా బాధ్యతేమి లేదు నా ముందు పెట్టబడ్డాక నా నుంచి రెస్పాన్స్ వుండదనే విషయం వాళ్ళకు తెలిసేలా చెయ్యటం నా కర్తవ్యం ఎవరి ఉత్తరాలు వాళ్ళకు పంపటంలో నా వుద్దేశమదే

నా నుంచి ఎప్పటికీ ఎవరికీ రెస్పాన్స్ వుండదా అమూ?

నాకు కొంచెం సిగ్గుగా అనిపించింది అయినా నిర్మొహమాటంగా చెప్పాను జీవితంలో దేన్ని గురించయినా అవుతుందనిగాని కాదనిగాని గట్టిగా చెప్పే ధైర్యం మనిషికి లేదు మైనా జరగబోయేది తెలుసుకోలేక పోవడమే జీవితంలో గల అందమైన ఆకర్షణ

నువ్వు చెప్పింది నిజమే అయినా ఒక్క విషయంలో మాత్రం జరగబోయేది నేను కరెక్ట్‌గా చెప్పగలను ఒక్క క్షణం ఆలోచించి సీరియస్‌గా అంది మైనా

ఏమిటది? కుతూహలంగా అడిగాను

మనం – అంటే – మనందరం ఎప్పుడో ఒకసారి తప్పకుండా చచ్చిపోతాము అంది

ఇద్దరం గట్టిగా నవ్వుకున్నాము

ఇంతకూ ఆ పాండు రాజెవరో చెప్పావు కావు అన్నాను

అదేనోయ్, పాండురాజులా తెల్లగా అర్థం కాలేదా? సరే నీ ప్రియమైన తెలుగు మాస్టారు ఐ మీన్ మన తెలుగు లెక్చరర్

అప్పుడే విచ్చుకుంటూన్న గులాబీ, గుండెను రాసుకున్న అనుభూతితో జలదరించి పోయాను

ఈ అనుభూతి కన్నా ఎందుకలాంటి అనుభూతి కలిగించిన్న ఆశ్చర్యం నన్ను వూపి వేసింది ఉక్కిరి బిక్కిరి చేసింది

ఏమిటో ఆ కన్నుల రెపరెపలు! ఆ పెదవుల కదలికలు!

కంగారుగా మైనా కేసి చూశాను

నవ్వుతోంది

(ఇంకా ఉంది)



# ఒయాసిస్

ఎ.యం. అయోధ్యా రెడ్డి



రోహిణీ కార్తె ఎండ-

రాంబాబు తలమీద నిప్పులు కుమ్మరిస్తున్నట్టుగా వుంది. అతడు నడుస్తున్నాడు. పైన సూర్యుడు తీక్షణంగా, కల్లోలిత ప్రాంతంలా వున్నాడు. సూదుల మీద నడిచినట్టుగా సిమెంటు రోడ్డు. పెనం మీది ఆవిరిలా వడగాలి.

రాంబాబు కదులుతున్నాడు.

కాలు విరిగిన గుర్రం బలవంతంగా బరువును లాగినట్టూ, ఆకులు రాలిన చెట్టు కొమ్మ వుండి వుండి గాలికి వూగినట్టూ, చెమటగా జిడ్డుగా అతడు నడుస్తున్నాడు

మిట్ట మధ్యాహ్నపు హైదరాబాధనూ, నాలుగు రోజుల ఆకలి బాధనూ భరిస్తూ, బాధగా బరువుగా కాళ్ళీడుస్తూ ఆగి ఆగి ముందుక్కదులుతున్నాడు రాంబాబు.

పాతికేళ్ళ క్రితం అతనో మధ్య తరగతి మందహాసి కుచేల సంతానంలో ఒకడిగా భూమ్మీద పడ్డాడు. చిన్నప్పట్నుంచీ తక్కువ భోంచేస్తూ ఎక్కువగా చదివాడు.

చెడు తిరుగుళ్ళు అదేపనిగా తిరిగితే సుఖరోగ మొచ్చినట్టు అదేపనిగా చదవటం వల్ల అతనికి కళ్ళజోడూ, బియ్యేలో గోల్డు మెడలూ వొచ్చింది.

బియ్యే పూర్తవటంతో నే తనకిక ఉద్యోగం చేసే ఈడొచ్చిందనుకున్నాడు రాంబాబు. పదమూడేళ్ళ అమ్మాయి పైట వేయటం మొదలెట్టినట్టు అతడు ఉద్యోగాలకు దరఖాస్తులు పంపటం మొదలెట్టాడు.

"పెద్దోడా నీకు పెళ్ళీడొచ్చిందిరా" అంటూ గోల పెట్టారు తల్లిదండ్రులు.

"అవును! ఇంటికి పెద్దవాడు. వెంటనే పెళ్ళి చేసెయ్యాలి" అంటూ వంత పాడారు దగ్గరి బంధువులు.

"ముందు ఉద్యోగం, తర్వాతే పెళ్ళి-" అన్నాడు రాంబాబు.

"కాదు ముందే పెళ్ళి, తర్వాత ఉద్యోగం" అన్నారతనికి జన్మ నిచ్చిన వాళ్ళు

ఆశపడ్డాడు తండ్రి కట్నం కోసం. ఆ కట్నంతో చెయ్యబోయే పెద్ద కూతురి పెళ్ళి కోసం. ఉబలాట పడింది తల్లి రాబోయే కోడలి కోసం.

ససేమిరా వీల్లేదన్నాడు రాంబాబు

తాడు చేతిలోకి తీసుకొని ఉరేసుకుంటానని బెదిరించాడు తండ్రి. బావిలో దూకడానికి సిద్ధపడింది తల్లి.

ఖంగు తిన్నాడు రాంబాబు. చేతిలో మూడు రాజు లున్నాయన్న ధీమాతో డబ్బు గుప్పించి ఎదుటి వాడు మూడు ఆసులు చూపిస్తే డీలా పడిపోయిన వాడిలా సడలి పోయింది అతని బింకం.

మరదలు ఎదురుగా భార్యచేత చివాట్లు తిన్న మొగుడిలాగా గింజుకున్నాడు. కానీ నెల చివరి వారంలో అప్పు దొరకని చిరుద్యోగిలా ఏమీ చెయ్యలేక పోయాడు.

విరక్తిగా నవ్వుకున్నాడు. విరక్తిగానే

# "పద్మవిభూషణ్" డాక్టర్ స్వామినాథన్.



ఈనాడు మనదేశం వ్యవసాయ రంగంలో స్వయం సమృద్ధిని సాధించటానికి గల కారణం ప్రఖ్యాత వ్యవసాయ శాస్త్రవేత్త డాక్టర్ ఎం. ఎస్. స్వామినాథన్‌వంటి శాస్త్రవేత్తలు చేస్తున్న కృషియే.

డాక్టర్ స్వామినాథన్ 1925 ఆగష్టు 7న తమిళనాడు రాష్ట్రంలోని కుంభకోణంలో జన్మించారు

తిరువాన్కూరు, మద్రాసు యూనివర్శిటీలలో ఉన్నత విద్య నభ్యసించిన డా. స్వామినాథన్ 1952లో అమెరికాలో జన్యుశాస్త్రంపై పరిశోధనలు చేసి డాక్టరేట్ పొందారు. ప్రపంచంలోని 30 పైగా యూనివర్శిటీల నుంచి గౌరవ డాక్టరేట్ పట్టాలను పొందిన డాక్టర్ స్వామినాథన్ అమెరికాలోని జనరల్ ఫుడ్స్ సంస్థ యిచ్చే ప్రతిష్టాత్మకమైన 'వరల్డ్ ఫుడ్ ప్రైజ్ అవార్డును పొందారు.

వ్యవసాయ రంగానికే కాకుండా ఆయన స్త్రీల ప్రగతి కోసం విశేషకృషి సలిపారు.

1967లో పద్మశ్రీ అవార్డుతోను, '72లో పద్మభూషణ్ అవార్డు తోను. 89లో పద్మవిభూషణ్ అవార్డుతోను భారత ప్రభుత్వం ఆయనను సత్కరించింది.

భారత వ్యవసాయ పరిశోధనా సంస్థలో పని చేసిన డాక్టర్ స్వామినాథన్ గోధుమల ఉత్పత్తి బాగాపెరిగేందుకు తమ మేధస్సును అందించారు.

కొన్నాళ్ళు ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులుగా పని చేసిన డా. స్వామినాథన్ వ్యవసాయ, గ్రామీణాభివృద్ధి రంగాల ప్రగతికి విశేష కృషి సలిపారు. ఇటీవల డా. నాయుడమ్మ అవార్డును కూడా ఆయన స్వీకరించారు.

1987లో ఆహారోత్పత్తులు, వ్యవసాయ అవసరాలపై నివేదిక అందజేశారు.

–తిలక్

---

వొప్పుకున్నాడు.

భళ్ళున పెళ్ళయింది–

నాలుగేళ్ళు తిరిగేసరికి జేబులోంచి రాలిపడిన చిల్లర డబ్బుల్లా భూమ్మీద పడ్డారు ముగ్గురు సంతానం. తన బాధ్యత తన తండ్రి పట్టించుకోనట్టే రాంబాబు తన పిల్లల్ని పట్టించుకోలేదు. మున్సిపాలిటీ మురుక్కాలువల్లా నిర్లక్ష్యంగా వొదిలేశాడు వారిని.

ఓణీల దశ దాటి చీరల్లోకి వొచ్చాక్కూడా పెళ్ళికాని అమ్మాయిలాఆరేళ్ళ నుండీ అతనికి చిన్నపాటి ఉద్యోగం కూడా దొరకలేదు. తిరిగి తిరిగి అతని వొళ్ళు హూనమైంది. ఇల్లు ర్నానాను నరకమైంది.

ఫలితంగా ఓ రాత్రి అతడు పారిపోయాడు. బుద్ధుడికి వారసుడిలా తెల్లారేసరికి ఇంట్లోంచి మాయమయ్యాడు. డబ్బున్న ఆడపిల్ల నగలతో లేచి పోయినట్టు నిరుద్యోగి రాంబాబు సర్టిఫికెట్లతో లేచి పోయాడు.

ఆ లేచి పోవటం అతడు నేరుగా భాగ్యనగరం ప్రవేశించాడు. కలరా వ్యాపించినట్టు నగరం మూలమూలలా ఉద్యోగం కోసం తిరిగాడు. నో వేకెన్సీల లాఠీ దెబ్బల్ని తిన్నాడు. ఆకలేస్తే కుళాయిల్లో నీళ్ళు తాగాడు. రైల్వే స్టేషన్ ప్లాట్ ఫారాల మీదా, దుకాణాల మెట్ల మీదా కునుకులు తీశాడు.

అయిదు రోజులు గడిచేసరికి మంచి నీళ్ళకి లొంగని శత్రువొకడు అతని కడుపులో పుట్టుకొచ్చాడు. ఆ శత్రువు కసిగా అతని కడుపులో పేగుల్ని కొరికెయ్యసాగాడు.

ఆకలి తన మీద ప్రకటించిన యుద్ధానికి రాంబాబుకి ఊపిరి పీల్చటం కష్టంగా తయారయ్యింది. కడుపులో ప్రహరీ గోడ మీద గాజు పెంకులు మొలిచినట్టుగా వుంది.

దానికి తోడు శరీరానికి అతిదగ్గరగా వేయి కాగడాలు వెలిగినట్టు భరించరాని ఎండ దహించేస్తోంది.

అతడు కాళ్ళీడుస్తున్నాడు–

సర్టిఫికెట్లు పెట్టుకున్న చిరుగుల సంచీ అతని భుజానికి దయ్యం నీడలా వేలాడుతోంది. పెరిగిన గడ్డం, మాసి చిరుగులు పట్టిన గుడ్డలు, లోతుకు పోయిన చెంపలు, గాజులా జీవం లేని కళ్ళు– పూడ్చటం మర్చిపోయిన గొయ్యిలోంచి లేచి బయటి కొచ్చిన శవంలా వున్నాడతను.

ఊపిరి ఎగబీలుస్తూ ఓ చోట ఆగిపోయాడు రాంబాబు. ఎదురుగా ఏదో పెద్ద హోటల్. మెట్ల ముందుగా నిలబడి లోనకు చూశాడు. క్రిక్కిరిసి వున్నారు జనం తింటూ.... కబుర్లాడుతూ.

వాళ్ళంతా తమ తమ ఇళ్ళలో తినటం మానేసి హోటల్లోనే తింటున్నట్టుగా అన్పించింది రాంబాబుకి.

హోటల్నీ, హోటల్లోని మనుషుల్నీ చూడగానే అగ్నిలో ఆజ్యం పోసినట్టు మరింతగా విజృంభించాడు ఆత్మారాముడు. పక్కనే "భోజనం తయార్" అన్న బోర్డు శూలమై పొడిచిందతన్ని.

తట్టుకోలేక పోయాడు రాంబాబు. ఒళ్ళు తూలిపోసాగింది. పరిసరాలు గిర్రున తిరుగుతున్న అనుభూతి పొందాడు. కోరలు తొడుక్కున్న ఆకలి వికృత హస్తంతో హోటల్లోకి నెట్టిందతన్ని.

గుండెలో దడ, కడుపులో ప్రళయం– కారుతున్న చెమటల్ని అరచేతులో తుడ్చుకుంటూ వెళ్ళి ఓ మూలగా కుర్చీ చూసుకొని కూలబడ్డాడు.

"ఏం కావాలి సార్!" అని మర్యాదగా అడగబోయిన అటుగా వచ్చిన సర్వర్ ఓ క్షణం రాంబాబుని ఎగాదిగా చూసి "ఏం కావాలి?" అన్నాడు పొడిగా.

సర్వర్‌కేసి చూడలేక పోయాడు రాంబాబు. అతడి ఎక్స్‌రే చూపులు రాంబాబుని కలవరపెట్టాయి.

"ఒక ఫుల్ మీల్స్" అన్నాడు ఎట్లాగో గొంతు పెగల్చుకొని.

సర్వర్ వెళ్ళిపోయాడు. రాంబాబు కాస్త నిటారుగా కూర్చొని మంచినీళ్ళు తాగుతూ చుట్టూ కలియ జూశాడు.

హోటల్‌కి తగినట్టుగా మనుషులంతా ఖరీదుగా వున్నారు. తనొక్కడే వెలేసినట్టుగా వెలవెల బోతున్నాడు.

# ఒయాసిస్

రాంబాబులో ఏదో కసి పుట్టుకొచ్చింది. తను.... తన ఆకలి.... తన అవతారం.... కుప్పపోసినట్టుగా తన దరిద్రం.... ఇలా ఎందుకుండాలి....?వాళ్ళందరూ అలా ఎందుకుండాలి....??

వీధిలోకి వెళితే తనలాంటి వాళ్ళూ, తనకన్నా దీనంగా వుండేవాళ్ళూ ఇంకా ఎందరో....! నిజానికి తమ సంఖ్యానే ఎక్కువ.

దరిద్రం కౌగిట్లో అనుక్షణం గిలగిలలాడే వాళ్ళూ, పస్తులతో పేగులు మెలితిరుగుతున్న వాళ్ళూ అందరూ వొక్కసారిగా ఈ మనుషుల్లోకి వొచ్చి వీళ్ళందరి మీదా విరుచుకు పడితే....?? హాయిగా తమకు కావాల్సింది కడుపునిండా తింటే....?

"కడుపు నిండా" అనే తన ఆలోచనకు నవ్వుకున్నాడు రాంబాబు.

పెద్ద ప్లేటులో చక్కటి భోజనం తెచ్చాడు సర్వర్. రాంబాబు ఒక్కసారిగా జలదరించి పోయాడా భోజనం చూసి.

* * * * * * *

హఠాత్తుగా హోటల్లో కలకలం–

తింటున్న వాళ్ళంతా తలలు తిప్పి కౌంటర్ వైపు చూశారు. కౌంటర్లో వుండాల్సిన మేనేజర్ అక్కడ లేదు. మేన్‌డోర్ దగ్గిర ఎవర్నో వొంగోబెట్టి గుద్దుతున్నాడు. అంతటి భారీ మనిషి తన ముందున్న బక్క పల్చటి మనిషిని కొట్టడానికి ఆయాసపడి పోతున్నాడు.

"క్యాబే సాలే....! ఏ హోటల్ తెరా బాప్‌కా సమ్‌జే...? బిల్ ఛరో నైతో మార్‌డాలుంగా–" క్రూరంగా అరుస్తున్నాడు మేనేజర్.

"అరే ఏమైంది సేఠ్....? పాపం.... ఏంది గా బక్కోని గంతగనం కొడ్తున్నవ్?" అప్పుడే హోటల్లో ప్రవేశిస్తున్న ఓ కస్టమర్ అన్నాడు.

"పాపమేంది.... పుణ్యమేంది సార్...! ఓ మాదర్చోద్ గాడు గొంతు దాకా మెక్కి పైసలు తెవ్వంటండు–"

"అరే.... పైసలు లేంది ఎందుకొచ్చావయ్యా....?" ఎవరిదో సానుభూతి.

"అవతారం చూస్తే తెలియటం లేదూ....! బిచ్చగాడికి ఓ మెతుకు పెడుతున్నట్టు. వీడు ఆర్డర్ చేస్తే మాత్రం సర్వర్ తెలివి [illegible] మనిషిని చూసుకోవద్దూ.... [illegible]"

"ఐసే ఛోర్ సాలే సిడిమే [illegible] హై. ఛోడ్‌నా నై ఇసే. పోలీస్‌కో హవాలా కర్‌దో –" ఎవరో సలహా పారేశారు.

"పోలీసు లెందుకు....? నాలుగు తన్ని బయటకు గెంటియ్యక...."

"వొద్దు....! తిన్నదరిగేదాకా కిచెన్‌లో ఏదన్నా పని చెప్పండి"

"ఆఁ.... వాడి మొహం...! గడ్డిపోచలా వున్నాడు. వాడేం పని చెయ్యగలడు?"

అందరూ తలో మాటా అంటున్నారు.

కొట్టి కొట్టి అలసిపోయిన మేనేజర్ భారీ శరీరం నిలబడి ఆయాసంతో రొప్పుతోంది.

దెబ్బల్నీ, జనం మాటల్నీ వింటూ తలొంచుకొని మౌనంగా నిలబడి పోయాడతను. ఒక్క మాట కూడా మాట్లాడ లేదు.

ఇంకెందుకు నిలబడ్డవ్ బే....! ఛల్.... బాహర్ ఛల్" అతడి మెడమీద చెయ్యేసి కసికొద్దీ బయటకు నెట్టాడు మేనేజర్.

వెళ్ళి రోడ్డు మీద పడ్డాడతను. భుజానికున్న సంచీ దూరంగా వెళ్ళి పడిలింది. రెండు నిముషాల తర్వాత శక్తి కూడగట్టుకొని నెమ్మదిగా లేచాడు. సంచీ అందుకొని భుజానికి తగిలించుకున్నాడు.

అతడికి కోపంగానీ.... దుఃఖంగానీ రావటం లేదు. అంత క్రితం ఆకలి బాధతో పోల్చితే దెబ్బల బాధ స్వల్పంగా తోచింది.

– "కొడితే కొట్టారు. కడుపు నిండా తిండి మాత్రం దొరికింది" అనుకున్నాడు పెదవి చిట్లి కారిన రక్తాన్ని తుడుచుకుంటూ.

అతడు నడుస్తున్నాడు–

ఇప్పుడతని అడుగులు స్థిరంగా పడుతున్నాయి. పైన ఎండ కూడా అంత తీక్షణంగా అన్పించటం లేదు.

"నేను బతగ్గలను–" అనుకున్నాడు. నడక వేగాన్ని పెంచుతూ నిరుద్యోగి రాంబాబు. ●

## గడుసులోకం

– బాబు






పెద్దకథ

# చచ్చి ఏం సాధిస్తావ్? – కొమ్మిడి మత్స్యేంద్రరెడ్డి

(గత సంచిక తరువాయి)

మాస్టారు వెళ్ళేవరకే ఊపిరి బిగబట్టి చింతతో పుల్లో ... ట్టు క్రింద కూర్చుని వున్నాడు రామరాజు. అతనికి కొద్దిదూరంలో మోటారు సైకిలు నిలబడివుంది చిన్న బాటిలు లోంచి నేరుగా త్రాగివేస్తున్నాడు

పూర్తిగా నిమిషించేంత వరకు గమనించలేదతడు చూసిన తర్వాత మాత్రం కంగారుపడ్డాడు లేవాలనుకుని కూడా కూర్చున్న చోటునుండి అంగుళం మేరకు కూడా కదలలేకపోయాడు జీవితంలో మొదటిసారిగా ఎదురయిన భయంకర క్షణాలు.

ఏం బాబూ' అమ్మాయికి బదులు ఆమె తండ్రి వచ్చాడేమిటా అని ఆశ్చర్యపోతున్నావా? తనూ అక్కడే చతికిలబడుతూ అన్నాడు మాస్టారు

బదులు చెప్పలేకపోయాడు రామరాజు అతడింకా షాక్ నుండి తేరుకోలేదు

ఈ విషయం నాకెలా తెలిసిందని అనుకుంటున్నావా? నిర్లిప్తంగా నవ్వాడు తన ప్రశ్నకు తానే నీకు తెలియదు బాబూ- పెళ్ళికి ఎదిగివున్న అమ్మాయి ఇంట్లో వున్నప్పుడు ఆ కన్నతండ్రి రాత్రిళ్ళు నిద్రపోలేడు అయినా- కూతురు పెళ్ళి కావాలంటే ఆమె తండ్రే కదా బాబూ ముందు మాట్లాడేది అందుకని నేనే వచ్చేసాను- మళ్ళీ మాస్టారే మాట్లాడాడు రామరాజు వంక నిశితంగా చూస్తూ.

రామరాజుకు మాత్రం పరిస్థితి అయోమయంగా వుంది వున్నపళంగా ఆ చోటునుండి అదృశ్యమయిపోతే బాగుండుననిపించిందాక్షణం

చూడు -రామరాజూ' అమ్మాయిని రమ్మన్నావుట' పట్నం వెళ్ళి పెళ్ళి చేసుకుందామన్నావుట '

ఆ విషమ పరిస్థితిలోంచి ఎలా బయట పడాలా అని తీవ్రంగా ఆలోచిస్తున్న రామరాజు మాస్టారి మాటలు వింటూనే తళుక్కున స్ఫురించింది వుపాయం ఆ ఆలోచనలోని వుచితానుచితాలను ఏమాత్రం పట్టించుకో దలచుకోలేదు అందుకే మాస్టారు మాటలకు అడ్డు తగిలాడు. -అదేమిటండీ' నేను మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాననటం ఏమిటి? అలా అని చెప్పిందా? సాధ్యమైనంత అమాయకంగా ముఖం పెట్టి ఎదురు ప్రశ్నించాడు

ఈసారి దిగ్భ్రాంతి చెందడం మాస్టారు వంతయింది ఏమని సమాధానం చెప్పాలో తెలియలేదు

చలేవారే మాస్టారూ' మా నాన్న ఎలాగూనా పెళ్ళి చెయలేని స్థితిలో వున్నాడు వుద్యోగం చేస్తానంటే కూడా ఒప్పుకోవటం లేదు అందుకే ఇంట్లో తెలియకుండా వచ్చేస్తాను పట్నంలో ఏదో ఒక వుద్యోగం చూపిస్తే తన దారిన తను బ్రతుకుతానని మీ అమ్మాయి అదేపనిగా కన్నీళ్ళు పెట్టుకోవటంతో జాలివేసి సరేనన్నాను అంతేకాని- నేనెమిట మాస్టారూ మీ అమ్మాయిని పెళ్ళి చేసుకోవటం? అందమయిన అమ్మాయితో పాటు నాలుగు లక్షలు ఇస్తుకుంటామని ఎంతో మంది మా వద్దకు వస్తుంటే మీ అమ్మాయిని చేసుకోవడమేమిటి? పాఠం అప్పచెప్పినట్లుగా గడగడా అనేసి ముఖం తుడుచుకున్నాడు.

అవాక్కయిపోయాడు మాస్టారు. 'నీచుడా! చేసిన మర్మార్గాన్ని కప్పి పుచ్చుకోవటానికి ఎంతకు తెగించావురా? ఒక అమాయకురాలి బ్రతుకులో నిప్పులు పోయటానికి కూడా సిద్ధపడ్డావన్నమాట'




అతడంత పచ్చిగా బొంకుతుంటే కలిగిన అసహ్యంతో లోలోనే కుమిలిపోయాడు

ఇప్పుడనుకుంటే ఏం లాభం! ఆకు వెళ్ళి ముల్లుపై పడ్డా - ముల్లు ఆకుకు తాకినా నష్టం కలిగేది మాత్రం ఆకుకే ఈ విషయం గుంభనగా, భూస్థాపితం కానీ! ఇతడిని నిలదీసినా ఏం

## 'మృచ్ఛకటికం'లో మూన్ మూన్ సేన్

హిందీ, తెలుగు చిత్రాలలో నటించిన మూన్ మూన్ సేన్ సంస్కృతంలో తీయబోయే టి.వి. సీరియల్ 'మృచ్ఛకటికం'లో ప్రధాన పాత్ర పోషించనున్నది. అసలుసిసలైన భారతీయ మహిళ చందంగా వుండే ఈమె ఈ సీరియల్‌లో ప్రధాన పాత్రకు సరిపోతుందని అంటున్నారు. వేరే చిత్రాలలో ఆమె డైలాగులు డబ్ చేసినట్లే సంస్కృతంలో కూడా డబ్ చేయవలసి వుంటుంది. మరి మూన్ మూన్ గొంతుకు సరిపడే విధంగా సంస్కృతంలో ఎవరు డైలాగులు చెప్తారో, ఏ మేరకు ఆమె తన ప్రతిభతో ప్రేక్షకులను అలరింప చేస్తారో వేచి చూడాలి! తమాషాగా వున్నది కదూ! అందరూ అన్ని భాషా చిత్రాలలో నటించవచ్చును. వెనుకటి స్వర్ణయుగ వరవ్యవస్థలోనూ అలంకరణప్రాయంగా వేయలేదా?



ప్రయోజనం - అమ్మాయి బ్రతుకు బజారు పాలవుతుంది అసలు రెండు చేతులు కలవంది శబ్దం మాత్రమెలా వస్తుంది? పరిపరివిధాలుగా ఆలోచించి, చివరికి - ఆ విషయాన్ని అంతటితోనే వదిలేయడం క్షేమమని నిశ్చయించుకుంటూ రామరాజును పల్లెత్తు మాట కూడా అనకుండా- కనీసం అతడివైపు కన్నెత్తి చూడనైనా చూడకుండా భారంగా ఇంటిత్రోవ పట్టాడు

జరిగిన విషయం తండ్రి చెప్తుంటే విస్మయంగా విన్నది లావణ్య నాభిలోంచి పుట్టుకొచ్చిన ఒక విచిత్రమైన గగుర్పాటు ఎదలో నిండిపోయి ఊపిరి సలపనీయకుండా ఉక్కిరిబిక్కిరి చేసింది ఏడుద్దామనుకుంది కాని కళ్ళలోకి తడిరాలేదు అందరివైపు మార్చి మార్చి చూస్తూ వుండిపోయింది రామరాజు కట్టు కథను ఎవరయినా నమ్ముతున్నారా అని - ఒక వేళ వారిలో ఏ ఒక్కరు నమ్మినా ఆ రాత్రికే ప్రాణాలు విడవాలనుకుంది కాని ఎవరిలోనూ అలాంటి భావం ద్యోతకం కాలేదు తన కుటుంబ సభ్యులు తనపై పెంచుకున్న నమ్మకానికి ఎదలో మరింత వత్తిడి ప్రారంభమయింది

నాన్నా అంటూ ఏదో చెప్పబోయింది లావణ్య కాని చేత్తోనే వారించాడు మాస్టారు

"చూడు తల్లీ" నాకంటేమీ చెప్పొద్దు జరిగినదంతా మన మంచికే అనుకుందాం ఈ సంఘటన నీకు మరికొంత అనుభవాన్ని నేర్పితే అంతే చాలు! ఆఁ- ఇక పడుకో అమ్మ! ఇప్పటికే చాలా పొద్దుపోయింది- అంటూ లేచాడు, అసలారాత్రి ఏమి జరగనట్లే

అందరూ ఆ సంఘటనను ఒక పీడకలగా మర్చిపోవాలని ప్రయత్నిస్తున్నారు ఆ ప్రయత్న ఫలితంగానే - ఆ ఇంట్లోకి ఒక విధమైన స్తబ్దత - వారి జీవితాల్లోకి ఒకరకమైన నిర్లిప్తత ప్రవేశించింది ఎవరికి వారే యాంత్రికంగా రోజులు గడిపేస్తున్నారు

* * * * *

దాదాపు రెండు నెలల తర్వాత - చేదు గతమంతా మరుగున పడిపోతున్న సమయంలో శాస్త్రులు మోసుకు వచ్చిన ఒక వార్త మళ్ళీ ఆ గడపలో కలకలం రేపింది

-అబ్బాయి చాలా బాగుంటాడట అనసూయా! అమ్మాయిని కూడా ఇదివరకే కాలేజీలో చూసుకున్నాడట ఇంకో వారం రోజుల్లో నేరుగా ముహూర్తాలు పెట్టుకోవటానికే వస్తున్నారట చాలా కాలం తర్వాత చిన్న పిల్లాడిలా సంబర పడిపోతూ చెప్పాడు మాస్టారు

భర్తనా స్థితిలో చూస్తుంటే పులకరించి పోయింది ఆవిడ హృదయం

మరి - కట్నకానుకలు వద్దనుకుంటూనే నసిగింది వుండబట్టలేక

-ఆ చింతేమీ అక్కర్లేదోయ్! అన్నీ కలిపి పాతికవేలు వాళ్ళ చేతుల్లో పెడితే సరిపోతుందట ఇక పెళ్ళితంతు ఎలా జరిపించినా మనిష్టమేనని శాస్త్రులుతో కబురుపెట్టారు

అంత సంతోషకరమైన వార్త చెబుతుంటే కూడా భార్య వహించిన మౌనం అతడిని చికాకు పరిచింది

-చూడు అనసూయా! బ్యాంకులో ఇరవయి వేలు సిద్ధంగా వున్నాయి అయిదు వేలు కలిపి వారికిచ్చేస్తే ఆ సమస్య తీరిపోతుంది పెళ్ళి ఖర్చులకు మరో అయిదు - ఘనంగానే చేద్దాం

అంటే ఇంకా పదివేలు కావాలి! అంటూ ప్రశ్నిస్తున్న అనసూయమ్మ చూపులకు చిరునవ్వుతో జవాబు చెప్పాడు అది జరిగిపోయిందోయ్! ఈ ఇల్లుకు బేరం పెట్టాను ఆ తర్వాత మనం వుండేందుకు అద్దె ఇల్లు కూడా చూసాను ఏది ఏమయినా- అప్పు అయితే చేయటం లేదు నా పెన్షను ఎలానూ వస్తుంది ట్యూషన్ల డబ్బులు కూడా ఏవో వస్తూనే వున్నాయి వుత్సాహంగా చెప్పుకు పోతున్న భర్త వైపు ఆనందాశ్చర్యాలతో చూస్తుండి పోయింది అనసూయమ్మ ఆమెకప్పుడు భవిష్యత్తు గురించిన ఆలోచన లేదు- ఆందోళన లేదు అందుకు ఒక్కటే కారణం. తన భర్తలో ఇంకా శక్తి వుంది వుత్సాహం వుంది ఇంట్లో నవ్వులు కురుస్తున్నాయి బిడ్డ జీవితం బంగారు పూలు పూయబోతున్నది ఇక తనకే విచారం లేదు అన్నీ సరిచూసుకోవటానికి తన భర్త వున్నాడు అది చాలు- తృప్తిగా కళ్ళు తుడుచుకుంది

మరో రెండు రోజులు గడిచిపోయినయి ఇంటికి వెల్ల వేయటం పూర్తయింది పెళ్ళికి కావలసిన సరకులు- బట్టలు తేవటానికి శాస్త్రులును మరునాడే పట్నం పంపించాలని అనుకున్నారు ఇక ఇల్లు అమ్మకం విషయం పెళ్ళి జరిగిన తర్వాత ఖరారు చేసే విధంగా- డబ్బు మాత్రం ముందే ఇచ్చేట్లుగా మాట్లాడు కున్నారు కొనే ఆసామి కూడా ఆ వూరి వాడే కావటం మూలానా- మాస్టారి నీతి- నిజాయితీలను ఎంతో కాలంగా చూస్తున్నందున వలన ఆ విషయంలో ఏ పేచీ రాలేదు అంతా సవ్యంగా - చకచకా జరిగి పోతున్నది

* * * * * *

సంధ్య చీకట్లింకా విచ్చుకోలేదు చీకటి- వెలుతురూ కాని సంధ్య వెన్నెల లాంటి మధ్యమ స్థితి అప్పుడప్పుడే నిద్రలు లేచిన పక్షుల కువకువలు- కూతలు- కావుకావులు ఇళ్ళ వద్ద కట్టేసుకున్న గొడ్లను లేగలను విడుచుకుని పొలాల వైపు సాగిపోతున్న రైతులు వాకిళ్ళు వూడుస్తూ- కళ్ళాపులు చల్లుతూ ముగ్గులు సింగారిస్తూ మరో శుభోదయానికి హడావిడిగా స్వాగత సన్నాహాలు చేస్తున్న ఇల్లాళ్ళూ- కన్నె పిల్లలూ

ఎప్పటిలాగే- ప్రతిరోజులాగే రాజాపురంలో మళ్ళీ తెల్లవారింది మరో దినం ప్రారంభమయింది

కాని- కాని వాతావరణంలో మాత్రం ఏదో వెలిత సన్నగా వీస్తున్న చల్లని గాలిలో ఏవో అనిశ్చితమయిన ప్రకంపనాలు

ఊరికి పడమటనున్న మాస్టారు యింటి వైపు పరుగు తీస్తున్నాడొక వ్యక్తి అంత చల్లదనంలోనూ అతడి నుదుటి నుండి చెంపల వెనగ్గా జారుతున్న స్వేదం.

పూల మొక్కలకు నీళ్ళు పోయాలని బయటకు వచ్చిన మాస్టారు వాకిట్లోనే నిలబడి పోయాడు ఆగంతకుడిని ప్రశ్నార్థకంగా చూస్తూ

అతడు చెప్తున్న మాటలు వింటూంటే నోసలు ముడి పడిపోయింది క్రమక్రమంగా కళ్ళు వెడల్పుగా విచ్చుకున్నాయి రక్త పర్యం వాల్చి పటల్లన పగిలి పోతాయేమో నన్నంత విశాలంగా విచ్చుకున్నాయి ఆ చూపుల్లో అంతులేనంత అపనమ్మకం- కోటాను కోట్ల విశావాలు ఒక్కసారిగా ముట్టడించి దేహంలోని రక్తమంతా పీల్చేసినట్లు తెల్లగా పాలిపోయిన ఆ వృద్ధుని ముఖంలో బ్రహ్మాండం

# చచ్చి ఏంసాధిస్తావ్?

బ్రద్దలవుతున్నప్పటి భయం- గగుర్పాటు

**కనురెప్పలు కొట్టటం పూర్తిగా మర్చి పోయాడు ఊపిరి పీల్చటం ఆగిపోయింది ఆ క్షణం పూర్తిగా అచేతనుడయి పోయాడు**

'మాస్టారూ మాస్టారూ అయ్యో ఆయనను ఆ స్థితిలో చూస్తున్న ఆ వ్యక్తికి కూడా కాళ్ళలో వణకుపుట్టి ఆదుర్దాగా పిలిచాడు

అప్పుడు వచ్చింది మాస్టారులోకి చైతన్యం వులిక్కిపడి చూసాడు

మరుక్షణం వూరికి వుత్తరం వైపు పరుగు తీసాడు ఆ వయసులోనూ అతడిలో ఏదో శక్తి ప్రవేశించింది అతడికి కొద్ది దూరంలో అనుసరించింది అతడి దర్మపత్ని అనసూయమ్మ

ఆయన అడుగుల ధ్వనికి ఆ వుదయం అంతా గడగడ వణకి పోయింది చేస్తున్న పనులు విడిచి అందరూ ఆ దిశకే దౌడు తీసారు

అక్కడ- చిన్న చిన్న పలుగురాళ్ళ గుట్టపైపడి వుంది లావణ్య ఆ పేరులోని లావణ్యం అంతా శరిరంలోకి పాకి ప్రశాంతంగా నిద్రపోతున్నట్టు గా వుంది పక్కనే పడివున్న ఎండ్రిను డబ్బా

ఆ దృశ్యం చూసిన అందరూ అప్రతిభు లయ్యారు కళ్ళముందు కనిపిస్తున్నది నిజమా కాదా అన్న సందిగ్ధత

కూతురును చూసిన అనసూయమ్మ గుండెలు మాత్రం ముక్కలయి పోయినయి ఆమె రోదనకు అప్పుడప్పుడే వుదయిస్తున్న బాల భాస్కరుడు భయపడి పోయాడు పదహారేళ్ళ సీత తన అక్క మరణాన్ని ప్రత్యక్షంగా చూస్తూ చిగురుటాకులా వణకి పోయింది ఏడుస్తూనే తల్లిని ఓదార్చాలని విఫల ప్రయత్నం చేస్తూండి పోయింది ఆమె ఒక్కతే కాదు- శాపగ్రస్థులయిన ఆ కుటుంబాన్ని ఆదుకోవాలని వూరు వూరంతా ఆ సమయంలో ఆరాటపడి పోయింది

ఇంత జరుగుతున్నా మాస్టారు కనుపాపల్లో మాత్రం తడి చిప్పిల్ల లేదు మానవునికి మరణం అతి సహజం అని తెలిసివున్న ఋషిలా నిర్వికారంగా నిలబడి పోయాడు జీవికి మరణం సహజమే! కాని కాని ఇదేమిటి ఇరవయి వసంతాలయినా నిండని తన పాప- ఇన్నేళ్ళు అపురూపంగా పెంచుకున్న తన చిట్టి తల్లి- తన చిట్టి తల్లి ఎలా మరణిస్తుంది? అర్ధాంతరంగా ఎలా వెళ్ళి పోతుంది? అసలు వెళ్ళిపోవాలనే ఊహ ఎలా పుట్టింది? అన్నింటిలోనూ అత్యంత పవిత్రమయిన ఈ మానవ జన్మను ఏమాత్రం జీవించకుండానే ఇలా ఇలా అర్ధాంతరంగా ఎందుకు ఆత్మార్పణం చేసుకుంది? ఓహ్! తల్లీ! ఎందుకమ్మా? ఎందుకు? ఎందుకు? రక్తం చిమ్ముతున్న ఆయన హృదయంలో ప్రళయం హోరుమని ఎగిరి పడింది

ఆయన ఆ స్థితిలోనే తిరిగి ఇంటికి చేరుకున్నాడు వాకిట్లో పరిచిన గడ్డిలో పడుకో బెట్టిన తన [illegible] శరిరాన్ని ఇంకేమాత్రం బాదించటం యిష్టం లేని సూర్య బగవానుడు నెమ్మదిగా మబ్బుల చాటుకు తప్పుకున్నాడు

ఒక్కసారిగా మొల్లున లేచిన హృదయవిదారక రోదన ధ్వనికి గుమ్మాని కానుకుని స్వప్నావస్థలోకి కూరుకుపోయిన సీత తృళ్ళిపడింది

శవాన్ని లేవదీస్తున్నారు కూతురు శవాన్ని ఎవరినీ ముట్టనీయటం లేదు అనసూయమ్మ ఆమె రోదన రాళ్ళను కూడా కరిగిస్తుందా! అన్నట్టుంది

మాస్టారయితే- ఒక విదమయిన వున్మాద స్థితిలో వున్నాడు తనలో తానే గొణుక్కుంటున్నాడు నిర్వేదంగా నవ్వుకుంటున్నాడు వుండుండి బిగ్గరగా ఏడుస్తూ తల కొట్టుకుంటున్నాడు అయిదు నిమిషాల కొకసారి లేచి వచ్చి కూతురు శవానికి మోకరిల్లు తున్నాడు వారినా పరిస్థితిలో చూస్తున్న ఆ వూరు మూగగా కన్నీరు కారుస్తూ వుండి పోయింది గ్రామస్థులు అతి ప్రయాసతో తల్లిదండ్రులను పట్టుకున్న తర్వాత శవయాత్ర ఆరంబ మయింది

సీత కళ్ళలో దీపం పెట్టి వెతికినా తడి కన్పించటం లేదు అది కూడా ఒక రకమయిన వున్మాద స్థితి గతరాత్రి చివరిసారిగా తోబుట్టువు- రక్తం పంచుకుని పుట్టిన తన అక్కతో గడిపిన క్షణాలు గుర్తొచ్చినయి

గతరాత్రి నిండుపున్నమి పిండారబోసి నట్టుంది వెన్నెల ఆ వెలుగులో వెల్లకిలా పడుకుని ఆకాశాన్ని తదేకంగా చూస్తున్న లావణ్య వద్దకు వచ్చింది సీత

అక్కా ' నెమ్మదిగా పిలిచింది తల తిప్పి చెల్లెలు వంక చూసింది లావణ్య ఆ కళ్ళలో చిత్రమైన కాంతి

ఏమిటక్కా- ఆలోచిస్తున్నావ్' బావగారి గురించా' తెచ్చి పెట్టుకున్న వుత్సాహంతో చిలిపిగా అనాలని ప్రయత్నించింది సీత

రామరాజు సంఘటన జరిగినప్పటి నుండీ లావణ్య ఎవరితోనూ చనువుగా వుండటం లేదు ఏమాత్రం అవకాశం దొరికినా ఒంటరిగా వుండటానికి ప్రయత్నిస్తున్నది సీత ఎంత ప్రయత్నించినా ఆమెను మళ్ళీ పూర్వపు మనిషిని చేయలేక పోయింది

బావగారి గురించే కదూ ఈసారి పక్కన కూర్చుని బుజాలు పట్టుకుని రెట్టించింది

ఆదో విదంగా నవ్వింది లావణ్య ఆ మాటలకు అవునూ సీతా ఆ నాడు రామరాజు చెప్పిన విషయాన్ని- అదే, నేనే అతడిని ప్రోత్సహించాననే విషయాన్ని నువ్వు కూడా నమ్మావా?" హఠాత్తుగా ఆ ప్రస్తావన రావటంతో విస్తుపోయిన సీత వెంటనే తేరుకోలేక పోయింది

నువ్వు నమ్మినట్టే వున్నావు చెల్లెలి చేయిని గుండెలపై వుంచుకుంటూ మళ్ళీ తనే అంది

## మీ జి. కె. ఎంత? 5కి జవాబులు

1. నార్వేకి చెందిన నోనికాక్రిస్టియన్‌సెన్
2 కాథరీన్ హెప్‌బర్న్ ఈమెకు నటిగా మొత్తం నాలుగు ఆస్కార్లు లభించాయి. ఆ సినిమాలు . మార్నింగ్ గ్లోరి (1932) "గెస్ హూ ఈజ్ కమింగ్ టు డిన్నర్" (67) దలయిన్ ఇన్ వింటర్ (68) ఆన్‌గోల్డెన్ పాండ్(81)
3 వీరందరిక రెండు సార్లు అత్యంత ప్రతిష్ఠాత్మకమైన నోబెల్ బహుమతి లభించింది.
   లైనస్‌పాలింగ్ కెమిస్ట్రీ (1954). శాంతి (1962)
   మేడమ్‌క్యూరీ . ఫిజిక్స్ (1903); కెమిస్ట్రీ (1911)
   జాన్‌బార్డీన్ · ఫిజిక్స్ (1956, 72)
   ఫ్రెడరిక్‌సాంగర్ . కెమిస్ట్రీ (1958, 80)
4. బెల్గాం (కర్నాటక) శాసనసభా నియోజక వర్గానిక జరిగిన ఎన్నికలలో మార్చి 5, 1985న ఉపయోగించ బడింది. అభ్యర్ధుల సంఖ్య 301.
5. అమెరికాకి చెందిన ఆల్బర్ట్ పి. క్రారీ
6. ఉస్తాద్ ఇసా
7 రామేశ్వర్ దయాళ్
8. రవీంద్ర జైన్ ప్రారంబగీతానిక స్వర్గీయ జయదేవ్.
9 జినీవా
10 ఛున్‌కంగ్

లావణ్య ఆ కంఠంలో విపరీతమైన వెలితి ఏదో అవ్యక్తమయిన వింత ప్రకంపన

సీత కళ్ళలో గిర్రున నీరు తిరిగింది అమాయకంగా అడుగుతున్న అక్కపై విపరీతమైన వాత్సల్యం పొంగు కొచ్చింది అకస్మాత్తుగా లావణ్యను కౌగలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది

"ఆ విషయం పోనీ మర్చిపో' కొద్ది సేపటి తర్వాత చెల్లెలి తల నిమురుతూ అంది లావణ్య

అందుకనేనా అక్కా! ఆ అనుమానంతో నేనా నాతో ఇంతకాలం ముభావంగా వుండి పోయావు?" కళ్ళు తుడుచుకుంటూ అడిగింది సీత

'పచ్చిపిల్లా ఏదో అలా అడగాను అంతే అంతేకాని నీ మీద నాకేమిటే అనుమానం' అదిపోనీ కాని సీతా- వున్న ఈ ఒక్క యిల్లూ అమ్మేస్తే ముందు ముందు ఏమవుతుంటట' ఎక్కడుంటారట' నీ భవిష్యత్తు ఏమవుతుంది" అణా పైసల్తో సహా నా పెళ్ళికి ఖర్చు పెట్టేస్తే నాన్నగారి ఆరోగ్యమెలా ఎలా సీతా' ఇవన్ని ఎలా జరుగుతయి అమ్మావాళ్ళు ఈ మధ్య నా కేమి తెలియనీయటం లేదు నాన్నగారసలు ఏమంటున్నారు

బేలగా అడుగుతున్న ఆమెను చూసి సీత హృదయం ద్రవించి పోయింది ముందు నీ పెళ్ళి కానీ- ఆ తర్వాత చూసిస్తాను నా తడాఖా' ట్యూషన్లు చెప్పుకొనయినా ఈ సంసారాన్ని నడిపిస్తాను డిగ్రీ కూడా చదువుతాను' అత్యంత ఆత్మ విశ్వాసంతో చెప్పింది

ఆఁ ఆఁ అన్నీ చేస్తావు? నాన్నగారి సంగతి తెలియనిదా? కంఠంలో ప్రాణముండగా తన కూతుళ్ళను కష్టపడ నిస్తాడా అయినా- ఇప్పుడు నా పెళ్ళి చేయకుంటే ఏమవుతుందని? ఆ రోజు నుండి నాకూ- నాన్నకు మధ్య అగాధం ఏర్పడింది సీతా' నాన్నకు నువ్వు నచ్చచెప్ప కూడదూ ఈ పెళ్ళి వద్దని ' కళ్ళలోకి నీళ్ళు వుబికి వస్తూంటే- మునిపంట దుఃఖాన్ని అదిమిపెడుతూ చెప్పింది లావణ్య

చిత్రంగా చూసింది సీత మొట్ట మొదటిసారిగా అక్క మాటల్లో- చూపుల్లో ఏదో మార్పు కనిపిస్తున్నది ఏమిటది? ఏమిటి? అంతు పట్టలేదు

అదేమిటక్కా! శుభమా అని పెళ్ళి జరగబోతూంటే అవేం మాటలు మందలించినట్లుగా అంది

నువ్వేన్నయినా చెప్పు సీతా' అమ్మా నాన్నలపై ప్రమాణం చేసి చెప్తున్నాను ఈ పెళ్ళి చేసుకుని కుటుంబాన్నంతా వీధి కెక్కించడం నా కిష్టం లేదు పిచ్చి సీతా' రేపు నీ పెళ్ళి కూడా జరగాలి అప్పుడెలా? శక్తి అంతా వుడిగిపోయిన అమ్మా నాన్నలకు ఈ సమయంలో డబ్బు అవసరం ఎంతో వుంటుంది ఆ అవసరం వచ్చినప్పుడు ఎవరి దగ్గర కెళ్తారో ఎవరు మాత్రం ఏం చూసి ఇస్తారు? అందుకె సీతా' నాకీ పెళ్ళి యిష్టం లేదు కన్నీరు పక్కనుండి జారి తలగడపై రాలుతూంటే చెప్పుకు పోయింది లావణ్య కళ్ళు విప్పకుండానే

లావణ్య ధోరణి ఎంతకూ అర్థం కాలేదు ఆమెకీ పెళ్ళి ఇష్టం లేదా? కాని ఇంకేం నిర్ణయించుకుంది? అంత ఖచ్చితంగా ఎలా చెప్తున్నది? అదే సమాధానం దొరక లేదు అర్ధరాత్రి దాటిందేమో' అక్కడే ఆమెపై చేయి వేసుకుని నిద్రలోకి జారి పోయింది సీత మళ్ళీ తెల్లవారేదాకా మెలకువ రాలేదు మెలకువ వచ్చేసరికి వచ్చేసరికి వచ్చేసరికి ఓహ్!'

అప్పుడు పగిలినయి ఆమె గుండెలు అక్కా అక్కా అక్కా మరో లోకంలోకి వెళ్ళి పోయిన అక్కకు వినిపించేటంత బిగ్గరగా పిలవాలనుకుంది కాని గుండెల్లోని ఆ ఘోష పెదాలు దాటి బయటకు రాలేదు ఎంతపని చేసావు అక్కా? మరే మార్గంలేక పోయిందా? నాన్నకు నచ్చ చెప్పవచ్చు కదా? వినకపోతే చివరికి ఎదిరించి ఏదైనా వుద్యోగం చేసుకోవచ్చు కదా' తొందర పడ్డావు- తొందర పడ్డావు- తొందర పడ్డావు ఈ సమస్యకు నీ మరణం పరిష్కారం కాదక్కా

నన్ను క్షమించక్కా! నేను మాత్రం నీలా చావను చావను చావనుగాక చావను'

(అయిపోయింది)

## ఇ"వేమన" పద్యాలు

### "తీపు"

తీపులో న తీపు తెలియంగ ప్రాణంబు
ప్రాణవితతి కన్న పసిడి తీపు
పసిడికన్న మిగుల పడతి మాటలు తీపు
విశ్వదాభిరామ వినురవేమ



సీరియల్

# ఆడపిల్లలు - అనుభవాలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

జరిగిన కథ –38 :శ్రీవిద్య, హేమంత్‌లు మళ్లీ కులుసుకుంటారు. శ్రీవిద్య తనపై హేమంత్ రాసి పెట్టుకున్న అభిప్రాయం చదువుతుంది. జగదీష్ స్థాపించిన పార్టీ వార్షికోత్సవంలో వరకట్న సమస్యపై శార్వాణి, మనిషి శీలం గురించి జగదీష్ ఉపన్యసిస్తారు. పెద్ద కూతురి పెళ్లి కన్నా ముందు చిన్న కూతురు ఆసిరమ్మ పెళ్లి చేయాలనే నిర్ణయానికి వస్తారు సావిత్రి తల్లితండ్రులు.

స్టార్ హోటళ్లో ఓపన్ చెస, కూల్‌డ్రింక్ తసుకుని సిప్ చేస్తూ ఈ విషయాలన్నీ అభిలాష్‌తో చెప్పింది సావిత్రి

కేశవరావు మోస్ట్ లక్కీయస్ట్ పర్సన్ ఐయామ్ అన్‌లకీ అన్నాడు అభిలాష్

తలపంచుకుని స్ట్రాతో పీలుస్తూ ఓరగా అతని కళ్ళల్లోకి చూసింది సావిత్రి

కాబోయె ఇల్లాలిని ప్రియురాలిగా భావించి కోరుకోవటం లవ్ కాదు లస్ట్ అన్నది అభిలాష్ కూల్‌డ్రింక్ తాగేశాడు

భార్యాభర్తలు ఒకరి నొకరు ప్రేమించుకోవటం ఆఫ్టర్ మ్యారేజ్ బెస్ట్ సీజన్, అంటే ఫస్ట్ నైట్ టు లాస్ట్ నైట్ అంటే యౌవ్వన మాధుర్యపు ఆఖరు అర్ధరాత్రి వరకూ హాయిగా ప్రేమించుకోటానికి అన్నేళ్ళు సర్వీస్ ఉన్నప్పుడు, ప్రేమను పెళ్ళికి ముందే ప్రారంభించటం అనవసరమైన ఆర్భాటం. అని నా ఉద్దేశ్యం అన్నది

సావిత్రి డ్రింక్ తాగేసింది బేరర్ బిల్లు ఇచ్చాడు పంచ రూపాయల నోటు ప్లేట్లో వేశాడు బేరర్ వెళ్ళాడు మిగతా డబ్బులు తేవటానికి

ప్రేమ + కోరిక = మోహం

ప్రేమ – కోరిక = ఇష్టం

ప్రేమ × కోరిక = పెళ్ళి

ఈ మూడు ఈక్వేషన్సులో నాక్కావాల్సింది ఇన్‌టూ గాని ప్లస్, మైనస్ కాదు అన్నది సావిత్రి, తియ్యగా తల్చుకుంటూ

బేరర్ ప్లేట్లో మిగతా డబ్బులు తెచ్చి టేబుల్ మీద ఉంచాడు రెండు రూపాయల నోటు ఉంచి మిగతా డబు తీసుకున్నాడు అభిలాష్

టిప్పుసుల్తాన్లు ఎంత ధన్యులో అన్నది సావిత్రి నెమ్మదిగా

'తిన్న పదార్థాలకి సూపర్ లగ్జరీ బిల్లుతో పాటు సేల్సుటాక్సును కూడా పే చేసి, ఋణవిముక్తుడయిన ప్రతీ కస్టమరూ ప్రిస్టేజీ కోసం, గౌరవంగా అతను అడక్కుండానే బక్షీస్ ఇస్తున్నాడే, అటువంటిది " అన్నాడు

కార్లో మాట్లాడుకుందాం, రండి" అని అతని మాటల్ని కట్ చేసింది

అవును అన్ని మాటలూ ఇక్కడే అయిపోతే కార్లో మాట్లాడుకోటానికి మాటల స్కేర్సిటీ వచ్చేస్తుంది ' జోక్‌గా అని ఇద్దరూ వచ్చేశారు కార్లో కూర్చున్నారు కారు మెత్తగా హార్బర్ రోడ్డువైపు వెళుతున్నది

కార్లో మాట్లాడతానన్నావు అన్నాడు

ఎస్, అటువంటి బేరర్‌కే టిప్పిచ్చినప్పుడు, ఇలాంటి ప్రేమించిన వాడికి ఓ ముద్దు ఎందుకివ్వరో ఈ ఆడపిల్లలు, అనేగా మీ భావం" అన్నది

ఎస్ కరెక్ట్ టు ది నియరెస్ట్ డెసిమల్ పాయింట్ అని లెక్కల్లో అన్నట్లుగా కరెక్ట్ టు ది నియరెస్ట్, నియరెస్ట్, బ్రాసెట్" అన్నాడు నెమ్మదిగా నెత్తిమీద కనకాభిషేకం, మనసు లోపల మమతాభిషేకం, వయస్సు లోపల ప్రేమాభిషేకం, పెదవుల్ని బిగబట్టి కుంచించుకుపోయి కూర్చున్నది కాస్త ఇవతలకు జరిగి, కుడి చేత్తో స్టీరింగ్, ఎడంచేత్తో నడుమును చుట్టేసి, చూపుడు వేలును బాగా జాపి బొడ్డులో చెయ్యిపెట్టి వాటుగా దగ్గరకు లాక్కుని, కాదు దగ్గరకు తీసుకుని. యౌవ్వన బావాలతో తనువెల్లా పులకరిస్తుంటే, తమితో ఆమె కళ్ళల్లోకి చూసి, ఆ చీరె కుచ్చెళ్ళల్లో నుంచీ అలవోకగా అక్కడక్కడా స్పృశిస్తుంటే, ఏదో అనబోయి. ఏమీ అనలేక, ఏదో అనాలి కనక "చీ పాడు, పాడు బుద్ధి" అన్నది చేతిని లాగి వేసింది

"చీ పాడులో నే, అబ్బో చూడు, అనే భావం కూడా ఉన్నది, ఇంతకీ రాత్రి ఎప్పుడు, అదే ఫస్ట్‌నైట్" అన్నాడు చెయ్యి ఇవతలకు తీసుకుని.

ఆ యవ్వనపు పులకరింత పలవరింత పెడుతూనే ఉన్నది

"చూడండి, మీరు నా నుంచీ ఆశించిన ప్రతీ కోరికనూ తీరుస్తాను, కాని పెళ్ళయిన తరువాత, ఇంతకీ అగ్ని పరీక్ష అయినట్లేనా?"

"అగ్ని పరీక్ష" అర్థంకానట్లు చూసేడు

అదే కోసలరామ్ ఆత్మ కథను నేను వినటం అన్నది

కాలేదు ఇంకా విన్నంత ఉన్నది, ఆ సరదాని అనుభవించటంలో అతను బహునేర్పరి చక్కని అనుభవం, అనుభూతి, ఎంజాయ్" అన్నాడు

* * * * * * * * *

ఆ మరుసటి ఆదివారం ఐదు గంటలకు వెళ్ళింది సావిత్రి బీచ్‌లో కోసలరామ్ అప్పటికే వచ్చి పది నిమిషాలయింది

"గుడ్ఈవినింగ్, రండి, కథ చెప్పే వాళ్ళు ముందూ, కథ వినే వాళ్ళు తరవాత రావటం ఒక చక్కని ఫార్మాలిటీ, కూర్చోండి" అన్నాడు సావిత్రి కూర్చున్నది

కవరులో ఉత్తరం చదివారా?' అడిగాడు

"లేదు '

'ఎందుకని'

"వారం రోజులు మనస్సును పాడు చేసుకోటం ఇష్టంలేక విజేత కథ విన్నాక నా అనుమానాలు మీతో చర్చించి కవరు విప్పితే, సీల్డు కీ సొల్యూషన్ పోటీలా థ్రిల్లింగ్‌గా ఉంటుందని చదవ లేదు' అని బ్యాగ్‌లో ఉన్న కవరు తీసి చేత్తో పుచ్చుకున్నది

"మీకు నా మీద సానుభూతి లేదన్నమాట." నిర్లిప్తతగా అన్నాడు కవరు చదువుకుని వస్తుంది అని అనుకున్న అతని ఆశ నిరాశ అయింది

విజేతకు మిమ్మల్ని నిజంగానే పెళ్ళి చేసుకోవాలని లేదు, మీ మీద కోరిక ఉన్నది కొంత మంది ఆడపిల్లల జాతక చక్రంలో కుజ దోషం ఉంటుంది అంటె అమ్మాయి భర్త కొద్ది కాలానికే చనిపోవచ్చు ఈ కుజదోషం పోవటానికి, కుజ దోషమే ఉన్న వరుడు కావాలి అట్లాంటి వరుడు దొరకని పక్షంలో ఇట్లా శుభలేఖల వరకూ వచ్చిన పెళ్ళి ఆగిపోతే అమ్మాయికి ఉన్న కుజదోషం పోతుందని అంచనా విజేత విషయంలో అదే జరిగి ఉండాలి తొందరపడి కన్యాత్వాన్ని కావాలని కాలరాచుకోవటం, యౌవ్వనపు తొందరపాటు, అని నా అభిప్రాయం' అన్నది సావిత్రి

అప్రయత్నంగా సావిత్రి చేతులు పుచ్చుకుని తన కళ్ళకు అద్దుకున్నాడు కోసలరామ్- అతను తన

చేతులు పుచ్చుకున్నందుకు కాస్త విచలితురాలయింది ఎవరయినా చూసేరేమోననే ఫీలింగ్ అటూ ఇటూ చూసింది ఎవరయినా చూసేరేమో తెలియదు అతనే చేతులు కళ్ళ కద్దుకుని వదిలాడు

నేను పొరబాటుగా మాట్లాడానా అన్నది

రెండు చేతుల్లోకీ ఇసక తీసుకుని కిందపోస్తూ, మళ్ళీ తీస్తూ, మళ్ళీ కింద పొయ్యి సాగింది

మీ ప్రెడిక్షన్ కరెక్టు, విజేతకు కుజదోషం పూర్తిగా ఉన్నది శుభలేఖల వరకూ పెద్దవాళ్ళకూ తెలుసు నాకు లొంగిపోవటం ఆమె ఇచ్చ, కోరిక అన్నాడు

కవర్లో ఉత్తరం చదివింది మాటల్లో తేడాఉన్నా జరిగింది అంతే ఆ తరవాత విజేత మరో డాక్టర్ని చేసుకుని, భార్యాభర్తలు అమెరికా వెళ్ళి పోయారు ఇది జరిగి నాలుగేళ్ళు దాటింది ఉత్తరం చదివి ఇచ్చేసింది సావిత్రి చించి సముద్రంలోకి విసిరేశాడు కోసలరామ్

స్త్రీ మనస్సు అగాధ మైనది, అంతు పట్టటం కష్టం

స్త్రీ హృదయం నవనీతం, కాని గట్టి పడిందా దాని ముందు వజ్రం కూడా ఎందుకూ పని చేయదు

స్త్రీ తను నమ్మిందా ప్రాణాన్నయినా త్యాగం చేస్తుంది, ఎదురు తిరిగిందా ప్రాణం తీస్తుంది

ఇత్యాది సామెతలూ, సూక్తులను గురించి మీ ఉద్దేశ్యం అన్నాడు

సముద్రపు అలల వైపు చూస్తూ కూర్చున్నది వేరుశనక్కాయలు అమ్మే కుర్రవాడొచ్చాడు రెండు పొట్లాలు కొన్నది సావిత్రి అతనికో పొట్లాం ఇచ్చింది కాయలు వొలిచి పప్పుల్ని తింటున్నారు

ఎక్కడన్నా సరే వేరుశనక్కాయల్లో ఒక తమాషా ఉన్నది, తిన్న కాయల్లోని పప్పులన్నీ బానే ఉంటయ్యి కాని ఆఖరు కాయలోని పప్పులు మాత్రం చేదుగా ఉంటయ్యి అన్నది సావిత్రి

స్త్రీహృదయం కూడా అంతే, అన్నిమాటలూ మాట్లాడం తరవాత చివర్లో అయిష్ట ప్రభావాలు వ్యక్తం చేసి వెళ్ళిపోతుంది అన్నాడతను

ఇద్దరూ కాయలు పూర్తిగా తినేశారు అతని పొట్లం లోని ఆఖరు కాయలో చేదు పప్పులు సావిత్రి పొట్లంలోనీ అన్ని కాయలూ మంచివే

మీ అభిప్రాయం కరెక్ట్ నేను వేరుశనగ పప్పే కాదు జీవితంలో కూడా చేదునే అనుభవించాను నేను చెప్పిన సామెతలూ, సూక్తులూ

'సామెతలూ, సూక్తులూ అనేవి ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని బట్టీ, సమకాలీన మనుష్యుల మనోభావాల్ని బట్టీ ఏర్పడినవి ఆనాటి నిరక్షరాస్యుల్ని ఎడ్యుకేట్ చేసి, వారిని సాంఘికంగా సద్భావాలతో చైతన్య వంతుల్ని చెయ్యటానికి, ఆ నాటి మేధావులు వల్లె వేసిన పసిడి పలుకులు– నిరక్షరాస్యులు ఎక్కువగా ఉన్న ఆరోజుల్లో ఆ' సామెతల్ని, సూక్తుల్ని తమ జీవిత సమస్యలిక్కడా ఎక్కువగా అన్వయించుకుని, ఆ సూక్తుల్ని మననం చేసుకునేవారు నిరక్షరాశ్యత ఉన్న వ్యక్తిలో స్త్రీ అయినా, పురుషుడయినా, వారి మనోభావాల్లో ఒక విధమైన గద్దరితనం, పడివాదన, పట్టుదల ఏర్పడుతుంది ఆకాలంలో చదువుకొని స్త్రీలు చాలా ఎక్కువగానే ఉండేవారు మంచితనంగా సర్దుకు పోయె స్వభావమే వారికి ఉంటుంది కాని తన వ్యక్తిత్వానికి, మనుగడకీ ముప్పు వచ్చిన రోజున సరయిన సమాధానాలతో రీజనింగ్‌గా ఎదుర్కొనే శక్తి, మానసిక పరిపక్వత లేక ఎక్స్ట్రిమిటిస్‌కి, గద్దరితనం, దబాయింపులోకి వెళ్ళి పోయేవారు మధ్యే మార్గం



# దూరదర్శనం

లత

బుధవారం వచ్చిన ఫౌజీ సైనిక నాటకం ఈ వారం చాలా రక్తిగా, రమ్యంగా, కొద్దిగా శృంగారంతో బాగుంది- పై నుంచి పేరాచూట్ ద్వారా దిగిన ఆడపిల్ల హీరోమీదపడింది శృంగార హాస్యాల మిళితంగా ఉంది ఈ సంఘటన

కోడలా- కోతలా- శుక్రవారపు తెలుగు నాటిక ఈ రోజుతో అయిపోయింది సూర్యకాంతమ్మగారి నటన బాగుంది కథ ఏవో సో సో

## రామాయణం

ఆర్యసభలో వశిష్ఠ విశ్వామిత్ర భరద్వాజాది మహా ఋషుల సూక్తులు విన్న తరువాత గూఢచారి చెప్పిన గౌతమీ తీరనివాసులైన భార్యా భర్తల తగాదాని గురించి తెలుసుకోడానికి రాముడు స్వయంగా బయలు దేరాడు ఇది తులసీ రామాయణంలో ఉందేమో కాని మరే రామాయణం లోనూ లేదు ఏమయినా మారువేషంతో వెళ్ళి విని సీతని అనుమానించడమే కరెక్ట్ అనుకున్నాడేమో రామానందసాగర్ స్త్రీని సమానత్వం నుంచి దించడానికి కల్పించిన కథ ఇది సమాన హోదాలో ఉన్న మహారాణిని అనుమానించటం కల్పితం - అలాటి లోక బీతి- విచక్షణారాహిత్యం శ్రీరామపాత్రకి లేవు అగ్నిపరీక్ష అదీ కల్పితమే అయినా- అనంతరం ఇంకా సీతని లోకుల వాగుడుకి అనుమానించటం రామపాత్రని కించపరచటానికి - బౌద్ధులో జైనులో ఇరికించిన ప్రక్షిప్తం ఇది దీనితో నేను ఏకీభవించను

## భారత్ ఏక్ ఖోజ్

ప్రొఫెసరు శంకాలియా ఆత్మకి శాంతి కలుగుగాక (మరో శంకాలియా లేడనే నా ఉద్దేశ్యం)

విరోచనుడుకి చంద్రగుప్తుడికీ రాజ్యం పంచుతానని - అతన్ని చంపించి- అమాత్య రాక్షసుడిని మంత్రిని చేస్తాడు చాణక్యుడు

సాలం కాయన బౌద్ధ భిక్షువుని ఆశ్రయిస్తుంది సుహాసిని నందవదానంతరం - ఆమెను మర్చిపోలేడు చంద్రగుప్తుడు- చాణక్యుడు నేను బ్రాహ్మణుడిని నా గ్రంథం పూర్తి చేయటం నా ధర్మం అని శెలవు తీసుకుని వెళ్ళిపోతాడు- కాని చంద్రగుప్తుడు చాణక్యుడి దగ్గరకెళ్ళి కిరీటం ఇచ్చి జైన భిక్షువునవుతానంటాడు నా ధర్మం సమాజ ధర్మం నీది నీధర్మం అని బిందుసారుడిని చక్రవర్తిని చేయమన్న చంద్రగుప్తుడి మాట మన్నిస్తాడు చాణక్యుడు- కాని చంద్రగుప్తుడు తన పాత ప్రియురాలు సవతితల్లి అయి వితంతువైన తరువాత వివాహం చేసుకుంటానంటాడు- ఆనాటి వేదధర్మం మహారాణి వితంతువూ సవతితల్లీ అవటం అనుమతించదు చాణక్యుడు తన నీతితో ఒక మహాసామ్రాజ్యాన్ని ఇచ్చినా నిలుపుకోలేని దౌర్భాగ్యుడు చంద్రగుప్తుడు కాని చరిత్రలో ఈ కథ నెహ్రూజీ వ్రాశారు గాని ఆంధ్రులు వ్రాయలేదు అంత మాత్రాన ఇది అబద్ధమూకాదు

వీర బాలక్ - అనే శీర్షికన ధైర్యవంతులయిన పిల్లలకు ప్రధానమంత్రి స్వయంగా సత్కారం చేసి, గౌరవం చేయటం బాగుంది అందులో లక్ష్మి అనే చిన్నపిల్ల ఆంధ్ర బాలిక ఉన్నది టి వి లో ఆ పిల్లని పరిచయం చెయ్యాలని కోరుతున్నాను ●

## ఆడపిల్లలు - అనుభవాలు

వారికి తోచేది కాదు ఈరకమైన ఆనాటి స్త్రీ మనస్తత్వాన్ని తీసుకొని, మేధావులు స్త్రీ హృదయాన్ని గురించి, అందమైన సూక్తుల్ని భాషా పరంగా వాడుకుందుకి తెచ్చారేమోనని నా ఉద్దేశ్యం అన్నది సావిత్రి

సావిత్రి ఈ అభిప్రాయాల్ని మనస్సులోకి తీసుకున్నాడు కోసలరామ్ కాని అతని ఉద్దేశ్యాలు అతనివి

'ఒక్క మాట అంటాను కోపం రాదుకద'

"చెప్పండి'.

"నా భార్య కూడా చదువుకున్నదే, బి ఏ పాసయింది".

'ఎక్కడున్నారు అతని జీవితంలోని అన్ని సంఘటనలూ ఒక్కొక్కటే అగాధమైన అతని మనస్సులో సముద్రపు కెరటాలు మాదిరిగా నెట్టుకొంటూ వచ్చి, చెల్లా చెదరై పోతున్నయ్యని అనుకున్నది.

"జీవించే ఉన్నది ఈ భూమ్మీద, చదువుకున్నదయినా ఆవిడా గడ్డరిది, దబాయించ గల నేర్పరి రీజనింగ్‌గా మాట్లాడి, సమస్యని పరిష్కరించలేని చదువుకున్న మూర్ఖురాలు" అన్నాడు కోపంతో మానసిక వ్యథను అణిచి పెట్టుకుని

సావిత్రి కాస్త ఆలోచించటానికి అవకాశం కలిగింది

"కోసలరామ్ గారూ, నా భావాల్ని మీరు సరిగా అర్థం చేసుకోలేదు చదువుకొని ఆడపిల్ల లేక వివాహిత స్త్రీ మంచిగా, అణుకువగా ఉండి, తన వ్యక్తిత్వానికీ, మనుగడకీ ముప్పు వచ్చినప్పుడు సరయిన పరిపక్వ భావాలతో సమాధానం చెప్పలేక గడ్డరి తనం లోకి వెళ్ళిపోతుంది. అన్నాను అదే సమస్య చదువుకున్న ఆడపిల్లల, లేక చదువుకున్న స్త్రీ అయితే పరిపక్వమైన భావాలతో సామరస్యంగా సమాధానం చెప్పి, పరిష్కారానికి వస్తుంది కాలక్రమేణా స్త్రీలో వచ్చిన ఈ మార్పునూ, మానసిక భావ పరిణతినీ, కొంత మంది పురుషులు హర్షించలేక, ఈ చదువుకున్న స్త్రీని అల్లరి పెడుతున్నారని నా ఉద్దేశ్యం అన్నది సావిత్రి

ఏదో చెప్పబోతున్నాడు కోసలరామ్- బీచి రోడ్డు దిగి, బీచ్‌లో నడుస్తూ వస్తున్న ఇద్దర్ని చూసేడు ఒకరు అభిలాష్, రెండో వారు విమల.

"హల్లో గుడీవినింగ్ కోసలరామ్ మీరిద్దరూ ఇక్కడ ఉంటారని నాకు తెలుసు హోటల్లో అనుకోకుండా శ్రీవిద్య, హేమంత్, విమల కనిపించారు కాసేపు కబుర్లు, వారిద్దరూ ఏక్సర్ కెళ్ళారు, ఇక్కడ నిన్ను చూపిస్తానని విమలను తీసుకొచ్చాను. అన్నట్టు సావిత్రి, విమల పేరు వినే ఉంటావుగా, ఈ అమ్మాయే ఒకరి నొకరికి పరిచయం చేశాడు అభిలాష్

విమల వైపు చూసింది సావిత్రి చాలా స్టైలిష్ గా, ట్రిమ్‌గా ఉన్నది చూపుల్లో కాస్త గర్వం, ఏదో తెలియని నిర్లక్ష్య భావం బుగ్గన వక్కపలుకు, ముందుకు దూసుకు వచ్చేట్టు సెక్సీ నడక

కూర్చో విమలా, శ్రీవిద్య బావున్నదా కుశల ప్రశ్నగా అన్నది సావిత్రి

'ఆవిడగారికేం, మహారాజా కాంప్లెక్సులాంటి అందమూ, డబ్బూ, ఆనందమూ ఉన్న బోయ్ ఫ్రెండ్, కాబోయే శ్రీవారితో అవబోయే శ్రీమతి షికార్లు సరే కోసలరామ్‌గారు మరి గొంతులో నల్ల పూసయి పోయారు ప్రతీ ఆదివారం సాయంత్రం మీ జీవిత చరిత్రని వినిపిస్తున్నారట్టగా, మంగళహారతి వరకూ వచ్చిందా అని పెదవి కొరుక్కుంటూ అయిష్టతగా అక్కడ కూర్చోడం ఇష్టం లేక చూసింది-

కొందరి జీవితానుభవాలు వారి జీవితాల్ని నవ్వుల పాలు చేస్తాయి కొందరు విషాద గీతాలు పాడుకుంటూ ఉంటే, కొందరు సానుభూతికోసం సహృదయులయిన వారి ముందు తమ తప్పుల్ని ఒప్పేసుకుంటారు. అవునా కోసలరామ్" అన్నాడు అభిలాష్

'ఎస్ ప్లీజ్' అన్నాడు కోసలరామ్

'విమలా, రేపు మాట్లాడు కుందాం, ఇవాళకి వెళ్ళిపో' అన్నాడు మళ్ళీ విమలతో.

'వెళ్ళను, ఇవ్వాళ నీతో కలిసే వెళ్ళాలి

ఏదో నిర్ణయాన్ని తీసుకు వచ్చినట్లే చూస్తూ అన్నది

అతని ముఖంలో విసుగు కనిపించింది

కోసల్, నాలుగో అధ్యాయం మళ్ళీ ఆదివారం వినిపిద్దువుగాని, మీరిద్దరూ వెళ్ళిరండి, ప్లీజ్ నా మాటవిను అన్నాడు అభిలాష్ అయిష్టంగానే లేచాడు అతనూ, విమల వెళ్ళిపోయారు

సావిత్రీ, నేను సత్యవంతుణ్ణి, విమల వైపు నువ్వు ఎంతసేపు చూసినా తనివి తీరదు అన్నాడు సావిత్రి భుజం తట్టి అభిలాష్-

విమల జీవితం సానుభూతితో మనస్సులో అనుకున్నది సావిత్రి (ఇంకా ఉంది)

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళ్లలో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ ఢిల్లీ 110008



Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

# వారఫలం

**10-2-1989 శుక్రవారం నుండి 16-2-1989 గురువారం వరకు**

**మేషం** · ధన విషయంగా ఎలాంటి యిబ్బంది లేదు నూతన వ్యాపారానికి అనుకూల వారం పూర్వార్థం యోగదాయకం పత్రికా రంగాధికారులకు అనుకూలం స్త్రీలకు చెప్పరాని అవకాశాలు అన్ని రంగాలలో ఏర్పడుతాయి బహు లాభ దాయకం

**వృషభం** : గ్రహించాలి దరిదాపుల్లో మేలు జరుగుగలదని అనుకొన వీలులేదు నూతన మిత్ర సమాగమం రాజకీయంగా మేలు చేకూరుట నిశ్చయం. యత్నించి చూడండి స్త్రీలకు ఉద్యోగ యత్నం సానుకూలం 15, 16 తా లందు నిశ్చయం సబా గౌరవం కొందరకు నిశ్చయం

**మిధునం** : ఆదాయ లోపం లేదు మాటకు తిరుగులేదు పిత్రార్జితం యిబ్బందులకు గురి అవుతుంది అవకాశవాదులు వెంటబడుతారు ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మేలు స్త్రీలకు సభా మర్యాద, ఉత్తముల సాహచర్యం, వృత్తి వికాసం ఇంట శుభ ప్రస్తావనలు

**కర్కాటకం** : వారం పూర్వార్థం అధిక యోగం ఇటీవల చెడిన స్థిరాస్తి, యిబ్బందికి గురియైన ఆస్తి మరలా క్రమక్రమంగా పుంజుకొనగలదని, ప్రభుత్వ పరమైన ఆదాయం, సానుభూతి, చేకూరగలదని గ్రహించాలి స్త్రీలకు 15, 16 తా లందు· బంధు వర్గీయుల మూలంగా డబ్బు సంక్రమింపవచ్చు గ్రహించాలి

**సింహం** : నూతన మిత్ర సమాగమం ఉద్యోగస్థుల మూలంగా అదిక ఆదరణ చేకూరుతుంది వృత్తి యందు పెంపు చేకూరుతుంది పత్రికా రంగాన చక్కని అవకాశాలు లభ్యమవుతాయి ఇంట శుబ ప్రస్తావన లుంటాయి అవకాశ వాదులను దాపునకు చేర్చకండి స్త్రీలకు సుఖ శాంతులు, ఆదాయ వృద్ధి

**కన్య** : ·దూరబారాల నుండి బంధువులు రానున్నారు మాటకు అధిక గౌరవం చేకూరుతుంది లాభ ప్రదాయక వారం సభా మర్యాద యున్నది, అధికాదాయ మున్నది ఒక్క శని తప్ప తక్కిన గ్రహాలు యోగాన్నిస్తాయి ఆరోగ్యరీత్యా జాగ్రత్త పడుట గమనింపతగిన అంశం స్త్రీలకు – ఆదాయ లోపం లేదు సభా గౌరవ మున్నది వృత్తిలో పెంపు కనిపిస్తుంది, గ్రహించాలి

**తుల** : ఏనాడో జరుగ వలసిన వ్యవహారాలు ఈ వారంలో సానుకూలం కాగలవు మీ వృత్తి సర్వాదరణీయంగా అభివృద్ధి నందగలదు ఇటీవల దెబ్బతిన్న స్థిరాస్తి వ్యవహారాలు సానుకూలం కాగలవు స్త్రీలకు ఉద్యోగమందు అవకాశం

**వృశ్చికం** : రాజకీయవాదులకు మేలు మాటకు అధిక గౌరవం పూర్వార్థం మరీ లాబదాయకం మీరు వ్యాపారస్తులా అధిక లాభం శుభకార్యాలో చన లున్నాయా తప్పక అనుకూలం స్త్రీలకు ధనవసతి, ఉత్తమ మిత్ర సహకారానికి లోటు రాదు

**ధనుస్సు** : వారమంతా మేలున్నది మబ్బు వదలిన సూర్యునిలా వెలుగుతారు రాశి యందున్న శని చర్య క్రమంగా తగ్గుముఖం పట్టి లాభ దాయక, అనుకూలదాయక, ఆనందదాయక ఘడియలు రానున్నవి స్త్రీలకు సకల విధాలా యోగమున్నది ఆనంద దాయక వారం

**మకరం** : వారం వారం యిలాగేనా అనుకోకండి ఈ వారాంతాన మీరు ఆశించిన పైకం అందుతుంది, వృత్తియందు ప్రసిద్ధి ఏర్పడుతుంది మాట మంచితనం, పదిమందిలో పేరు ప్రఖ్యాతులు లభ్యమవుతాయి స్త్రీలకు విదీ విరామ మెరుగని పనులు, అవీ లాబదాయకాలు కావటం గ్రహిస్తారు

**కుంభం** : లావాదేవీలలో యిబ్బంది రాకుండా చూచుకోండి అయినవారి సంబంధం నిశ్చయం కానున్నది అనుకూల వార్తా శ్రవణం దాయాది వర్గాన్నుండి ఏదో లాభం పొందనున్నారు చెడిన వ్యవహారాలు మధ్యవర్తుల వలన ఈనాడు సానుకూలం కాగలవు స్త్రీలకు ధన ధాన్య వసతి

**మీనం** : పత్రికాధిపతులకు, రచయితలకు, పాత్రికేయులకు, పంపిణీదారులకు, అనుకూలం ఇటీవల చలన చిత్రరంగాను కూలత గలవారు, చాల మందికి దెబ్బ తగిలింది, క్రమంగా ఈ రాశి వారు కోలుకో గలరు ప్రభుత్వపరంగా కొంత అనుకూలం స్త్రీలకు సర్వవిధాలా అబివృద్ధి, ధన ధాన్యవసతి, అవివాహితులకు ఈ వారం శుభ దాయకం, గ్రహించాలి

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి




Printed and Published for Nageswararao Estates Private Ltd; by S Nageswararao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Chief Editor S Radhakrishna, Advisory Editor Veeraji, Editor M Madhavarao Phones Bussiness 61247, 61248, 75569 and Editorial 75667

సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

# గళ్ళ నుడి కట్టు – 4

## ఆధారాలు

**నిలువు**

1 ఇంద్రుడు
2 పైకమడిగితే పడిపోతాడు తల క్రిందుగా
3 ప్రేమకు వ్యతిరేకం
4 మొదలు ముద్దుతో స్త్రీ
6 కొండ మీదుంటుంది
8 వారకు విభక్తి కలిపితే అవతలి గట్టు
9 నిండినది
12 మన ప్రాచీన నాగరికత ముందుగా వుంచి వ్రాస్తే ఏనుగు
13 ప్రభువన్నా చంద్రుడన్నా అదే మాట
15 చినిగిన వస్త్రాలవాడు కృష్ణుని చెలికాడు
16 పాపము
17 క్రింద నుండి సూర్యుడు

**అడ్డం**

1 మంచి కంఠం గలవాడే కాని తో కుంది
3 మనస్సుకు ఇది కలిగితే గొప్పవాడవుతాడు
5 లోకం మాట సామెత
7 బ్రాహ్మణుడు తిరగబడ్డాడు
9 ఈరెమ్మ ఆడవాళ్ళ కొప్పుకు అందం
10 లక్ష్మి
11 గురువుగారి భార్య ఆకాశమంతా ఆమే
12 12, నిలువుకు శత్రువు
14 అటు నుండి వ్రాస్తే దర్భ
16 సూర్యవంశపు రాజుకు బ్రహ్మకు ఒకటే పేరు
18 మొదలు చివర ముతో అడ్డం తిరగబడింది
19 పరశురాముడు

ఆధారాలున్నాయి. నుడి కట్టు గళ్ళు నింపండి! కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి రు. 200/-లు బహుమతి లభిస్తుంది–ఒకరి కన్నాఎక్కువమంది కరెక్టు ఆన్సర్‌లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే !

–సం

గడువు : 24–2–1989



ఆంధ్రసచిత్రవారపత్రిక

పంపిన వారిపేరు : ..............................................

పూర్తి చిరునామా : ..............................................

..............................................

.............................................. పిన్‌కోడ్

# సాహితీ పజిల్

## గళ్ళ నుడి కట్టు –2

### బహుమతులు




వందలాది మంది అమితోత్సాహంతో పాల్గొన్నారు అంతేగాదు ఆల్ కరెక్ట్ జవాబులు అయిదుగురు పంపారు బహుమతి మొత్తం రు 200/లను ఐదుగురికి సమానంగా పంచగా ఒక్కొక్కరికి రు 40/– లు వస్తాయి. ఈ దిగువ ఐదుగురికి నగదు బహుమతి పంపే ఏర్పాట్లు చేస్తున్నాము

–సం

### సరియైన జవాబు పంపిన వారి పేర్లు

ఆర్ సర్వేశ్వరరెడ్డి (కొప్పలకొండ), అలపర్తి వెంకటేశ్వరరావు (నందివెలుగు), మచ్చా సత్యనారాయణ (ఖమ్మం), ఐ అచ్చమాంబ (ముట్లూరు), డి శారద (జాలూరుపాడు)

★ ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు–

★ మళ్ళీ ప్రయత్నించండి ఒక్కరు ఎన్ని కూపన్‌లను అయినా పంపవచ్చు

### జవాబులు

| అడ్డం | | నిలువు | |
|---|---|---|---|
| 1. | ప్రతిన | 1. | ప్రత్యక్షం |
| 6 | వనము | 3. | తాపము |
| 11. | యకాపాట | 5 | వృకోదరుడు |
| 17. | కడు | 9. | కరటకుడు |
| 3. | తాటక | 12. | కల |
| 8. | లిక | 15. | జలము |
| 13. | డువీ | 2. | నలువ |
| 18. | యమము | 4. | కనలి |
| 5. | వృక్షం | 7. | నన |
| 10 | దక్షిణము | 14 | వీణియ |
| 15. | జలగ | 16. | గరిగ |
| 19. | గయుడు | 17. | కనడు |

# వీక్లీ పోస్ట్

( 4 వ పేజీ తరువాయి)

## అయోమయస్థితి

మతజాడ్యం నల్లమందు లాంటిది అన్నారు కానీ నేడు ప్రశాంతమైన ఆంధ్రలో మతజాడ్యం కాదు. కులజాడ్యం ప్రవేశించింది బాధ్యతాయుతమైన పదవుల్లో ఉన్న ప్రజా నాయకుల ద్వారానే పెచ్చు మీరిన ఈ కులజాడ్యం ఎంత వినాశనానిక దారితీసిందో చూస్తే మానవత్వం ఉన్న ప్రతివారూ కంట తడి పెట్టక మానరు ముఖ్యంగా క్రొత్త సంవత్సరంలో సంతోషంగా అడుగిడ వలసిన సమయంలో కుల రాజకీయాల వల్ల నష్టపోయిన అమాయక సోదరుల్ని గుర్తు చేసుకుంటుంటే వాళ్ళకు నూతన సంవత్సర, శుభాకాంక్షలు చెప్పాలో, లేక సానుభూతి ప్రకటించాలో, సమాజ వ్యతిరేక శక్తులను ఎదుర్కొనే పవిత్ర పావులుగా కమ్మని సలహానీయాలో తెలియక అయోమయ స్థితిలో పడిపోయాను ఇక ఈ వారం మన పత్రిక నెలా చదువగలను?/ -ప్రసాద్ పి యన్.(వియ్యంపేట)

## డేరింగ్ కార్తి

వింజమూరి విజయశాంబవి గారి కలం రెండు వారాలుగా చదివిస్తున్న సూపర్‌గర్ల్ కథానాయికి కార్తి డేరింగ్ ఎండ్ డాషింగ్ నేచర్ ఇన్‌ట్రస్టింగా



పోలీసు ఫైరింగ్ దృశ్యాలు మా చిత్రంలో అంత సహజంగా చిత్రీకరించటానికి గల కారణం- నిజంగా ఫైరింగ్ జరుగుతున్నప్పుడు ఒక రీలు తీసాం!

వుంది టిట్ ఫర్ టాట్ శీర్షిక ఆసక్తకరంగా వుంది కాకగూడు కథ బాగుంది డామ్మని ప్రేలిపోయిన బోయింగ్ హృద్యంగా వుంది ఇటు విజ్ఞానం అందించే ఆర్టికల్స్ అటు వినోదం కల్గించే అంశాలు, ఆకట్టుకునే సీరియల్స్ మరెన్నో ఉపయోగకరమైన విశేషాలతో నిండి వున్న పత్రికలో ఒక లోటు కనిపిస్తున్నది ఇది విమర్శ అని విసరిపారేస్తారో సూచన అని పరిశీలిస్తారో ఇక మికే వదిలేస్తున్నాము విద్యార్థులు పాల్గొనే ప్రత్యేక ఉపయోగకరమైన శీర్షిక లేక పోవడం వ్వ!

-కె హనిత, (ఏలూరు)

## విజ్ఞానదాయకాలు

23-12-88 టూ 30-12-88 ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రము నటి శోభన మా కళ్లను ఆకర్షించింది ఎంతో చూపు మళ్లించి లోపలి పేజీలలోకి పోవాలన్న మా కళ్ళు ససేమిరా శోభనను విడచి. రానంటున్నాయి ముఖచిత్రంలో కూడా ఇంత ఆకర్షణ ఉంటుందా? అనిపించింది ఈ మధ్య ఆంధ్రసచిత్ర వార పత్రిక నూతన శీర్షికలతో కొత్త పుంతలు తొక్కుతున్నదనటంలో సందేహము లేదు సీరియల్స్, కథలు వినూత్న శీర్షికలతో ఒ సూపర్బ్, పత్రిక కొన్నప్పటినుండి ఎంత ఒ చదివేద్దామా అన్న ఆత్రుత కాని ప్రతి పేజీ విజ్ఞానదాయకము ఏ పేజి చదవడం మానేస్తా, చెప్పండి?

-యస్ మహమ్మద్ రఫీ
యస్ అచ్యుతము,(కాశీబుగ్గ)